శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ శంకరారాధ్య చరిత్రము

గ్రంథకర్త
మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు
ఉపాధ్యాయులు, నారసింహ సంస్కృత కళాశాల
చిట్టిగూడూరు

# తొలి పలుకు

భాషాభిమానులారా

శ్రీ శంకరారాధ్య చరిత్రము పద్యకావ్యముగ వ్రాసినవారు మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు. వీరిది కౌండిన్యస గోత్రము ఆపస్తంబ సూత్రము ఏకోరామసిద్ధ సాంప్రదాయకులు. ఉభయ భాషా పరీక్షయం దుత్తీర్ణులై చిట్టిగూడూరులోని నారసింహ సంస్కృత కళాశాలయం దుపాధ్యాయులుగ నున్నారు.

వీరి జననీ జనకులు దుర్గాంబా మల్లికార్జునారాధ్యులు. నల్వురు సోదరులు గలరు. వీరి పూర్వీకుల నివాసము కృష్ణాజిల్లాలోని పెదన గ్రామము. తండ్రిగారు యలమర్రుకవంశ దేశోద్ధారకుని నాహ్వానమున వచ్చియుండి ప్రస్తుతము బందరు దగ్గర నున్న చిట్టిగూడూరులో నున్నారు

తండ్రిగారివలె కుమారులును రసవంతమగు చక్కని ప్రబంధ కవిత్వము చెప్ప గలరు ప్రౌఢవర్ణనలు - కల్పనాశక్తి - లాక్షణికపదప్రయోగము - సమయోచిత సందర్భములు - ధారాశుద్ధి వీరి కవితలో గోచరించుచుండును కాంచీఖండము, గురుదక్షిణ మొదలుగాగల తొమ్మిది గ్రంథముల రచించిరి ఈ శంకరారాధ్య చరిత్రను మ॥ రా॥ ఆకారపు నరసింగం గుప్తగారికి కృతిగ నొసంగిరి.

కృతిభర్తయగు నరసింగం గుప్త శ్రీమంతు డగుటయేగాక ధీమంతుడు. విశ్వేశ్వర గ్రంథమాల యను పేరుతో 15 గ్రంథములు ముద్రింపించినాడు లక్షలు వ్యయ పరచి విశ్వేశ్వర దేవాలయము కట్టించినాడు విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలను వేదపాఠశాలను - విశ్వేశ్వర పుస్తక భాండాగారమును నెలకొల్పినాడు.

నెలకు 140 మంది బ్రాహ్మణులకును, 140 మంది వైశ్యులకును అన్నసత్రము స్థాపించినాడు పదివేలు ఖర్చుపెట్టి జగద్గురు నీలకంఠారాధ్య విరచితమగు బ్రహ్మసూత్రభాష్యమును కీ. శే శివయోగి మదిగొండ నాగలింగశాస్త్రిగారిచే వ్రాయబడిన శివచింతామణిప్రభ యను వ్యాఖ్యానముతో ముద్రింపించినాడు. ప్రతి సోమవారము శివపూజ సువర్ణపాత్రములతో నాచరించును. తత్కాలమున రుద్రసూక్తముల జెప్పు వైదికుల దానధర్మముల దృప్తిపరచును. శివపూజయందు పరాకాష్ఠ మెండు. గురుచరేశ్వర భక్తి అధికము ఆకారపు వంశమున మాహేశ్వరభక్తి మిక్కుటముగ నుండుటచేతనే, వీరి పెత్తండ్రిగారగు మ॥రా॥ ఆకారపు వెంకన్నగారును, తండ్రిగారగు

మ॥ రా॥ ఆకారపు చెన్నయ్యగారు గణార్చన జరుపుటకై శ్రీ. లో. శంకరారాధ్యుల వారికి నొక గృహము నొసంగియుండిరి ఆ గృహము నేటివరకు "శంకరయ్యగారి సత్రము" అని పిలువబడుచున్నది.

ఆ శంకరారాధ్యులవారే యీ చరిత్రకు నాయకుడు. శంకరారాధ్యులవారి యింటిపేరు ముదిగొండవారు భారద్వాజసగోత్రము ఆపస్తంబసూత్రము. మొట్ట మొదటి నివాసము సత్తెనపల్లి తాలూకాలోని నందిగామ. దీనినే పల్నాటిసీమ యందురు.

వీరి జననీ జనకులు శేషెమ్మమంత్రమూర్తులు. పినతండ్రి వీరభద్రారాధ్యులు. ఈ కవీంద్రులే పల్నాటి వీరభాగవతము - ద్వాదశారాధ్య చరిత్ర అను రెండు ప్రబంధ ములు రచించియున్నారు

శంకరారాధ్యులవారి గురువు ముదిగొండ లింగమూర్తిగారు పాదపూజా మహే శ్వరులు పండితారాధ్యుల రాజలింగారాధ్యులవారు శంకరారాధ్యులవారి సతీమణి పార్వతమ్మ వీరి కొక కుమార్తెయు, కుమారస్వామి యను నొక కుమారుడును గలిగిరి ఆరాధ్యులవారు తాము వేదశాస్త్ర సంగీతాధ్యయనము లొనరించుటయేగాక వేదశాస్త్ర పాఠశాలల బెట్టించిరి మత వివాదములలో పాల్గొని జయభేరి మ్రోగించిరి

సుమారు 8 శైవసభల కధ్యక్షత వహించిరి లక్ష తొంబదియారువేల గణా ర్చన లొనర్చిరి నవరసలు, వెండి గిన్నెలు, పళ్ళెములు, ఆభరణములు, శాలువలు, రూపాయలు విశేషముగ దానధర్మము లాచరించిరి. 300 గ్రామములు సంచరించి శివభక్తిని బోధించిరి శివభక్తి బోధకములగు కీర్తనలు, భావలింగ శతకము, తటస్థ గ్రామ పంచరత్నములు మొదలగు గ్రంథముల రచించి ముద్రింపించిరి. ఈ పురమునందలి శబ్దానుశాసన భాండాగారమునకు శాశ్వతముగ గృహదానము చేసిరి. నిత్యము ఆర్గురు మాహేశ్వరులు తన పంక్తియందున్నగాని శివపూజ సేయని వ్రతము గలదు.

షట్కాల శివపూజ నిరంతర మాచరించువారు శంకరారాధ్యులవారి హృద యము కనుగొనవలెనని పండిత పామర సుబోధకముగ వారు రచించిన శివభజనకీర్త నలు - తటస్థగ్రామ పంచరత్నములు - రెండు పుస్తకములు చదివిన చాలును.

శంకరుని మాహేశ్వరభక్తి కళ్యాణకటకమందలి బసవేశ్వరునికివలె అధికము కావున నే,

కం. గురులింగంబుల సాటిగ

చరలింగము జూడవలయు సద్భక్తి లిలన్

హరుసాజ్ఞ శిరము నుంచుక
గురుచరణ ధ్యానయోగ గుండా నాగా॥

చరపాదపూజ సేయని
నరుపై శివకరుణ గల్గునా ధరలో
హరపూజోత్సవరాగా
గురుచరణధ్యానయోగ గుండా నాగా॥

"చరుడే సర్వాధికుండు శంకరలింగా." అని వచించినాడు. శంకరారాధ్యుల వారి కాలమున కొమరవెల్లవారు, ఆకారపువారు, కొండూరివారు, చింతాలవారు, రామిణివారు, గుండావారు మొదలగు గృహనామములు గల వైశ్యులును - మాచెర్ల రామన్న, బెలదె రామన్న, ప్రొద్దుటూరి వీరన్న, కైలాస శరభయ్య మొదలుగాగల సికింద్రాబాదు వర్తకులును - వారు వీరనక ఎల్లరు గజోత్సవములు - మహోత్సవములు జరిపి కృతకృత్యత నొందినవారే.

శంకరారాధ్యులవారి సత్రమునందు శివపురం వీరయ్యగారును, వారి సతీమణి భ్రమరాంబగారును - శ్రీ॥ కోట్లింగము - మొదలగువారును పలువిధముల సహాయ మొనర్చిరి. నేటికిని వారి యారాధనదినమునందు సికింద్రాబాదయందలి కివాడిగూడెము నందున్న శంకరమఠమువందును - వరంగల్లులో శంకరారాధ్య సత్రమువందును తదభిమానులచే వారి మహోత్సవములు జరుపబడుచున్నవి ఇట్టి పవిత్రమూర్తి చరిత్రయే మన పద్యకావ్యమునకు కథావస్తువు.

ఈ కథావస్తువును సంతరించుటలో శర్మగారి ప్రతిభ వెల్లడియగుచున్నది. ఈ చరిత్రయందు 8 కాండలు గలవు. ఆదికాండయందు ముదిగొండ మంత్రమూర్తిగారి యింటికి వ్రతస్థుడగు నొక శివయోగి శివరాత్రినాడు వచ్చుటయు - జొన్నలు మానెడు కావలయు ననుటయు - పిల్లికైన పిడికెడు మెతుకులు వేయని పుల్లారెడ్డి యింటికి వెళ్ళి వీరభద్రకవి మానెడు జొన్నలు తెచ్చి శివయోగి వ్రతము చెల్లించినందున శివయోగి మీ వంశములో సత్పురుషు డొక్కడు జన్మించునని అనుగ్రహించుటయు - అను విషయమును వర్ణించబడినది.

రెండవకాండయందు శంకరారాధ్యులవారి జననము - వివాహము - కష్టము భక్తిప్రచారము గలదు

మూడవకాండయందు దానధర్మములు - వరంగల్ ప్రాచీన శిల్పవైభవము మొదలగునవి గలవు     శుభాంతముగానే నీ గ్రంథము సమాప్తి నొందినది

ఇట్టి పవిత్ర చరిత్రను వ్రాసి కవీశ్వరుడును, కృతినొంది కృతిపతుడును, పఠించి పాఠకలోకమును తరింతురుగాక యని విశ్వేశ్వరుని వేడుచున్నాడ

ముదిగొండ వీరేశలింగశాస్త్రి,

మెయిన్ రోడ్డు - వరంగల్



శ్రీ ఆకారపు నరసింగంగుప్త



అపర శంకరులు, కైలాసవాసి ముదిగొండ శంకరారాధ్యులవారు



కీ_ర్తిశేషులు ఆకారపు చన్నయ్యగారు, వారి దర్మ పత్ని



శ్రీ ఆరాంపు నరసింగం సెట్టిగారు, వారి సతీమణులు

# పీఠిక

శా॥ శ్రీ పంచాక్షర మూలమై యుపనిషత్సీమంత శాశ్మీరమై
పాపాద్రీంద్రశతారమై, మునిమనఃపంకేజ సారంగమై
శ్రీపత్యబ్జభవార్చితమ్మగు మహచ్ఛ్రేయోనిధానమ్మునై, దా
నాపాదించుత మస్మదీప్సిత కథాప్రారంభ సంసిద్ధులన్. ౧

శా॥ స్త్రీపుంసాద్వయరూపమై, త్రిజగతీ సృష్ట్యాది పంచక్రియా
వ్యాపారైక నిధానమై, త్రిగుణ కాలాతీతమై, పూతమై
తాపత్రయ్యుపహారమై, పరమమై, ధర్మక్రియాధారమై
చూపుల్వాకుల కందరాని పరమ జ్యోతిస్సు నర్చించెదన్. ౨

మ॥ శివమై చిన్మయమై శివంకరమునై శ్రీలింగసంజ్ఞాకమై
భవదూరమ్మయి పుణ్యసారమయి విశ్వక్షేత్ర సంచారమై
రవితేజమ్మయి రమ్యరమ్యమయి చంద్రాహ్లాదమై వెల్గు వ
స్తువు సేవింతు మదీయదివ్యకవితోద్యోగమ్ము యోగింపగా. ౩

శా॥ శ్రీమత్పర్వతకన్యకా కుచతటీ శ్రీగంధకాశ్మీర శో
భామాంగళ్య విశేషలక్షిత, లసద్వక్షోవిభాగుండు, శ్రీ
హేమక్ష్మాధరధన్వి, దైవతధురీహేవాక పాకక్రియా
శ్రీమన్మంజు కవిత్వసంపదఁ గటాక్షింపంగ నర్థించెదన్. ౪

మ॥ సలియన్ పేరది యేజగజ్జననిచే సార్థక్యమందెన్ గులో
న్నతియుం గోత్రవిభూతి యేయమయెడ న్నైజంబులై చెల్లె, శి
క్షితసర్వాసుర, పోషితామరయునౌ, శ్రీమాత, మాతల్లి మ
త్కృతికిం బేర్మిని సర్వమంగళగుణశ్రీలన్ గటాక్షించుతన్. ౫

శా॥ అర్చింతున్ గణనాథు నాదిగురు దృప్యద్వైర్యసృగ్గంధ వా
శ్చర్చా మంగళవిగ్రహున్, జలధిజాజాని కృపాధాని, వా
క్చర్చాదూరమహత్త్వు, నేకరదనున్, గండాగ్రగంధ ద్విపున్
వర్చస్సూర్య సహస్రభాస్వరు, జగన్మాంగళ్య సంధాయకున్. ౬

శా॥ రుద్రాంశమ్మున నుద్భవించి, శివవిద్రోహాత్మదక్షాగ క్రియా
క్షుద్రున్ దక్షుని శిక్షితుం జలిపి యక్షుద్ర ప్రభావోదయో
న్నిద్రం బైన చరిత్రచే జగముల న్నిత్యంబు పాలించు, మా
భద్రుం డిచ్చుత మాకు భవ్యకవితా వైదుష్య సంపత్తులన్. ౭

శా॥ కస్తూరీ కమనీయ విగ్రహుఁడు, వక్షస్స్రగ్గతాంతాయిత
ధ్వస్త బ్రహ్మకపాలమండలుఁడు, విశ్వస్వామి భక్తావళీ
హస్త ప్రాప్య సమస్త మంగళుఁడు, నీహారాంశుకోటీరుఁడౌ
శాస్త్రీ భైరవు సన్నుతింతుఁ గవితా చాతుర్యసంపత్తికిన్. ౮

శా. హేయిన్గూర్చుత మాకు నెల్లపుడు, నిత్యానంద మాంగళ్య, సు
శ్రేయమ్ముల్ ఘటియించుగావుతను, మాసేనాని యుద్యత్కృపా
శ్రీ మాదోనిధి తారకాంతకుఁడు లక్ష్మీదేవి జామాత వి
ద్యాయుః కీర్తినిధానమంజుళకటాక్షాలోకసంపత్తులన్. ౯

ఉ. ఆదరణీయ సార వివిధార్థగతిన్ రచియించె, మాధవీ
స్వాదువు భారతమ్మును ప్రసన్న కథా కలితార్థయుక్తి, వి
ద్యాదయితుండు సత్ప్రతిభుఁ డాంధ్రకవిత్వ విశారదుండునౌ
మాదికవీంద్రు దక్షు మహితాత్ముని, నన్నయభట్టుఁగొల్చెదన్. ౧౦

ఉ. నన్నయకన్న మున్నయగునా యనిపించుచు నెల్లవెంటఁ ది
క్కన్నకు ముందువాఁడగు, మహాత్ముఁడు, దేశికపాదభక్తి, కొ
ల్వన్న యశశ్శరీరుఁగు, రసోజ్జ్వలకావ్యపితామహుండు, మా
నన్నియచోడు శైవకవినాథుని, కొల్తు నితాంతభక్తిమై. ౧౧

శా. సర్వామ్నాయ కళా రహస్యనిధియై, చాతుర్యవాగ్ధుర్యుఁడై
సర్వజ్ఞాశయ భక్తుఁడై, విమతపక్షధ్వాంత మార్తాండుఁడై
సర్వాంగీణ మహేశభక్తి, కవితా సామ్రాజ్యపీఠస్థుఁడై
యుర్విన్వెల్గిన సోమనాథకవి, నేనూహింతు నిష్టాప్తికిన్. ౧౨

శా॥ ఒప్పయ్యెన్ ధగనెవ్వఁడౌ ననిన, బాణోచ్ఛిష్టమన్పల్కు, దా
నప్పిచ్చెన్ సుకవీంద్రపాళి ఋణ మొయ్యం దీర్చె నెవ్వాఁడు, నా
మప్పాదీర్ప, మహేశ్వరాంఘ్రి కమలధ్యానైకశీలుండు మా
యప్పం దిక్కనసోమయాజిఁ గవి విద్యామూర్తి సేవించెదన్. ౧౩

ఉ॥ నన్నయ వ్రాయఁగా మిగిలినట్టవి తిక్కన ముట్టకుండినన్
సన్నుతశైలి నక్కవులచాయనె భారతము ప్రచించెఁ బే
రెన్నికగాఁ బ్రబంధ పరమేశ్వరుఁ డాతని శంభుదాసు నె
ట్టన్న భజించెదన్ మృదుపదాంచిత భవ్యకవిత్వసిద్ధికిన్. ౧౪

మ॥ ఎవఁడేమన్నఁ గొఱంత లేదు కవితాహేవాకధాటీ సము
ద్భవితక్ష్మాపతి మౌళిరత్నసుషమా దేదీప్యమానాంఘ్రియై
కవితాభారతి స్వర్ణవర్షములలోఁ గౌగిళ్ళఁ జెలించె నా
శివభక్తుం గవిసార్వభౌము ననఘున్ శ్రీనాథు సేవించెదన్. ౧౫

శా॥ ఉన్నాఁ డాయనిపించె, నైజకవితాభ్యున్నత్యహోవాద సం
పన్నుండై, నరపాలదర్శనము సంభావింపఁగాఁ బోని యా
మన్నీఁడే కవిలోకమందు నతనిన్మారందధారోర్మి, వై
యన్నద్యంబు పవిత్రమంజుపదుఁ, బోతన్నం బ్రణామించెదన్. ౧౬

శా॥ ముమ్మూర్తుల్ వెలయించుసూర్యుఁడనఁగాఁ బొల్పొందియీయాంధ్రలో
కమ్మెల్లన్వెలిఁగించి యద్భుత మహాకావ్యప్రపంచాబ్జ గం
ధమ్ముం గ్రోలు సుధీమిళింద విజయధ్వానమ్ము లాలించుచున్
నెమ్మోమించుక వాల్చు సూరకవి ధ్యానింతు న్మనోవీధులన్. ౧౭

శా॥ ఉన్నారాంధ్రకవిత్వపీఠమునఁ దారొడ్డోలగంబున్న, యా
మన్నీ లెందరొ నాఁడు నేఁడు గురులై మద్భావదత్తార్చనల్
మన్నింపంగల సౌమనస్యలసితుల్ మత్కావ్యనిర్విఘ్నతా
భ్యున్నత్యర్థకృతావధానులయి నేఁ బూజింతు నవ్వారలన్. ౧౮

ఉ॥ మల్లమపల్లివంశమణి మండితధర్మయశోధ్వజుండు, చి
త్తోల్లసదీశ్వరుండు, కరుణోదధి పుణ్యవిరాజి, దుర్గమా
వల్లభుఁడైన మాజనకు పాదములన్ శిరసావహించి యే
నల్లన యగ్రజన్ముల పదాంబుజముల్ భజియించి భక్తిమై. ౧౯

శా॥ అంతేవాసులపుత్రులట్లు కను మాయయ్యన్ సదా గొల్చు నా
యంతేవాసుల నన్నలెల్లెఱఁగి నిత్యప్రేమ పూర్ణోజ్జ్వల
స్వాంతుల్ మా యనుజన్ములన్ సుకవితావ్యాపార వర్ధిష్ణులై
వంతుల్మించిన కావ్యసంతతులతో వర్ధిల్ల దీవించుచున్. ౨౦

ఆ॥ వె॥ పాలకడలిబోలె బహురత్ననిలయమ్ము దేవభాష పరమపావనమ్ము
మించెదానిఁగూడి మిన్నేటిమున్నేటి తేటతరగవాసి తెనుఁగుబాస.

మ॥ చిరకాలమ్మనుండి మా తెనుగులన్ జీర్ణించెగీర్వాణి, వే
ర్వఱుపన్ రాక, రసప్రపంచమున నీరక్షీరభావమ్మునన్
తిరుగన్ దోసి విడాకులిత్తుమనుచున్ ధీమంతులీనాట సో
దరభాషల్ ద్రవిడాదులన్ గలుపగాఁ ద్వారింతు రశ్రాంతమున్. ౨౨

శా॥ భాషాజీవనదీ ప్రవాహములఁ ద్రిప్పన్ రాని సత్యమ్ము, నీ
భాషాశాస్త్ర విశారదుల్ తెలియరో, ప్రజ్ఞావిశేషమ్మునన్
భాషాసామ్యము లెంతురిప్పటికి నేనాఁడో విభిన్నంబు, లీ
భాషల్ ద్రావిడమాంధ్ర మొక్కటగుటల్ భావింపసామాన్యమే. ౨౩

శా॥ స్వాతంత్ర్యమ్మనుగోరి యీయమరభాషా దాస్యమున్ రోయు, నా
చాతుర్యమ్ములు నూత్నమార్గములు, మెచ్చన్ రావె యెవ్వారికిన్
బ్రాతల్ రోయుచుఁ గ్రొత్తదాస్యములు దాల్పన్ రామిగుర్తించుచున్
జాతీయత్వము నిల్పనోలుచితమై స్వాంతమ్ముఘోషించెడిన్. ౨౪

ఉ॥ క్రొత్తలు క్రొత్తలంచురక గోసనపెట్టుటకాక చూడ నీ
క్రొత్తలు కొండవాగులకుఁ గుల్యలకున్ సమదోడు లెంతయున్
చిత్తవిశుద్ధి చాటి తటసీమలదాటని కృష్ణవేణి నా
చిత్తము చూఱవెట్టె రససింధువులన్ సరసుల్ భజింపరే. ౨౫

గీ॥ కాలపరిణతరూపముల్గాంచికాంచి ప్రకృతిచిత్రమ్ములవియెల్ల బాఱచూచి
కృత్రిమపుబాటలన్ విడియెపుడురాచబాటతగునని చనని రాఘాటముగను.

కం॥ అనియొక్క స్వత్వబంధము, నొనరుపఁగానూహసేయుచుండిన యెడలన్
మనమునకుదోఁచెనొక్కటి, యనూనభక్తిప్రధానమగుకథయదియున్.

శా. దేశోద్ధారక విశ్వదాతృ బిరుదుల్ దీపించు పుణ్యాత్ముఁడా
కాశీనాథకులుండు విశ్వజన విఖ్యాతుండు నాగేశ్వరుం
డాశాజేత కళాప్రపూర్ణుఁడెది మున్నర్థించె మాతండ్రి నా
దేశమ్మిచ్చిరి నాకు మాజనకు లేదివ్యాత్ము చారిత్రమున్. ౨౬

శా. ఏ పుణ్యాత్మకుఁ డాశ్రితాఖిల జనాభీష్ట ప్రదుండీశ్వర
శ్రీపాద ప్రవణుండు దానగుణరాశీభూత చారిత్రకుం
డాపద్బాంధవుఁడంచుఁ బేర్గనియెనేనాశంకరారాధ్యు చి
ద్రూపమ్మైన చరిత్రముల్ సుకవితారూఢమ్ము గావింపఁగా. ౨౯

శా॥ సంకల్పించితి నమ్మహామహుని సచ్చారిత్రముల్ వ్రాసి ని
శ్శంకన్ తత్పదభక్తధన్యపదవిన్ సాధించిమత్పాపపుం
బింకమ్ముల్ బెడఁద్రోసి ధన్యుఁడనుగా భావించి మాతండ్రి మున్
సంకల్పించిన కావ్యచాలు బహుధా సన్నద్ధచిత్తుండనై. ౩౦

శా॥ భారద్వాజ పవిత్రగోత్రుఁడు సుధీబంధుండు వీరేశలిం
గారాధ్యుండు పరోపకారకలనా వ్యాపారపారీణుఁడీ
ప్రారంభమ్మును మెచ్చి దాఁ బలుకఁగా నాకారవంశోద్భవుం
డై రాజిల్లు నృసింహగుప్త విని యత్యానంద నిర్మగ్నుఁడై. ౩౧

శా॥ కాంచీఖండ కథా విశేషముల నాకర్ణించు నవ్వేళ న
ర్థించెన్ సత్కృతి మాటతప్పకయు, ముద్రింపించెసద్భక్తి, నా
కాంచీఖండము కాన నేనునీఁక నాకళ్యాణచారిత్రు, నీ
చంచత్కావ్యకథాధినాయకునిగా సాధింప నూహించుచో. ౩౨

శా॥ ఆశాసించిరి మద్గురుల్ దగినకార్యమ్మంచునిద్దాని, నా
దేశమ్మెల్ల నరాచకమ్ము ప్రబలన్ దీర్పాటులేకుండి, యా
రాశీభూతమహేశభక్తియుట దుర్గాక్షేత్రసంవాసియై
యాశంస్యమ్మగు భక్తి చిత్తమున నాహ్వానించిన న్నర్మిలిన్. ౩౩

సీ. బహుశైవ తంత్రాభిపారగుండసమానమతిశాలినిర్మలమతియు సుకవి
పండితుండునుముదిగొండవంశ్యుండు, సత్సంగుండువీరేశలింగశాస్త్రి
నిగమాగమజ్ఞాననిధిపండితుండును, సత్కావ్యనిర్మాణ చతురమతియు
నఖిలప్రతిష్ఠల నాటితేటినవాఁడు సములుండు వీరభద్రావధాని

గీ॥ మున్నుగాఁగల పండితుల్ పుణ్యకథలఁ
గొలువఁగొలువుండి నరసింగగుప్త భక్తి

మూర్తినందినయటులు సముద్రదముపొదవ
శంకరారాధ్యచరితమ్ము సాదరముగ. ౩౪

శా॥ అందందుం విన్నవింపఁగా వినుచుఁ దానంగీకరింపన్ మహా
సందర్భమ్మిది యయ్యగారికథయా సామాన్యమాయంచు, న
స్పందప్రేమను వెల్లడించెఁ గృతిచేపట్టంగనర్హాంబు, నీ
డెందంబెంతయు, భక్తిపూర్ణమని చాలన్ స్వామి తద్బుద్ధిలో. ౩౫

శా॥ అంతన్నేనును గాంచిఖండకృతికై యత్నింపఁగాదన్న, నా
స్వాంతమ్మున్ దనియించినట్టి సుగుణశ్లాఘ్యుండ పీవెంతయున్
సంతోషమ్మున నాదుమాట నిటులన్ సాగింపుమీయన్న, న
త్యంతప్రీతి నతండుతెల్పెను ప్రతిధాయంగీకృతిన్మెచ్చుచున్. ౩౬

కం॥ ఏతాదృశగుణమహితుం, డాతండటుగాన వానియన్వయమెల్లన్
ఖ్యాతమ్ముగవర్ణించుట,యే తగునని వాని కీర్తి యొసకమ్మెసగన్. ౩౭

కం॥ ఛాత్రజనకల్ప, యస్మ, న్మాత్రన్వయవిమలకీర్తి నవ్యచ్ఛత్రా
చిత్రపవిత్రచరిత్రా, మిత్రామిత్రప్రసన్న మృదుదరహాసా. ౩౮

ఉ॥ పుట్టఁగ నైతి నో పరమపూరుష, శంకర నీవు లోకముల్
పట్టి భవమ్ముడంచి శివభక్తి సుధాంబుధి నోలలార్చుచోఁ
గట్టిడిజన్మమైన నగుఁ గావుత నాయది నీ చరిత్రమున్
బట్టముగట్టి మత్కవితఁ బాయుడుగా భవబంధమాపుచున్ ౩౯

కం॥ మును నార్యావృత్తమ్ముల,
నొనరించి సువర్ణహార మొసఁగి యొసఁగితిన్
దెనిగించి కాంచి ఖండము,
జనకునకును నాదు జనిమ చరితార్థముగా ॥ ౪౦

కం॥ జనకుని సంకల్పము, నం, దనవనము రచింపఁగంటి ధన్యత్వము మ
జ్జననికి దుర్గాంబకము, వినీతి నర్పించినాఁడ విబుధుల కరుణన్ ౪౧

కం॥ గురులకు నాంధ్రబుధాగ్రే, సర సీతారామశాస్త్రి చరణులకు, నే
నరియిడితిఁ బరమభక్తిని, గురుభక్తుఁడు కౌత్సచరిత గురుదక్షిణగా

శా॥ ఉండుంగావుత చాటువుల్ శతములేమున్నన్ స్ఫురద్భారతీ
భాండాగారము క్రొత్తక్రొత్త నగలన్ వర్ధిల్ల నెల్లప్పుడున్
నిండింపన్ దగునన్న పూనికమెయిన్ శ్రీశంకరారాధ్య, నిన్
బండింపన్ సుకృతమ్ములే చలిపెదన్ స్వర్ణాభిషేకమ్ములన్ ౪౩

కం॥ నీకిచ్చిన మెచ్చువుమటె, నీకంటెను నీదుభక్త నికరమునకిడన్
నీకెంతయు ముదమగునని యీకృతి యిటుసేత నీకభీష్టమ్మొగదా. ౪౪

మ॥ అని యేతత్కృతిరూపుశంకరుని సమ్యగ్భక్తి నర్చించుచున్
మును శ్రీనాథుఁడు తిప్పసెట్టికిడడే పుణ్యప్రబంధమ్ము, నా
ఘను పాండిత్యముఁ దత్కవిత్వ మహిమల్ గాన్పింపకున్నన్ యశో
ధనుఁడీ మానరసింగసెట్టి సరియౌఁ దద్భాగ్యసంపత్తికిన్ ౪౫

వ. అని కార్యంబు నిరూపించి, యేతత్కృతీశ్వరుండును, రాజమాంబా గర్భశుక్తిముక్తాఫలుండును, శివపాదభక్తి పరాయణుండును, మహాభక్తనారాయణుండును, నిరంతరసమారాధ్యమాన మహేశ్వరుండును, శివపూజాపరాకాష్ఠా మహాప్రమథుండును,గోరక్షణాది ధర్మకార్యధురంధర ప్రథముండును సుశీలానంతలక్ష్మీరమణుండునగు నరసింగసెట్టి యన్వయం బెట్టిదనిన. ౪౬

## కృతిపతి వంశానుక్రమణిక

సీ॥ ఏస్వామి కనుబొమ్మలెత్తిన వేళ నీ, విశ్వప్రపంచమ్ము వెలయఁజేసె
నేదేవు కనుదోయి, నెసఁగిన కాంతులు సృజియించె జగతికిరేబవళ్ళ
నేస్వామినిట్టూర్పులెల్ల వేదమ్ములై, యాధారమయ్యె నధ్యాత్మమునకు
నేదేవుసాన్నిధ్య మెఱుఁగంగ నేరదీ, బహువాసనాగ్రంధి ప్రాణికోటి

గీ॥ యెల్లతనయందుఁ దానెల్లయెడలనుండు,
విభుఁడు దేవాదిదేవుఁడా వేదమూర్తి
యల హిరణ్యగర్భుని నాభియందుఁ బుట్టె,
వైశ్యవంశము విమలమా వంశమందు. ౪౭

కం॥ ఆకారవంశమనఁగ సు, ధాకారము యాచకులకు నతులితలక్ష్మీ
సాకారాకారమునయి, సాకారమహేశభక్తియుత విలసిల్లున్. ౪౮

వ. అందుమాసంతగోత్ర పవిత్రుండగు, గురవయ్యసెట్టి యద్వితీయగుణ
సంపన్నయగు నాగమాంబ సతిగా విలసిల్లెనతండు శంషాబాద
గ్రామంబున. ౪౯

శా॥ సంపన్నిత్య నివాస మై విమలసౌజన్యంబు తోఁబుట్టువై
శంపాగాత్రి సమస్తమంగళ మహాసౌభాగ్యవర్ధిష్ణువై
దాంపత్యమ్మది సాటిలేని దనుచున్ దజ్జ్ఞుల్ ప్రశంసింపగా
సంపత్పూర్ణుఁడు నాగమాంబసతితో సాధించె ధర్మార్థముల్. ౫౦

ఉ॥ వారలభక్తి యాదరము వారలొసంగెడి యాతిథేయముల్
వారల పుణ్యభావమును వారి వివేకము ధర్మయుక్తియున్
వారల కీర్తియున్ గుణము వారికి వీరికి వచ్చునేమి య
వ్వారలసాటి వారెయగు వారు ధరన్ బరికించి చూచినన్. ౫౧

ఉ॥ జనముల హెచ్చు తగ్గులను జక్కఁగఁ ద్రాసునఁదూఁపవచ్చినన్
దనయెడ నల్పభావమును దక్కినవారల గౌరవంబునున్
గనుఁగొననేర్చుబండితుఁడొకానొకఁడే గురవయ్యసెట్టి, దా
గనియగు నీ వివేకమునఁగారొరులెవ్వరు వానిసాటిగా. ౫౨

చ॥ సతులకు నొంటినిండఁ బలుచాయల సొమ్ములుదాల్చుటొక్కటే
మతిఁ బ్రియమౌను సాజముగ మానినియౌ నలనాగమాంబకీ
గతి బహిరుజ్జ్వలత్వమనఁగా మనసొప్ప దదేమిచిత్రమో
యతివలు నిట్టివారు కలరా యనిపించును జూడ నొక్కచోన్. ౫౩

కం॥ నాగాంబాగురవయ్యల, యాగురుతరపుణ్యభావమున నుదయించెన్
భోగివిరాగియు త్యాగియు, నౌగుణిసింగయ్య వారికాత్మజుఁడగుచున్.

కం॥ ఆ తనయు వివేకమ్మును, నాతని తారుణ్యభావమందలిగుణముల్
బ్రీతిపడి తల్లిదండ్రులు, చేతము చల్లంగఁజూచి సిరి వెలయంగా. ౫౪

గీ॥ ఎల్ల గుణముల మాయన నెసగుదాని।
నెల్లగుణముల కెల్లయౌ నెల్లమాంబ
నగును సరియంచుఁ బాణిగ్రహంబు సేసి।
రంత సింగయ్యగుప్తకు సంతసమున. ౫౫

ఉ॥ క్రొత్తగవచ్చు కోడలనఁ గూఁతురుకంటెను నెక్కువత్త కా
యత్తయుఁ గ్రొత్తకోడలికి సమ్మను మించును బ్రాతపడ్డచో
నత్తలు నత్తలే యగుచురారయఁ గోడలు గోడలే యగుక్
క్రొత్తలు పాతలైచనని కోడలు నతయు వారి చూడగా. ౧౭

ఉ॥ ఆతఁడు తల్లిదండ్రుల మహాతపమై సతి యెల్లమాంబయుక్
బ్రీతిగ సేవ సేయు ముదిమిక్ దలిదండ్రుల మెప్పుగాంచ, వి
ఖ్యాతిగ వీఁడు సద్గుణియటంచు సదా తలలోనినాల్కయై
యా తెలివెంకనుం గలదె యట్టిది కాపురమొండుగల్గునే. ౧౮

శా॥ ఎన్నోజన్మములందు జేసినవి వారెన్నెన్నియోయైన యా
పుణ్యమ్ముల్ ఫలియింప, దంపతుల యామూర్తీభవత్రేమకై
పున్నామ మ్మనునట్టి పెన్నరకముక్ బోద్రోయు రత్నమ్ము నా
చెన్నయ్యం గని తల్లిదండ్రులు మదిక్ జేకూర్చిరానందముక్. ౧౯

కం॥ ఆ మనుమనిపయిఁ బ్రేమం, బేమో, గురవయ్యసెట్టి యెన్నివనులలో
దా మున్నుఁడయ్యు నాతని మోముంగని ముద్దులాడి ప్రొద్దులు
పుచ్చుక్. ౨౦

శా॥ వ్యాపారమ్మభివృద్ధిఁజేయఁ బహుధా యత్నించి, యచ్చోఁ దది
చ్ఛాపూర్తిక్ గననేరకక్, విడిచి శంపాబాద గ్రామంబు, స
ద్వ్యాపారుండగు సింగుపత్తయుఁ, గరీంబాదక్ నివాసంబుఁగా
నై, పేరెన్నికఁగాంచె నంచితగతిక్ వ్యాపారముక్ జేయుచుక్.

కం॥ ఏ పుణ్యలగ్నమున యం, దాపాపడు పుట్టినాఁడొ యది మొదలుగఁద
ద్వ్యాపారవృద్ధియయ్యెను, పాపనితోఁపాటునవనవమ్ముయియంతక్. ౨౧

కం॥ చిన్నతనమ్మునుండియు, నెన్నఁడు తానాడిమఱచియెఱుఁగఁడ టేయా
చెన్నయ్య తలప నెంతటి పున్నెమ్ముల రాశియోయపూర్వముగాదే,

గీ॥ దైవభావమ్ము గడచి యతండు దాస
భావమును దాటి మిత్రభావమ్మునందె
దండ్రి దక్షిణభుజమాచుఁ దాన యెల్ల
పనుల నెఱవేర్చు సామర్థ్య మొనసియుండె. ౨౩

వ. అంత నా సింగయ్యగుప్త శివలోకంబునకేగ నాతని సతీమణి
ఎల్లమాంబయు ౬౫

చ॥ నవనవమైన జవ్వనము నవ్విలసిల్లుచు దైవభక్తియుక్
దవిలిన పుణ్యవర్తన విధంబును బెద్దల యాదరంబు, రూ
ప వినయ సంపదల్ వెలయ వర్ధిలు పుత్రునిఁ బెండ్లిసేసె, రూ
ప వినయసమృద్ధి వాని సరివచ్చిన కన్యక రాజమాంబికన్. ౬౬

గీ॥ బిడ్డవచ్చిన వేళయు గొడ్డువచ్చు
వేళయందురు జనులు లావిధము నిజము
అత్తవారింట నా రాజమాంబ యడుగు
పెట్టెనో లేదో యటఁ దాండవించె లక్ష్మి. ౬౭

కం॥ అత్తకు నా కోడలికిన్ బొత్తుకుదిరి కాపురములు నూటికి నొకడేఁ
నత్తదియందురు జనులా యత్తను గోడలినిఁ జూచి యటులనఁగలరే.

కం॥ చెన్నయ్యసెట్టి గుణసంపన్నుండా రాజమాంబ పతిపదసేవన్
చెన్నొందు వారి కాపుర మెన్నంగా నలవి కాద యెవ్వారికేనిన్. ౬౯

మ॥ ఆ చెన్నయ్యయుఁ దండ్రికంటె మిగులన్ వ్యాపారమున్ జేయుచున్
ప్రాచీనాంధ్రమహావిభూతికి సభారంగమ్ము నోర్గంటిలోఁ
బ్రాచుర్యమ్ముగ నర్తకమ్ము నిలిచెన్ వాణిజ్యమం దెన్నఁగా
నాచాతుర్యము సత్యసంధతయు లేదన్యత్ర యీ నేర్పుతో. ౭౦

కం॥ శంకరునిరూపమగు శ్రీశంకరు మన సెట్టిఁగి ధర్మసతాప్రియముగా
శంకరభక్తుఁ డతంకీడె సంకీతముగ నొక్క దివ్యమగు భవనంబున్. ౭౧

శా॥ సెట్టుల్ మెచ్చగ నోరుగంటి పురిలో శ్రీ కన్యకాదేవికిన్
గట్టించెన్ గుడి బాటసారులకు బల్ గాణాచిగా సత్రమున్
బెట్టించెన్ సదుపాయముల్ వెలయఁగా విఖ్యాతకీర్తిస్థిరం
బట్టిట్టంచు వచింపఁగానగునె చెన్నయ్యన్ వదాన్యాగ్రణిన్. ౭౨

శా॥ ఎక్కించెన్నిజకీర్తికన్య నతఁడా హేమాద్రిమూర్ధమ్మునన్
దిక్కాంతాకరపద్మలాలితముగా దివ్యాపగాంభఃకణ

క్రొక్కాంతుల్ దెలిచెక్కులన్ మెఱయఁగాఁ జంద్రుండు నబ్బాలచే
త్రొక్కల్గందని పూలచెండుగను నారిక్కల్ సుమశ్రేణిగా. ౨౩

శా॥ సంపాదించునుగాక యెవ్వఁడయినన్ సత్కార్యముల్ చేసి, మె
చ్చింపన్ జిత్తము సమ్మతించునె, యెటో చిత్తమ్ము మైకొన్న, నా
సంపన్నాత్ముని యాలుబంధు లది మెచ్చం జూతురే యెందు, సా
ధింపం జెల్లెను వానికా గృహిణి భక్తిత్యాగ సంపత్తిచే. ౨౪

కం॥ ఆ త్యాగశీలులకు మూర్త త్యాగము శంభుభక్తి ధర్మరతిక్రియా
చిత్యము సత్యమ్మనఁగన, పత్యము నరసింగసెట్టి ప్రభవమ్మందెన్. ౨౫

కం॥ ధీరుఁడు ధీరవిచారుఁ డుదారుఁడు సత్యప్రచారుఁ డన వైశ్యులలో
పేరుగని తాతతండ్రుల పేరును నరసింగసెట్టి వెలయించెగదన్. ౨౬

ఉ॥ ఆతని చిత్తశుద్ధియును నాతని యీశ్వరపాదభక్తియున్
బ్రీతియుఁ గార్యనిర్ణయవివేకము పుణ్యకథానురక్తియున్
జేతము చూఱవెట్టు బుధసేవయు సత్కవితాప్రసక్తియున్
జూతమటన్న నెందు నొకచోటఁ గనంబడ విన్నిభంగులన్. ౨౭

కం॥ చెన్నయ్యసెట్టిసుతునకు, నెన్నంగాఁ బెండ్లిసేసె నెల్లజనులు సం
పన్నకులసంప్రదాయకుల న్నిరుపమ యగు ననంతలక్ష్మీదేవిన్

మ॥ నవకళ్యాణ గుణాభిరాములగుచున్ వల్లభ్య సౌభాగ్య వై
భవసంపన్నులు దంపతుల్ గలుగరే వారెల్లరున్ సాటిగా
నవువారేమి తలంచిచూడ నరసింహ శ్రేష్ఠికిన్ వాని, రెం
డవదా చిత్త మనంతలక్ష్మికిని గణ్యామ్నాయ చిత్తస్థితిన్. ౨౯

ఉ॥ ఆతఁడు పద్మనాభుఁడనునట్టి కుమారు ననంతలక్ష్మి యుం
డాతత బుద్ధిఁ గాంచెఁ బయి నానిసుఁగన్ బదియారు వసంతముల్
చేతము చల్లఁజేసె, శిథిలీలకుఁ బాత్రముగాఁగ, వెండియున్
జూతమటన్న సంతతికి నోచక యా నరసింగసెట్టియున్. ౩౦

కం॥ గుణవతియన్వయవతియని గణనకు నెక్కిన సుశీలఘనముగఁ గన్యా
మణిఁ బెండ్లియయ్యె నాసతియును సుధ్యమువండి పండనట్టిదయయ్యెన్.

కం॥ సవతులనన్ భువిలోపలఁ, గవకవలెండ్రైనఁ గలవు కన నునువిన మా
సవతాలితనము, తోఁబుట్టువులేయః పింత్రిగుణపటుత్వముఁ గలిమిన్. ౮౨

ఆ॥ వె॥ అద్వితీయులైన యాద్వితియులు దమ్ము
శివునియట్లు పూజసేయుచుండఁ
పరమశైవధర్మ పట్టభద్రుఁడు నర
సింగసెట్టి పూజసేయు శివుని. ౮౩

సీ॥ తండ్రి కట్టించిన ధర్మసత్రము మహాసౌధముగా బాటసారులకును
బెక్కు సౌకర్యముల్ తెలియఁగాఁ గట్టించి, జనకుని పేరు శాశ్వతము నర్చెఁ
కాశికావిశ్వేశుఘనభక్తిమెయిగొల్చి, యోరుగంట ప్రతిష్ఠ నొనరఁజేసి
లక్షలు వెచ్చించి యక్షాధిపతిమిత్రు గుడికట్టియర్పించెఁ గోర్కులెసఁగఁ

గీ॥ బాలుకరియుంగ శ్రీ శివపూజకొఱకుఁ
దోటవేయించెఁ భక్తితో దోరముగను
ఆంధ్రసంస్కృత విద్యాలయంబు నిలిపె
బరగ నెలకొల్పె నొక వేదపాఠశాల. ౮౪

కం॥ చలివేంద్రమ్ములు పెట్టెను సలలిత సంగీతపాఠశాలను నిలిపెన్
విలసద్గ్రంథాగారము, తెలియంగాఁ జేసె ధర్మవీరుండగుచున్. ౮౫

కం॥ వడుగులకుం బెండ్లిండ్లకు నడుగుటయే తడవుఁగాఁగ నతఁడొసరించెన్
గడుధర్మబుద్ధియనగాఁ బుడమిని నరసింగసెట్టిఁ బోలంగలరే. ౮౬

కం॥ శివభక్తసమాజమ్మును, నవముగ విశ్వేశుగుడి నొనర్చెను బెక్కుల్
కవివర్యుల గ్రంథము లీభువి నచ్చొత్తించి మిగుల బాగడితగనియెన్ .

సీ॥ బ్రహ్మసూత్రములకు వ్రాయించె భాష్యమ్ము
చిన్నబొమ్మనృపాల శేఖరుండు
నప్పదీక్షితులచే నాశివార్కమణిదీ
పికను దానికి నొక వివరణముగ
నాగలింగయ శివయోగిచేతను శివ
చింతామణిప్రభఁ జేయఁజేసె

గాంచికా ఖండము ప్రకాశించె ముద్రిత
మ్మును శైవసర్వస్వమును మొదలుగ

గీ॥ గ్రంథములఁ బెక్కు ప్రకటించెఁ బ్రథితముగను
నరయ నీసర్వధారికి నందెషష్టి
పూర్తిమఱియొక్కటగు షష్టిపూర్తి నంది
చెలగువాఁడిల మా నరసింగసెట్టి. ౮౮

సీ॥ ఉద్భటారాధ్యవంశోద్భవుం డయినట్టి నందయారాధ్యుల నందనుండు
రామలింగారాధ్య రత్నమ్ము శైవదీక్షాగురుండుగను దీక్షనువహించి
యాచార్యదేవున కతులమాసాధమ్ము కట్టించియిచ్చె విఖ్యాతముగను
వీరేశలింగాఖ్య విబుధుచే శివపురాణములు పెక్కులు విని నమలనిష్ఠ

గీ॥ ప్రతిదినమ్మును మాహేశ్వరత్రయమ్ము
నింట శివపూజసేయకే యెన్నఁడేని
దాను శివపూజసేయఁడే ధన్యమూర్తి
పరమ మాహేశ్వరాచార భద్రుఁడతఁడు. ౮౯

గీ॥ అవచి తిప్పయ్యసెట్టి నా నతఁడు లింగ
ధారణమునంది ప్రతిసోమవార మభవు
స్వర్ణపాత్రల సుమములఁ జలుపు పూజ
నవనవమ్ముల భక్తియు నవము గాఁగ. ౯౦

సీ॥ వైజయంతీ సమప్రాసాదమును గట్టె నేకశిలాపురీ శ్రీకిరీట
మును బుణ్యశివకథామృదితాస్తర్ఖిత్తి రమణీయసౌందర్య రాజధాని
బహువిధశృంగార భక్తిరసోల్లాస దర్పణదర్శితాంతర్విభాగ
బహుళయాతాయాత పండితకవిభక్త సత్కథామధుర వాచాలితమ్ము

గీ॥నందుగోమాతపదములకధికభక్తి సర్పగ వించిమాహేశ్వరాంఘ్రిసేవ
సలిపిముమ్మేళ శివపూజసలుపునాతఁడభవునచ్చినబంటుసింగయ్యసెట్టి.

మ॥ శివ శంభో పరమేశ యీశ యభవా శ్రీకంఠ కాలాంతకా
భవ సర్వజ్ఞ రమేశబాణ గిరిశా బాలేందు చూడామణీ

స్తవదూరా స్తవనీయదివ్యమహిమా స్వామీ జగన్నాయకా
భవదీయమ్మగు సేవ నిమ్మని సదా ప్రార్థించు విశ్వేశ్వరున్. ౧౨

సీ॥ రామలింగారాధ్యనాముఁడుగురుఁడయిశివతత్త్వధర్మముల్ చెప్ప మండ
విద్వచ్ఛిరోమణి వీరేశలింగ విబుధుఁడంతరార్థము బోధసేయఁ
గాణాదిభొట్ల వేంకటరామసిద్ధాంతి నవగాననిధి సదాశివబుధుండు
నలఘునాపారి మహాదేవసుధి వీరమల్లనారాధ్యుండు మల్లబుధుఁడు

గీ॥ శైవకథికుఁడు కొంపల్లి జాలయాఖ్యు
డష్టదిగ్గజములవోలె నరయునుండి
దన్ను దీవింప వైశ్యమూర్ధన్యుఁడతఁడు
వెలయు నరసింగసెట్టి నిస్తుల గుణుండు. ౧౩

కం॥ స్వాంతమ్ము వెలయ నిటుబహుసంతానము ధన్యగుణుఁడుసరసుడుబహు
ధా, సంతోషిత సుకవీంద్ర స్వాంతుఁడు నరసింగసెట్టి సామాన్యుండే.

శా॥ ప్రాలేయాచలమై మృగేంద్రమయ దుర్గావామ తాటంకమై
కైలాసమ్మయి నందియై హరుని డాకాల్గండపెండారమై
మాలింబూవుల మాలయౌచు జగదంబన్ దండ్రి విశ్వేశ్వరున్
జాలన్ భక్తి యజించు సింగని యశస్సంతానవల్లీరుచుల్. ౧౪

కం॥ ఏవంవిధ బహుగుణ సంభావితునకుఁ జెన్నయప్రభువునకు సతత
శ్రీవిశ్వేశ్వరపద నల సేవావిభ్రాజమాన చిత్తాబ్జునకున్. ౧౫

కం॥ నిరతారాధిత మాహేశ్వరచరణున కమలభక్తి పరతంత్రునకున్
నరసింగసెట్టికిని సద్గురు కరుణావర్ధమానగుదువిభవునకున్. ౧౬

కం॥ ఓజ నవంత సుశీలా రాజితచిత్తాబ్జవిహృతిరసిద్ధునకున్
బూజితగురుచరదేవున కాజన్మమహేశభక్తికమలినమతికిన్. ౧౭

శా॥ శ్రీకళ్యాణ ధనుర్ధరుండు కరుణాసింధుండు నిత్యోల్లస
ద్రాకానాథ కలావతంసుఁడు లసద్దాంపత్యశబ్దార్థరూ
పాకారుండు మహేశ్వరుండెలమి నిత్యానందముంగూర్చి మా
యాకారాన్వయకౌస్తుభమ్ము నరసింగశ్రేష్ఠి రక్షించుతన్. ౧౮

కం॥ విస్మయనీయ చరిత్రుం
డస్మన్మాతృన్వయాంబుజాకర, రవి, ప్రా
తస్మరణీయుఁడు శంకరుఁ
డస్మత్కృతిపతికినిచ్చు నఖిలార్థమ్ముల్. ౧౦౦

సీ॥ తనచూపుకొన ప్రాపుగని రూపుగొని మేను
చూపుదానెల్లెడ సూనశరుఁడు
తనదైన ఘనమైన తనువానఁగనిదాన
నర్ధనారీశ్వరుం డయ్యె శివుఁడు
తనమేటి కొనగోటినునుగీటిడినసూటి
పదిరూపములనెత్తె బ్రహ్మతండ్రి
తనకాలి కొనవ్రేలికిని జాలిగొనిదాలి
తత్తరమందెనా తమ్మిచూలి

గీ॥ తనమయమ్మౌచు నిఖిలమ్ము తనరుచుండ
నమ్మణి ద్వీపమణి పీఠి నలరుచుండు
నంబ జగదంబ పూర్ణకృపావలంబ
చెలఁగి నరసింగసెట్టి రక్షించుఁగాత. ౧౦౧

సీ॥ ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డని యాఱుమొగముల నొలసిన మొలకనవ్వు
కంఠాగ్రకరిరాజు కరుణాప్రసారమౌ కరశీకరమ్ముల కమ్మతావి
యలజగన్మోహిని యల్లారుబిడ్డయౌ కాలభైరవు కటాక్షముల రీవి
వీరభద్రుని కృపావిస్ఫురంబగు మృదువీక్షణములతోడి పిన్ననవ్వు

గీ॥ నందిసద్భక్తి మధురనిష్పందదృష్టి
భృంగినటనామనోహరాపాంగదృష్టి
పరమమాహేశ్వరాచారపట్టభద్రుఁ
జెలఁగి నరసింగసెట్టి రక్షించుఁగాత. ౧౦౨

కం॥ సీతంద్రుఁడు శంకరునకు
బ్రీతిగ నత్రమ్ము నిడిరి ప్రేమను నీవుగా

ఖ్యాతిగ శంకర చరిత
మిన్నా తెఱఁగున వెలయఁజేసి తిది యుత్తమగుణ. ౧౦౩

వ. అని యే తత్కృతీశ్వరుండగు నరసింగసెట్టికి నభ్యుదయపరంపరాభి
వృద్ధిగా నాశీర్వదించి యతని యుచితజ్ఞతం బ్రశంసించి మహాపురు
షుండగు విశ్వదాత హృదయంబునం బల్లవించి, మా తండ్రి హృద
యమ్మునం బుష్పించి, యజ్ఞాత సుకృత విశేషంబున నాయెడ
ఫలించిన శ్రీశంకరారాధ్యుల చరిత్రమునకుం బ్రారంభం బెట్టి
దనిన. ౧౦౪

---

శ్రీశివాయగురవేనమః

# శ్రీ శంకరారాధ్య చరిత్రము

## కధా ప్రారంభము

కం॥ శ్రీకారవాస! భక్త
ప్రాకార! విశాల హృదయ! భవభాగవతా
ఆకారపునరసింగా!
రాకారమణీ మనోహర ప్రతిమ యశా! ౧

వ॥ అవధరింపుము.

కం॥ కలదు పలనాట సత్తైన
పలికెలన న్నందిగామ పండితులఁట బు
ణ్యులు గల రారాధ్యులు ని
స్తుల గుణులు తపోయుతో విశుద్ధ చరిత్రుల్॥ ౨

సీ॥ పరమశివార్చనా పరతంత్ర హృదయులు
పరవధూ సోదర భావఖనులు
శైవాగమ పురాణసార విశారదుల్
పరవాద తిమిర భాస్కరులు పరులు
భసిత త్రిపుండ్రాంక భాసుర విగ్రహుల్
రుద్రాక్ష కోటీర రుచిరసిరులు
సత్యనిత్యాచార సౌజన్య మూర్తులు
వక్షోవిశాజితత్ర్యక్షగృహులు

తే॥ గీ॥ నిత్యతృప్తులు నిజధర్మనిరతు లమల
వర్తనులు సర్వభూత ప్రపంచహితులు
నయి చతుర్వర్ణగురులయి యఖిలజనుల
మన్ననలఁగాంచు నారాధ్యమణులువారు. ౩

సీ॥ తీవ్రంబైన తపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్
గౌరీనాథునిచేత దీక్షఁగొనె నీ కళ్యాణచారిత్రుఁడా
భారద్వాజ పవిత్రగోత్రము తపఃప్రఖ్యాతిమైనించి రా
యారాధ్యుల్ మదిగొండవాసమునఁ దా మాయింటిపేరొప్పఁగాఁ. ౪

గీ॥ అందు భోగేశ్వరారాధ్యుఁ డమలగుణుఁడు
పుత్రులిర్వుర శ్రీ మంత్రమూర్తి బుధుని
వీరభద్రునిగాంచె విస్తారగుణుల
పరమశివపాద భక్తితత్పరుల నందు. ౫

కం॥ వలనాటి వీర చరితము
వెలయించెను జగతి వీరభద్రారాధ్యుం
డలఘుతర దేశభక్తికి
నిలయము రసపూర్ణభావనిర్ణిద్రమ్మున్. ౬

గీ॥ ద్వాదశారాధ్యచరితమ్ము నాదియైన
కావ్యములెగాక శివమతగ్రంథములను
రెండుబాసలఁబలికిన దండిసుకవి
వీరభద్రుండు బహుమంత్రపారవిదుఁడు. ౭

చ॥ పలుకులు వేయునేటికిల భద్రయసూరి కృతార్థజన్ముఁ డీ
తెలుఁగుల వీరగాథలను దెల్పి పురాతన శైవసత్కవీం
ద్రుల చరితమ్ముతోడఁ దులతూఁగెడువర్తన సత్యమార్గ ని
శ్చలమగువృత్తి నీ తెనుగుజాతికి సంస్మరణీయుఁడయ్యెడన్. ౮

గీ॥ పుణ్యచరితుండు దక్షిణభుజమువోని
యిట్టితమ్ముఁడు సేవింప నెల్లవేళ
నల యుపేంద్రునియన్న యాహరి బలారి
నెపుడు తలపించు మంత్రమూర్తీశ్వరుండు. ౯

కం॥ నెమ్మది సుగుణమ్ములె తన
సొమ్ములుగాఁ బుణ్యభావ సుందరతర రూ

పమ్మన కిమ్మగు సతి జే
జెమ్మ మహాసాధ్వి పోలు జేజేలమ్మన్. ౧౦

గీ॥ అమ్మహాసతి గృహిణిగా నతఁడు సాటి
గేస్తులందును మిక్కిలి కీర్తిఁగాంచె
నరమరిక లేని వారి కాపురము సరసి
వింతపడ నట్టివార లవ్వీట లేరు. ౧౧

కం॥ ధర్మార్థకామములు దా
మర్మిలి రూపమ్ములందిరా యనువారిక్
బేర్మిగులు సుతులఁగని పతి
కూర్మికి నిరవయ్యె నామె కులము వెలుంగన్. ౧౨

గీ॥ మహిని వెలసిన శంభుండు మంత్రమూర్తి
యతని యిల్లాలు జేజెమ్మ యన్నపూర్ణ
వీరభద్రుండు గణపతి భైరవుండు
సాటివచ్చెద రవ్వారి సంతతికిని. ౧౩

వ. విభిన్నరూపంబు లవధరించి సంచరించు దేహత్రయమ్ముం బలె
వారలు నాగలింగ, వీరమల్లికార్జున, చెన్నమల్లికార్జున నామమ్ములఁ
జెలంగుచుఁ బ్రవర్తిల్లుచుండిరంత. ౧౪

గీ॥ పొంగి పొరలుచు గట్టులఁ దొంగిచూచు
నురుగుతరగల పరుగిడు వఱుత కాల
వశమున నెడారియైనట్లు వచ్చెఁ గఱవు
సిరులకిరవైన పలనాటి సీమలోన. ౧౫

కం॥ పసిరియెండుటాకుమొగవెను
గసిగాటుగ దుంపదూండ్లఁ గఱచిరి జనముల్
దెసలాకటిచిచ్చులమెను
బసిమిచెడన్ సర్వజగము పసివాల్వాడెన్. ౧౬

ఉ॥ ఆకలి యాకలన్న నుడు లన్నిదెసల్ చెలరేఁగి మ్రోఁగె ని
ష్కోకిలమై రటత్కరటఘూకరవాకులదారుణాటవీ
భీకరమై మహాప్రళయవిస్ఫురదర్చిదుమర్చ్యభప్రభా
శోకితజీవలోకమున శూన్యమ యయ్యె సుఖంబునయ్యెడన్. ౧౭

గీ॥ కలుములకునెల్ల (శ్రీ)ధాన్యకటకమనుచుఁ
జాటుశతములుగొను పలనాటిసీమ
నెన్నఁ డెవ్వఁడు కని విని యెఱుఁగనట్టి
కాపురమ్మయ్యె నాపెద్దకాటకమ్ము. ౧౮

కం॥ మలమల నాకఁటమాడుచు
విలవిల నిల దన్నుకొనుచు విఱిఁగి యొఱుఁగుచున్
పలుకులకొదవనిపెదవులఁ
బలనాటని జీవరాశి బ్రతుకుల మోసెన్. ౧౯

కం॥ కలుములు మూలల మూల్గెడు
కలవారాసాటికారి కడగండ్లకు లో
నులుకరు నలుకరు పలుకరు
కలఁచునె ప్రజబాధ కలిమికటికిమనసులన్. ౨౦

సీ॥ పురిటాలి పథ్యముకొఱకని వచ్చిన
వెడలించెఁ బెనుబొజ్జ పెద్దకాపు
పసిబిడ్డపాలని బ్రతిమాలు ముసలవ్వఁ
గసరికొట్టెను పెద్దకమ్మటీడు
తలుపు తాళముపెట్టి వెలుపలకే రాఁడు
కరణమ్ము తనయింటి గడపఁదాటి
కొలుచునిండిన పెద్దకోమటి యంగడి
తెఱువనే తెఱువఁడు కఱవటంచు
గీ॥ కడుపునిండిన గ్రామాధికారి తగవు
నరయఁదలఁపఁడు చిక్కశల్యమ్ములగుచుఁ

గడపఁగాచిన తనజీతగాండ్రనేనిఁ
కలవు కలవని వారిపై నలుకముగాని. ౨౧

గీ॥ ఇట్టి కట్టడివేళ భోగేశసుతుఁడు
ధనము ధాన్యమ్ము నగలు వస్త్రములు పసులు
మడులు మాన్యమ్ములన్నియుఁ గడువఁబెట్టి
యన్నదానమ్ము నడపు నభిన్నవృత్తి. ౨౨

గీ॥ అతిథు లభ్యాగతులు బంధు లాప్తజనులు
బీదతనమును గల నిరుపేదలెల్ల
వచ్చి తినిపోవుచుందు రవ్వానియింటఁ
దమదుగృహములబోలె స్వతంత్రవృత్తి. ౨౩

చ॥ పడగలనెత్తినారు ధనవంతులు నూటికి కోటికందు నొ
క్కఁడుఁ గడుదిక్కుమాలిన బికారిజనమ్ముల పొట్ట చల్లగా
నెడఁదఁ దలంపనేరఁ డదియెట్టిమనుష్యతయో పశుత్వమో
కడుపులు నింపుకోవె కలకాలమునుండవె కాకఘూకముల్‌. ౨౪

మ॥ పరివారల్ దనక్రిందివారగుచు నిచ్చల్ దన్ను సేవింపఁగా
సరసుండంచుఁ గళావిదుండని మహాశాంతుం డుదారుండు నా
దొరయై యాపురిపెద్దకాపొకఁడు వంతుల్మీర నాసీమ సుం
కరవుల్లయ్య యనంగ గోముఖపు వ్యాఘ్రంబై జనాభీలుఁడై. ౨౫

ఉ॥ ముప్పదికాళ్ళకమ్మతము మూఁడగుకారుల రేవుమాపునన్
దప్పని బత్తెపాడి కమతమ్మున కందెడు నింటికోడెలున్
దొప్పలు దోరలా కొలుచు దొడ్డులు మిద్దెలు మేడలై సదా
ముప్పిరిగొన్న సంపదలఁ బుల్లయరెడ్డి యనం బ్రసిద్ధుఁడై. ౨౬

సీ॥ కూనరాగముదీసి గానవిశారదుం
డను మేటిబిరుదమ్ము నందుకొనియె
నటిముటి నొకపంది నట్టట్టుగాఁగొట్టి
భండనరంగ భీభత్సుఁడయ్యె

జల్లిపడమ్ముల సంతరింపఁగ నేర్చి
కవిసార్వభౌమ విఖ్యాతిఁగనియె
నొక్కయుర్వర నూతినొక్కటి త్రవ్వించి
దానరాధేయ పదమ్ముగాంచె

గీ॥ కలిమిఁగలిగిన గుణమూటఁగట్టఁజూచు
జనుల దౌర్భాగ్య మర్థదోషమ్ముగాక
మాననీయుఁడుగాఁడె సంపదలకెపుడొ
పెట్టిపుట్టినయట్టి యా పెద్దకాపు॥ ౨౭

ఉ॥ వంకలుతీర్చిదిద్ది తలవంకనమర్చిన పట్టుపాగయున్
బింకపు జూపు సన్నమెలిపెట్టిన యోరల కోరమీస లా
పొంకము జూచితీరవలె ముద్దులమూటల నవ్వుమాట లా
జంకెనలై సురాళిగొను చల్లనమెత్తన వాడిచూపులన్. ౨౮

గీ॥ అతనియిల్లాలు లక్ష్మమ్మ యమలశీల
రూపగుణవర్తనముల నా కాపు మనసు
వచ్చి సవతులమన్ననఁ బడయనేర్చె
నామెకోరికఁదీర్చుట యతనివ్రతము. ౨౯

ఉ॥ నిండుమనంబె భాగ్యమని నిక్కపుబుద్ధి దలంచు నామె తాఁ
బండిన పూర్వపుణ్య పరిపాకవిశేషమదెట్టిదో గదా
ఒండనలేఁడు రడ్డి సతియొక్కటిబల్కనఁ జిన్నభార్యపై
మెండుగదా తలంపు ముదిమిన్ మగవారికిఁ జిత్రచిత్రమై. ౩౦

ఉ॥ పుల్లయ రావణుం డమలబుద్ధి సుయోధనచక్రవర్తి శో
భిల్లెడు నాత్మగౌరవము పెంపున నాశ్రితపాలనన్ మహా
భిల్లుడు మల్లుడై సుకవివీరులవాలిటఁ దొంటిసింగఁడై
పల్లెలపల్లెలందు సముపార్జనచేసె నఖండకీర్తులన్. ౩౧

వ॥ ఒక్కనాడమ్మహాభాగుండు.

సీ॥ చూచిచూడనియట్లు సుముహూర్తములువెట్టు
లౌకికుండయిన పుల్లమ్మభొట్టు
తనపన్నుగడలను దారిచక్కనచేయు
మైరావణుండగు మాచిరాజు
తనశాసనము గీటుతప్పక నడిపించు
హనుమంతుడగు పెద్దమణియదారు
మహిని సింగమ మేనమామల దలపించు
తమ మదివచ్చు చుట్టములు చెలులు

గీ॥ కొలువ సభ దీర్చి చావడి గూరుచుండి
చిలిపిచూపుల నల్లర గలయజూచు
నటుల నలుగడ బరికించి యావులించి
విసపునగవొరమీసల బెరయుననియె. 32

ఉ॥ వింటిరె క్రొత్తమాటయిది వెళ్ళితి మొన్నటిరాచకార్యమై
గుంటురుబస్తి కాపురిని గొప్పకవీశ్వరుడంట పండితుం
డంట పురాణముల్ జదివె హాయిగ నేమనిచెప్ప నేనటన్
గంటలురెండునుండి పలుగాథలెఱింగితి జిత్రచిత్రముల్. 33

గీ॥ భారతమ్మును మునుపెన్నిమారులైన
వింటిమేగాని యీ క్రొత్తవిషయమొక్క
శాస్త్రియేనియు జెప్పెనే ? శాస్త్రులన్న
గర్వమేగాని యీ తెల్వి గలదె యెందు. 34

శా॥ హోరాహోరిగ నర్జునుండొడరి యాయుద్ధంబు గావించు నా
వీరుల్ వింటిరె ? యా త్రిగర్తులట యీపేరందు పల్నాటిలో
వారే యంచును నొక్కిచెప్పనిది వహ్వా యెంత చిత్రంబొ యీ
సారాంశమ్మును విప్పిచెప్పగలరా చర్చింప మీరెవ్వరేన్ 35

మ॥ అనినం బుల్లమభట్టు లేచి నిజమేనయ్యా ! యిదే యెప్పుడే
మనమందుం దలపోయుచుండెదను సుమ్మా ! మున్ను మాతాతగా

రనఁగావింటేఁ ద్రిగర్తపట్టణమునే యాంధ్రాళి గుంటూరటం
చును బేర్కొందురు సోమయాజికవియుక్ సూచించె నీసంగతిన్.౩౬

మ॥ అనుడు న్నవ్వుచు మాచిరాజు నిజమే యామాట బ్రహ్మయ్య! నా
యనిగారింగను వీరభూమి యిది యెట్లైనయ్య కాకున్నచో
మును శ్రీనాథుఁడు వీరభాగవత మీబుద్ధింగదా చేసె నే
మును బాల్యంబున వింటినంచనియె మాముత్తాత గుర్రాజునున్.౩౭

మ॥ వినియెల్లన్ మనవారునవ్వి నిజమీవృత్తాంతముల్గాని నేఁ
డును నాఁడున్ బలె పౌరుషమ్మును గుణాటోపమ్ము దీపింపఁగా
మను నీపుల్లయరెడ్డిగారి కతనన్ మాన్యంబు పల్నాఁడనన్
విని యుప్పొంగుచు రాజబంధు లతని న్మెప్పించిరామాటలన్. ౩౮

మ॥ అదియెల్లన్ మదికెంతొ సంతసమునీయంజాలినంగాని పై
పెదవిందాటని చిన్నచిన్నగవుల్ పెన్వొచ్చునిట్టూరుపుల్
పొదలం గొండొకమోమువాంచి యనియెం బుల్లయ్య కాపేర మీ
కిది పాటయ్యెనుగాక సాటియగునా! యీకాలమానాటికిన్. ౩౯

కం. ఎక్కడి బ్రహ్మని నాయుం
డెక్కడ నాబాలచంద్రుఁ డెక్కఁడ మన మీ
తక్కువ తనమే కాకిట
నొక్కండానాఁటికవికి నుద్దిగఁగలఁడే? ౪౦

గీ॥ జాతియెల్లను నానాఁట సారమెడలి
పొడవఁడగు కాలమునఁ గుక్క మొగముపిందె
లనుట ధ్రువమయ్యె మీ రెట్టులంద్రుగాక
నక్కయెక్కడ చూడ నా నాకమేడ. ౪౧

మ॥ అన వారెల్ల మొగాలుచూచుకొని మీరన్నట్టిమాటన్ దలన్
గొను టేతప్ప మ రేమియుందు మిపుడేఁ గొండాడుటల్ సైతురే
యణుమాత్రమ్మును మిమ్ముబోటు లిదిమీయాత్మైకసాక్ష్యంబు వే
అన నేలా! యిదె యుద్ధమున్మొగమునం చాలాపముల్ సేయుచో.౪౨

కం॥ వారెల్లర వారించుచుఁ
బౌరోహిత్యుఁడైన పేరుభట్టుకుమారుం
డారడ్డిఁ జూచి దేవర
వారికి నొకచిన్నవిన్నపము గలదనుచున్. ౪౩

చ॥ గఱువతనంబు దాఁగరఁగఁగట్టినచూపు లనుజ్ఞచేయఁగా
నెఱిఁగియెయుందురిద్ది ఘనరయాపలనాటి కవీంద్రకోటికిన్
దఱుగనివాఁడు రమ్యకృతిదక్షుఁడు భద్రయమంత్రిమూర్తికిన్
జిఱుత రచించుమాడె నఁటఁ జిత్రరసస్థితివీరగాథలన్. ౪౪

కం॥ మీరలు కృతిగొనఁదగియెడు
వారలు శ్రీవీరభాగవతమని తోఁచెన్
ఆరాధ్యుఁడతఁడు మీయీ
కోరిక నెరవేర్చు వెఱవుఁ గూర్పఁగఁదగుఁడీ. ౪౫

చ॥ అనవిని మాచిరాజు తగునట్లు వచించితి సార్వభౌముకం
టెను ఘనుఁడేమి? యీతఁడడి టెక్కులు నిక్కులు పెక్కుగాక యీ
జనముల నెవ్వరుం దెలియఁజాలరె? యీతని మేనమామ గొ
ప్పను పెదతల్లియొద్దఁ జదువం బనిలేదిఁక నూరకుండుమీ. ౪౬

కం॥ చికిలింతభాగ్యమనునటు
సకలమ్మును నన్నదానసంగతికని యీ
రక వెచ్చపెట్టు వీఱిఁడి
బికారితమ్ముండు వాని వినమో కసమో. ౪౭

మ॥ అనునంతన్మగౌదారుచూచితిని నేనారాధ్యునవ్వాని మొ
న్నను దేవాలయమందుఁ బల్కెనఁట శ్రీనాథుండు వ్రాయంగలే
దనుచుం దానఁట వీరభాగవతకావ్యంబున్ రసస్ఫూర్తిగన్
బొనరింపందొరకొంటినంచును నిజ స్వైరలూహింపుడీ. ౪౮

ఉ॥ పుల్లమభొట్టునుం గరణముల్ మణొదావువచించు మాట లా
పుల్లయరెడ్డి వించుఁదగవుల్ ఘటియిల్లెడు మాటలేల? యీ

క॥ వారల్లర వారించుచుఁ
బౌరోహిత్యుఁడైన పేరుభట్టుకుమారుం
డారడ్డిఁజూచి దేవర
వారికి నొకచిన్నవిన్నపము గలదనుచున్. ౪౩

చ॥ గలువతనంబు దాఁగరఁగుగట్టినచూపు లనుజ్ఞచేయుఁగా
నెఱిఁగియొయుందురిద్ధి సపదయాపలనాటి కవీంద్రకోటికిన్
దెలుగనివాఁడు రమ్యకృతిచెప్పఁడు భద్రము మంత్రమూర్తికిన్
జెలుత రచించుమాఁడె నఁటఁ జిత్రరసస్థితివీరగాథలన్. ౪౪

క॥ మీరలు గృతిగొనఁదగియొను
వారలు శ్రీవీరభాగవతమనితోఁచెన్
ఆరాధ్యుఁడతఁడు మీయీ
కోరిక నెరవేర్చు వెఱవుఁగూర్చఁగఁదగుఁడీ. ౪౫

చ॥ అనవిని మాచిరాజు తగునట్లు వచించితి సార్వభౌముకం
టెను ఘనుఁడేమి! యీతఁడడిటెక్కులు నిక్కులు పెక్కుగాక యీ
జనముల నెవ్వరుం దెలియఁజాలరె? యీతని మేనమామ గొ
ప్పను పెదతల్లియొద్దఁ జదువం బనిలేదిఁక నూరకుండుమీ. ౪౬

క॥ చికిలింతభాగ్యమనునటు
సకలమ్మును నన్నదానసంగతికని యూ
రక వెచ్చపెట్టు వీఱిఁడి
బికారితమ్ముండు వాని వినమో కసమో. ౪౭

మ॥ అనునంతన్మణెదారుచూఁచితిని నేనారాధ్యుసవ్వాని మొ
స్నను దేవాలయమందుఁ బల్కెనఁట శ్రీనాథుండు వ్రాయంగ లే
దనుచుం దానఁట వీరభాగవతకావ్యంబున్ రసస్ఫూర్తిగన్
బొనరింపందొరకొంటినంచును సిజ త్రిస్మెరలూహింపుఁడీ. ౪౮

ఉ॥ పుల్లమభొట్టునం గరణముల్ మణెదాఁపవచించు మాటలా
పుల్లయరెడ్డి వించుఁదగవుల్ ఘటియిల్లెడు మాటలేల ? యీ

కం॥ చిననాటి చెలిమి చనువున
ననఘులు మీదొడ్డగుణము లరయుటకతనర్
విను మొన్ని విధములందును
గొనివచ్చెద నతనికృతిని గొంకక మీఁదర్ ౫౭

కం॥ అని వచ్చెఁబలికి రెడ్డికిఁ
జని నాతని వీడుకొనుచు సముచితగతి నా
మణెదారు కరణ మప్పటి
కిని బుల్లమభొట్లునకును గృత్యమును దగర్ ౫౮

కం॥ కఱపిచని రతఁడు వారల
కఱపిన యిది గుఱుతుగాఁగఁ గర్జముదీర్పర్
వెఱవిదియ యనుచు నెంచుచు
మఱుచటి దినవిధులఁదీర్చి మధ్యాహ్నమునర్. ౫౯

సీ॥ ఒక పజ్జను దిలీపుఁడొజ్జల కడ కేగు
నప్పటి మాటల నాలకించి
గిరికన్య తపమున్న హరుఁడు వచ్చినవేళ
వారలాడెడు మాట తీరులరసి
యత్తవారింటికి నా శకుంతలనంపు
కులపతి సందేశముల నెఱింగి
లవచంద్రకేతులు సవనాశ్వమునకు గా
నెదిరిన యెడమాట చదురులరసి

గీ॥ భవుని మెప్పించు చిఱుతొండ భక్తకథలు
యముని గెల్చిన మునిబాలు నమలకథలు
వినుచు మెచ్చుచుఁ దలయూచి వీరభద్ర
సుకవి చంద్రుని గృహసీమఁజొచ్చియుచట. ౬౦

గీ॥ అవసరము లేచి యరయించి యతనియొద్ద
చదువరులచేతఁదనరాక విదితపరచి
శిష్యవెంబళి లోన వేంచేసి కాంచి
వీరభద్రుని శివయోగసారముద్రు. ౬౧

గీ॥ కుశల సంభాషణముచేసి కూరుచున్న
ఫుల్లభొట్టునుఁ జూచి సంఫుల్లవదనుఁ
డగుచుఁ గనుఁగన్న శిష్యుల నలకనిపి
నేఁడు సుదినమ్ము మీరాక నిజముసుంగు ౬౨

ఉ॥ దారటు తప్పివచ్చితిరొ తప్పక యీ యిలుచూచు వేడ్కయో
మీరయి వచ్చినారలిటు మేలగుగదా మనవారికెల్ల మీ
రూరను లేరటంచు నిజమింటి మరేమి విశేషముల్ సదా
మీరనుకోరుగాని మము మీరలు మామది పత్తురెప్పుడున్. ౬౩

ఉ॥ ఎంతటి కార్యసంగతులఁ గింపుల కిమ్మయి వచ్చువారె మీ
రంతటివారు నా కలుగునంతటిలో సముకూర్చువాఁడ ని
శ్చింతముగాఁగ మీరది వచింపుఁడటన్నఁ గవీంద్రుఁ జూచి యొ
క్కింతగ నూరకుండి యతఁడిట్లని యెన్ సగౌరవంబునన్. ౬౪

ఉ॥ ఆడినమాటతప్పని మహాత్ములు మీకగు దర్శనమ్మె మా
కాడఁ దీర్థమై శుభసుతీర్థము లిచ్చుటదేమి యెంత యా
మ్రేడిత సత్కృపామధుసమృద్ధి వివృద్ధతరంగ జాహ్నవీ
చూడము నీకటాక్షమునఁ జూడముగా భవబంధమీపయిన్. ౬౫

ఉ॥ మీరనినట్లు యెల్లపుడు మేము భవన్మతివచ్చి యుండుటన్
దూరములయ్యె మాకఖిల దోషములున్ సిరితొన్న దానవి
స్తారిత పుణ్యపూర్వక యశస్సురసింధుతరంగ దేవ శ్రీ
వీరయభద్ర పండితకవీ! కృతినిర్మతి నవ్యభావి. ౬౬

ఉ॥ చాలనిమాటలే బలుకఁ జల్లకువచ్చితి మెంతఁ దాచఁగా
నేలకు మీదు దర్శనము నెల్లపుడున్ మదిగోరి యుందు మా
న్నాళ్ల వెన్కరావలసినన్ సమయమ్ము లభింపదాయె వ
ట్టాల శివార్చనాసముచితాల ... నాఁటిపుచ్చ నేర్కిన్. ౬౭

శా॥ శివలింగార్చన పూతమైనవులఁగా డాచేఁ దాళసంవర్ధమున్
శివమాలిం గుఱుతుమ్మ నెత్తువలచే సింగారముల్గులుక్క మీ

నవ సూక్ష్మప్రతిభానిదర్శనము గంటమ్ముం మిమ్ముంజూచి యా
కవితాభారతి నాట్యరంగమిది యేఁ గాబోలుసం చెంచితిన్. ౧౮

కం॥ ఆరాధ్యవంశభూషణ
మీరలు వచియించునట్టి మృదుపదబంధం
బారయ జనములు వలికెడు
సారము పలనాటి వీరచరితంబేనా. ౧౯

మ॥ అనినన్ భద్రకవీశ్వరుండు నగి మీ యాలోచనల్ దప్పులే
మును శ్రీనాథుఁడు చేసె దీని ద్విపదన్ బుణ్యప్రబంధమ్ముగా
నొనరింపం దొరకొంటి శంకరుని యా యుద్వేల కారుణ్య వీ
క్షణ సంకల్పవశమ్మునన్ సుకవి హాస్యత్వమ్ము ఖండించినన్. ౨౦

ఉ॥ ఇంతియకాని సర్వపృథివీశ్వరమౌళిచిరత్నరత్న సం
క్రాంత పదాబ్జ రేఖుఁడయి కాకవి కంఠము కత్తిరేటుగా
వంతున కెక్కినా ప్రమథవర్యుఁడు శ్రీ కవిసార్వభౌము ద్రా
ఠెంతటి వానికేని యిది యిట్లనవచ్చునె యే యుగంబులన్. ౨౧

కం॥ అన వినుచు వింతగా న
య్యనఘుని వదనమ్ము చూచి యతఁడనియె నిజ
మున కరయ నిట్టులాడుట
చనుగద మిముబోఁటి సుకవిచంద్రుల కెందున్. ౨౨

ఉ॥ నిన్నటి మొన్నవారిని గణింపరుగా కథునాతనుల్ మతే
మన్నఁబురాణపండిత మహాకవికోటికి నించుమించుగా
నెన్నఁగనేరునుగల రిదేవిషయమ్ము ప్రసక్తమయ్యె నీ
మొన్నటి మాపటన్ ఘనుఁడు పుల్లమరెడ్డి సభాంతరమ్మునన్. ౨౩

మ॥ అతడుస్మీవలె నాత్మగౌరవము పాయంద్రోచి యట్లాడెఁగా
కితరుల్ చెప్పగనేల ప్రస్తుతమునం దెవ్వారుగానీ సుసం
గతమై యున్న మహత్త్వముం గనరు నిక్కమ్మద్ది చేజాతినన్
మతిదుఃఖాతురు వింతవింతగఁబురాణాంధ్యమ్ము నిందించుచున్. ౨౪

మ॥ అల శ్రీకృష్ణుఁడు విష్ణురూపుఁడనగా నాలించెనా యేమి యే
యలవిం గౌరవనాథుఁ డర్జునుసకేనా స్వామి పూర్ణమ్ముగాఁ
దెలియంజేసెనె యాత్మశక్తిని మహోద్రిం గుందుచోఁగాక దు
ష్కులు డేనాఁటికెయుంగనేరఁ డెదుటంగొల్వుండిన న్దైవముల్. ౭౫

శా॥ కాలమ్మెంతయు మాటిపోయెనని వక్కాణింతురేగాని త
న్మూలమ్మెంతయు నెంచిచూడరు మహోముగ్ధాత్మకుల్ సర్వధా
శీలమ్ముం గుణముల్ శమంబు దమముం జేడ్పడ్డచోఁగాక యే
కాలమ్మందును బూజ్యతల్ జెడియెనే గణ్యాత్ములౌ వారికిన్. ౭౬

శా॥ వేదాంతమ్ములు చెప్పజాలుదురె యో విద్యాస్వరూపంబ నే
మీదౌసన్నిధి నిక్కముం దటువఁగా మీవంటి వారుండుటన్
గాదా కాలము చెల్లుచున్న దటులే కాకున్న నీపాటికే
యాదోరాశి గభీరగర్భమున యం దావర్తమైపోవ దే. ౭౭

శా॥ ఈభూమి న్నిజపుణ్యవృత్తములచే నిన్నాళ్ళుఁగా గాఁచి తే
జోభావమ్మును జెంది యాకసమునన్ జ్యోతిస్స్వరూపమ్ముతో
నీభూమి న్మగుడన్ భరింతురని కాదే వింటి మాపెద్దలన్
మీ భూయస్స్థిర ధర్మవర్తన కడు న్మెంచెం జుడీ వారలన్. ౭౮

మ॥ స్తుతిపారమ్ములు గావు నిక్కపుమతిన్ జూడంగఁ జూడంగ సం
గతమైనట్టిది చెప్పెదన్ సుకవులన్ క్ష్మాపాలకుల్మన్న సం
తతముల్ సత్కృతులంది భక్తిమెయి సన్మానింతురే యిమ్మెయిం
గతలుం గాథలునై తెనుంగుబ్రజకుం గల్గింపనాహ్లాదముల్. ౭౯

సీ॥ తన పురోహితుఁ డని తక్కువ చూచెనా
యల రాజరాజు నన్నయ్యభట్టు
గృతికన్య నిచ్చు సుకృతిమామకం టెను
మన్నింపఁ డయ్యెనా మనుమసిద్ధి
ధీనారటంకాల దీర్థమాడింపఁడే
యలరాయఁడే కావ్యమందుకొనియెఁ

బల్లకీ తనకేలఁబట్టఁడేరాయలు
కవిపితామహుని యుత్సవము వేళ
గీ॥ బ్రహ్మ యిల్లాలినటు కాపురమ్ముచేసి
కవులగృహముల వారల గారవించి
గారవముఁజెందఁగాఁగాదె కలుఁగఁజేసెఁ
బ్రభులపాలిట నిస్తుల భాగ్యములను. ౮౦

ఉ॥ మీ చరితంబు నిర్మల మమేయగుణోత్తర! నాదుబుద్ధికిన్
దోఁచిన దొక్క మాట యిది దోషమెయైనను మీదుసన్నిధిన్
దాచఁగరానిదౌట మది తత్తఱపాటుడుగంగ బల్కెదన్
దోఁచిన జిత్తగించి పెడత్రోవఁగనున్న క్షమింపవేడెదన్ ౮౧

మ॥ కవితారాజ్య మహావిభూతి కలుగంగానొల్ల రారాజ్యసం
భవ భాగ్యంబులు మిమ్ముబోటులు వసింపం బర్ణశాలల్ మహా
భవనంబుల్ చిఱుకావిబట్టలు ధరింపం బట్టువస్త్రంబులై
నవముక్తామణు లయ్యెగా విమలకంఠమ్మందు రుద్రాక్షముల్. ౮౨

సీ॥ నెఱజోదు చుఱకత్తి గుఱిదప్పు నొకవేళఁ
గవి కేళికలము లక్ష్యమ్ము చెడదు
మింటిమాణిక్యంబు కంటి కందదుగాక
కవిబుద్ధి చొరరాని గవను లేదు
బ్రహ్మచేసిన సృష్టి వ్రజ మెచ్చదొకవేళ
కవిసృష్టి మెచ్చని ఘనుఁడు లేఁడు
చక్రవర్తులు దాము సమసిపోయిరి కాక
కవివారిఁ దనతోడఁ గదలనీఁడు
గీ॥ కృష్ణవేణమ్మ కవితయై క్రీడసల్ప
సహ్యగిరివోలెఁ గవి యొందు శాశ్వతుండు
అంబునిధిఁజేరునది యట్టు లమలకవిత
నంకితము సేయు టుచితమే యనఘులకైన. ౮౩

శా॥ చిన్నల్ పెద్దలు పల్లెలన్ నగరులన్ క్షేత్రకృమలం జేయుచున్
మునీన్నటఁబడియున్ సుజీవనములన్ బోషించుచు న్నుండి తా
నెన్నాళ్ళాయెనొ యేటికీ నడక లెందే భావ విజ్ఞానిదా
కన్నీరోనదియో తలంపఁ గవితా కళ్యాణి సంపద్గతుల్. ౮౪

ఉ॥ చెల్లరె చిల్లిగవ్వయును జేయని రాతినిగూడ వేదముల్
చెల్లఁగఁజేసె దైవమని చిత్తము చల్లఁగఁ జూచి రేనియున్
భిల్లుని రాజరాజె యనిపింతుకొ సత్కవు లట్లుగాక మా
పుల్లమరెడ్డి గొప్పతనము న్వినియుందురు మీరు కొంతఁగా. ౮౫

సీ॥ కట్టించె నీమొన్న ఘనపాఠశాలను
ప్రాచ్యవిద్యాలతల్ పల్లవింప
త్రవ్వించె నొకచెర్వు తాతపోయినయేటఁ
బేరుగాఁబొలిమేరఁ బెద్దబీటఁ
బెట్టించుచున్నాఁడు పెద్దరాదారిలో
బాటసారుల కొకపాటిసాల
త్రవ్వించుచున్నాఁడు తాతతండ్రులనాటి
పెద్దనూతిని నీటియెద్దడికిని
గీ॥ ఘనుఁడు పుల్లయ్యరెడ్డి యీగడ్డలోన
నేటి పెదకాపులెవ్వారు పోటిగాదు
దాతలందున నాతని తరముగనము
గవులలోపల మీవంటి ఘనునిగనము. ౮౬

మ॥ అనుచో నించుక నవ్వి యిట్లనియె నీయాత్మీయతం బట్టి నే
వినఁగావచ్చిన దింతదవ్వును వృథా వేయేల నీ యీస్తుతుల్
వను మన్నింపుము బాల్యసఖ్యమునఁ గిన్కంబూన కీపాటికే
వినుతుల్ చాలును నీకుఁ బుణ్యమగునో విప్రాన్వయాలంకృతీ. ౮౭

మ॥ స్తుతినిందల్ తమవంటివారు పలుకం జోద్యంబుగాదే నిజ
స్థితికిం బుల్లమరెడ్డి నేనెఱుఁగనా నీ పూరియుంబోని నా

స్థితి నైనం గననేయుటన్న యెడ మ్రోసెన్వే “ నమః పార్వతీ
పతయే ” యంచు సుభక్తభక్తజనతా ప్రాధ్మాతకంఠధ్వనుల్. ౮౮

మ॥ చకితుండయ్యెను పుల్లభొట్లతని పై నారించుచున్ జూవు మీ
రిక నీకార్యము పూనిరావలదు వీరే వేచియున్నారు వే
రొకవేళం దమదర్శనంబు సెలవంచన్నట్టులే లేచి యా
సుకృతాత్ముం డటు లోనికిం జనె బుభుక్షుప్రేక్షణోద్విగ్నుడై. ౮౯

కం॥ వెఱపడుచు నిలిచి కొంతగ
మొఱవోయి యెఱుంగ కట్టిబుద్ధి కటకటా
యుఱియయ్యె నేటికిట్లని
యఱిముఱి యచ్చోటు విడచి యఱుగుచు నతఁడున్ ౯౦

ఉ॥ పుల్లయ రెడ్డి నన్నిటికిఁ బొమ్మనె నేటికి శ్రోత్రియుండ నా
వల్లనుగాదు నాకయిడి పంతమునన్ జను దేరనేల యీ
పుల్లమభొట్లు లౌకికసముద్ధతి పొల్లయిపోయె నేటి కా
పుల్లమ రెడ్డి నిందుమొగమున్ గనుగొందు నికెట్టు లీపయిన్. ౯౧

కం॥ అని జడను పడిన మనమున
తనలో నేమేమొ గొణిగి తత్తఱఁ జనుచో
వినఁబడియెఁ గొన్ని మాటలు
వినువీధి నొకింతగాఁగ వీనులుచూడన్. ౯౨

సీ॥ కట్టిన బడిలోనగల యొజ్జలకు నెల్ల
దగిన జీతమిమ్మని ధర్మశాలి
యుడిగమ్ము లేప్రొద్దు నడుగని తనపాలి
కాపులపాలిటి కటికివాఁడు
యింటిపే రక్కస్తూరి యింటిలో నింగువ
కంపను నుడికి నిక్కంపువాఁడు
రాగిదమ్మిడీయు నేజోగికైననుగాని
యిచ్చెనా తనతండ్రి చచ్చువేళ

గీ॥ నెవ్వ రెరుగని పుల్లయ్య యేల లేని
పోని హెచ్చులు పలికె నీ పుల్లభొట్టు
సఖుఁడు నెటులయ్యె మన గురుచరణులకును
గురుల సఖుఁడౌట గుణములు కొసరవలదు ౯౩

మ॥ అనుమాట ల్వీనులోన సొక్కెడెదురై యంతంత నా పుల్లభో
ట్లునగన్ మెుక్కుచు దివ్యమాల్యములు పట్టుంబుట్టముల్ దెచ్చి యో
యనఘా! మా గురులిచ్చినారు కొనుడం చర్పింప విభ్రాంతి తై
దను నమ్మంగను నేరఁడయ్యె వట ధూర్త బ్రాహ్మణుం డంతటన్. ౯౪

ఉ॥ పుల్లమభొట్టు వాని గని పూజ్యులు మీ గురుపాదు లెంతయే
నుల్లసిలెన్ గురుండనుచు నొద్దిక నేనుగ విన్నవింపుమీ
యెల్లి యమాస వచ్చునపుడే శివరాత్రియు గాన నాటి కా
పుల్లయరెడ్డి ధర్మగుణమున్ గనరమ్మను మీ భవద్గురున్. ౯౫

మ॥ అని యుల్లల్లన వానిపీడికొని చిత్తాక్షేపముం ద్రోచి, నె
ట్టన రెడ్డింగనఁబోయి భద్రకవిరాట్సమ్మానముం జూపి, యా
ఘనునొప్పించితి నెల్లి యాతఁడయి నిక్కమ్మిందు కేతెంచు నం
చును వాక్రుచ్చి గృహమ్ము జేరె విధులన్ సూచించి యా రెడ్డియున్.

క॥ దైవమ్ము కతన నొక్కఁడు
శైవశ్రుతిజాలమెల్లఁ జక్కని ప్రోడవై
తా వచ్చెననఁగ వచ్చెను
శ్రీపీఠయసుకవి గేహసీమకు నంతన్. ౯౭

చ॥ వెలుఁగు బెడంగునై కరుణ వెల్లువలెత్తిన తేటచూపులన్
నెలసిన గడ్డమై సమయనిష్ఠను జూపెడు నీరుకావి ప్రా
జెలగును దాల్చి సంజయొరచిన్నెల వన్నెల ప్రొద్దువోలెఁ జి
చ్చెలి కనుమూసి వచ్చు శివసంయమి యంతటఁ గానవచ్చినన్. ౯౮

మ॥ ఎదురై యర్ఘ్యము పాద్యముం గొనుచు స్వామీరండు విచ్చేయుడం
చుదరారూఢ సమాదరమ్ము వెలయన్ సువ్యక్తభక్తిం గలా

విదురుం డమ్మునిని సర్వపూజనలు దన్పెన్ వీరభద్రయ్య యా
చదురుండాతనిఁజూచి మెచ్చుఁగొనెవత్సా! బుద్ధినీభక్తికిన్, నా

కం॥ రేపుశివరాత్రి గావున
మాపటి శివపూజవేళ మానెదుజొన్నల్
చేపడినఁ దెమ్ము లేకవి
సాపడ నన్నట్టి వ్రతము చక్కటినాకున్ ౧౦౦

కం॥ కలదనఁ జిత్తమ్ముయ్యివి
గలవనిమా వేయి యతని గరగళుపూజల్
వలసినవి కూర్చి తగవిడి
దలకాతని సాగనంపి తన మదిలోనన్. ౧౦౧

కం॥ దొరకినవిగావు చిత్రము
మఱిమఱి యరయింప నొక్క మానెడు జొన్నల్
దొరకునట రెడ్డిదగ్గర
సరు కాతని జేరవెరతు సరసుఁడు కామిన్. ౧౦౨

కం॥ హరుఁడే యీ మునిరూపునఁ
బరీక్షసేయంగ నన్ను వచ్చెనుగాన
మ్మఱువేళ యితని వ్రతమును
జరిగింపకనాదు వ్రతము చక్కటి చెడదే ౧౦౩

వ॥ అనుచు నేకాగ్రచిత్తమ్మున నిజకార్యసిద్ధిం బొందయు తెఱంగు
నొక్కింత తడవుగ నాలోచించునెడల, ౧౦౪

మ॥ మఱఁదీ! భోజనవేళదాటినది యే మాపున్ జిరంబుండి పి
త్తఱి నీకై యిటు సేచియున్నయది నీ తన్వీలలామంబు చె
చ్చెఱ రావయ్య యటంచు నయ్యెడకుఁ దా జేజెమ్మవిచ్చేసి య
త్తెఱఁగుంజూచి తదీయచింత గనఁబుద్ధిన్ నిల్చెనల్లంతటన్. ౧౦౫

ఉ॥ విచ్చినరెప్పగాగ సుకవి ప్రభుఁడుండియు మాత్రకంఠమై
వచ్చిన సుస్వనశ్రుతి గబాలునలేచుచు నేరకూరకే
వచ్చితిరా పదంపిదియె వచ్చుచునుంటి నటన్నఁజూచి యీ
వచ్చినమానికి న్వలయువస్తువులన్నియు నేడు కూడెనా? ౧౦౬

వ॥ అని యొక్కింతఁగ నూరకుండి ౧౦౭

కం॥ కవితాభావ నిమగ్నత
దవిలిన నీ మొగమునందు ద త్త్రస భా
వ విశేషమ్ము తెలుంగుదు
మపురా! నేడట్లు తోపదయ్యె కుమారా! ౧౦౮

ఉ॥ నిన్ననొ మొన్ననోయిటకు నిన్ననవచ్చిన పుల్లభొట్టు తా
నన్నది యేమి వాని చనినప్పటినుండియు నీవు గ్రొత్తగాఁ
గన్నలఁ దోఁచుచుంటి వదిగాకయు నింతకు ముందు నెన్నఁడే
విన్నదనంబుగాన మిది విస్మయమందె మఱంది నామదిన్. ౧౦౯

కం॥ అనునెడల నాత డంతయు
జననీ వినుపింతు ననుచు సముచితముగ నె
ల్లను దెలియఁజెప్పి యుచ్చటి
తన నిశ్చయమెఱుక పడఁగ దగ నిట్లనియెన్. ౧౧౦

కం॥ జొన్నలొక గిద్దెడెనను
నున్నసుఁడీ యూరిలోన సులభమ్ములు గా
కున్నవి చనవలె తప్పక
మన్నీడా పుల్లరెడ్డి మందిరమునకున్. ౧౧౧

చ॥ అనఁజెఱునవ్వుతోడ నిదియా విషయమ్మది చూడవచ్చు, భో
జనమును ముందుఁ దీర్పుమని సత్వరవృత్తి ఘటించి యవ్విధిన్
దన మనమందుఁ దోచినవిధమ్మనుఁ జక్కఁగఁ దోడికోడలిన్
వినిచిన నామెయుం దెలిసి వేగఁదదుక్త విధంబొనర్పఁగా. ౧౧౨

కం॥ చనుదెంచి నాథునొద్దకు
మనమున నీపాటికింక మథనపడంగా
జనునె మిముబోటులు ననుక్
బనిచిన నిదిదీర్చి యిపుడ వచ్చెద ననినన్. ౧౧౩

కం॥ అది యెట్టు లింత సులభమె
ముదితా పెడకాపుఁ జూడబోవుటయన మా
వదినె యిటునీకుఁ గలిపెన
యదియెల్లను దెలియచెప్పుమా యననగుచున్ ౧౧౪

మ॥ మనమైం పోవఁగరాదు గాకెటుగరా మాయిల్లు పుట్టిల్లు గా
దె నితాంతప్రియు పుణ్యశీలయనిఖ్యాతిన్ గన్న లక్ష్మమ్మ నా
యనగుం జెల్లెలివంటి దీ విషయమిట్లావంత యాలించెనా
పన చున్ భృత్యులచేత సిద్ధపడ సర్వంబు న్నిజాభీష్టమున్. ౧౧౫

కం॥ పుల్లయ కిల్లాలనుచును
యుల్లమునం గలదో యేమొ యుత్తమగుణ యా
పిల్లనెటుంగనె మును మా
తల్లి కడంగాదె చదివె ధర్మములెల్లన్. ౧౧౬

మ॥ అని యింక న్వనితా స్వభావమునఁ గొంకెంతాస మాటాడుచో
దన యిల్లాలికిఁ జూచి చిన్నతనముం దాటంగలేదింక నీ
మన మోమూనిని మెంతదవ్వు మనకున్ మర్యాదకున్ భాగ్యవ
జ్జన మెన్నండును జిన్ననాటి కథలం జ్ఞప్తిం బ్రసాదించునే. ౧౧౭

శా॥ నీకుం దోచినమాటచెప్పితి విట న్నీదోషమున్ లేదు గా
కాకాంతామణి పేదతల్లికడుపై యాగర్భకోటీశ్వరుం
జేకొన్నప్పుడు నీదుమాట వినునా ? చీమంతయే విన్నచో
నే కాలమ్ములు నూరునోయతఁడు దానిల్లాలిపైఁ దెంపునన్, ౧౧౮

చ॥ ఇది విషయమ్ము దీనికయి యిప్పటి కొక్కటియే యుపాయమున్
మది బరికించి చూచితిని మానగరాదిది యెద్దికోరినన్

గుడుపయొసంగుహాఁడఁ దుదకున్ మునిచంద్రుని సద్వ్రతమ్ములై
యిదియదియేల భాగవతమేనియు నిచ్చెద నెల్లభంగులన్. ౧౧౯

ఆ॥ ప్రొద్దుచాలపోయె పొమ్మింక శివరాత్రి
రేపు ప్రశాంతిగాను మూపటికిని
వఁయువనలు గూర్పవలె గదా పుల్లయ్య
కాపు జూచివత్తు రేపకడను. ౧౨౦

కం॥ అని సతిని బనిచి యాతఁడు
దన శయనము జేరి నిదురతశవయి యెదిరేూ
గనరానికలను గని మే
ల్కని మనమునఁ దలచె నిటుల కంపిత మతియై. ౧౨౧

శా॥ పుల్లారెడ్డి యొసంగు సంపదలతో పోదీ దరిద్రంబు ని
న్నాళ్ళుం జెల్లిన సద్వ్రతంబు విడువన్గారాదు పోతన్నకే
జెల్లెంగాదె కవి ప్రపంచమున నాశ్రీకంఠుఁడీ సిద్ధు రూ
పుల్లాసంబున దాల్చివచ్చెనని నేనూహింతు నిక్కమ్ముగా. ౧౨౨

శా॥ కాదే నెక్కడి యా హిమాలయముపైఁ గాశ్మీర దేశంబు దా
నీ దేశమ్మదియెడ సిద్ధుఁడెటుగా నిచ్చోటి కేతెంచె నా
ప్రాదుర్భూత పురాతిభాగ్యమిటులన్ రప్పించెగా కేమి లే
కీ దేహమ్మొకి శాశ్వతమ్మె చనరే యీపాటి వారెందఱే. ౧౨౩

శా॥ గర్వించున్ జనుఁడూరకే తనదు ప్రజ్ఞంజేసి యిష్టార్థముల్
సర్వంబున్ ఘటియించినాడ ననుచున్ జర్చించి చూడంగ నా
సర్వజ్ఞుండొక హేలగానడపుచో సామర్థ్యముల్ చెల్లగా
కుర్వీం దాను స్వతంత్రమే కధికుచే నున్నట్టి తోల్బొమ్మయున్.

శా॥ ఏసర్వోన్నతశక్తిచే వెడలితామీ పంచభూతమ్ములున్
జేసెన్విశ్వము విశ్వరక్షణకళాసిద్ధిం బ్రసిద్ధంబులై
యా సూర్యుండును చంద్రుఁడున్ గ్రహములెం దావిర్భవమ్మందెనే
నా సర్వజ్ఞకృపాకటాక్షము మదిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

శా॥ కర్తవ్యమ్మను దప్పకుండ నడుపంగాఁ జెల్లుఁగాకెంగునుని
గర్తృత్వమ్మును భోక్తృతల్ జనులవే కావించు మమ్మాటికిన్
మర్త్యాకారతఁ జెప్పఁడే హరి సగిన్మధ్యాంబునం గీశ మ
త్కర్తవ్యమ్మును బూని శంకరు మదిన్ ధ్యానించు నుత్సాహినై.

కం॥ అనియతఁడు లేచిచూడఁగఁ
గనుపడెఁ దొలిదెసను జక్కఁ గగన శిరోభూ
షణమయి యప్పుడ యాతని
కిని మ్రొక్కుచుఁ జనియె నతని గృహాలక్ష్మియటన్. ౧౨౮

శా॥ స్నానంబున్ నెఱవేర్చుచుం ద్వరత్వరన్ సంధ్యాదికృత్యమ్ములన్
ధ్యానంబున్ జపముం దపంబు నటుపై నాయూవిధుల్ దీర్చి చి
ద్ధ్యానైకస్థితచిత్తుఁ డగ్రజుని పాదాంభోజముల్గొల్చి యా
పైనిన్ శిష్యుఁడు వెంటరాఁగ వెడలెన్ భద్రుండు చిన్ముద్రుఁడై.

మ॥ ఎదురై పుల్లమభొట్టిదేమి తమరా యొందాక యీపోక మా
పెదశాపుల్ తమరాకకై యెపుడు నువ్విళ్ళూరుచున్నారు నేఁ
డిదె యాతండుపవాసముండి మిము నిద్దే పిల్వఁగాఁబంచె వ
చ్చెద మీవెంటన యింతనంత నెపుడే సిద్ధమ్ముగాయుయ్యేడన్.

ఉ॥ ఇంటికిఁ బోయివత్తు నిపుడే పితృకార్యము గూడ నేఁడు, మీ
వెంటనె రాఁగ దీరదట వెళ్ళెడు లోపలరానె యంచు నా
తుంటరి బ్రాహ్మణుండు పెడత్రోవలబోయిన నానుకుల్మదిన్
గెంటిన ముక్కలై సలుపఁ గేవల నిశ్చల చిత్తవృత్తితోన్. ౧౩౦

మ॥ పురవీథిం జనుదేరఁగా శిశువులన్ మ్రొక్కించుచున్ మ్రొక్కువా
రరుదై చూచెడివారు భక్తివశులై యంతంత వెన్నాఁడు వా
రరుగుల్ డిగ్గెడివారునై బహుళమర్యాసం బ్రవర్తిల్ల, భూ
సురముఖ్యుండత డెల్ల వారియెడ మెచ్చుంజూపి దీవించుచున్. ౧౩౧

కం॥ పసితోండర నటుమసలక
చనునెడఁ బురజనులు వెనక సందడి పడుచున్
మును గడపదాటి యొఱుఁగం
డనఘుఁడు నేఁడేల యిట్టు లరుదెంచెనొకో. ౧౩౨

చ॥ ఎవనినిఁ జూడనెంచెనొ మహాన్ సుకృతాత్ముఁ డతండుగాదె కా
దెవరును వీరభద్రకవి కీడు జగమ్మున నెందఱెందఱీ
కవివరు సొమ్ము చేఁ గఱవు కాలమునం బ్రతుకుల్ భరించిరో
శివ శివ యట్టివాఁ డిపుడు శిష్యునితో నెటుఁ బోవనెంచెనో. ౧౩౩

ఉ॥ వింటివె పెద్దకాపు పురవీధుల విస్తరులుంచి వడ్డనల్
దంటఁగ జేయునంట పద దప్పలముం దినవచ్చు నత్తవా
రింటను విందులేమి కొఱయే యనియొక్కఁడు మాచిరాజుగా
రింటికడ న్వచించె నొకయిల్లటనల్లుని మేలమాటగా. ౧౩౪

కం॥ వీరకవి వాని వినుచునె
చేరెను శ్రీ పుల్లరెడ్డి సింహద్వారం
బారసి యాతని రాకడ
ద్వారస్థుఁడు పెద్దకాపు నది తెలుపఁ జనెన్. ౧౩౫

శా॥ ఆలోకించెను వీరభద్రకవి యా యారామ రంగస్థలీ
కేళీమందిర మొక్కమారు శిఖరిన్ కేతుచ్ఛవుల్ చూడ నా
భీలమ్మై బహులార్త రక్తకణముల్ బింబించె నచ్చోట వే
రాలెన్ బాష్పకణంబు లాయనఘు నేత్రమ్మందు రక్తచ్ఛవిన్.

ఉ॥ ఈ నరకమ్ము మాడవలెనే శివుఁడింతటి వ్రాత వ్రాసెనే
దీనులఁ గొల్లగొట్టి గడతేఱిన రడ్డిగృహమ్ము వాకిటన్
మానవుఁ డెవ్వఁడే నిలచునా! సరివచ్చిన కార్య మేమగున్
మానము నేటితో గలసె మంటని కెక్కడివాసమున్నతుల్. ౧౩౭

మ॥ అని చింతించెడి వేళ బందుగులతో నారడ్డి విచ్చేసి యో
యనఘా భద్రకవీంద్ర! వచ్చితిరె రండయ్యా యిటుల్ మీఁదు ద

ర్శనభాగ్యంబు లభించె నేటికిఁ గృతార్థంబయ్యె నాజన్మమం
చును లోనంగొనిపోయె గారవము హెచ్చెన్మెచ్చె దీపింపఁగా.

శా॥ చూపింపంగను పెద్దకాపతఁడు నచ్చో బోవుచుం జూచె నా
క్రేపుల్ నిండిన సాలలన్ గొలుచు లెక్కింపంగ గాపుండుటన్
జాపం బోసిన రాసులన్ మిరపవంటన్ గంటికిన్ రెప్పగాఁ
గాపుల్ గాసెడి పెద్దకాపరుల శుష్కమ్మైన చిత్తమ్ములన్. ౧౩౯

మ॥ ఒకచోఁ గుంకుమరాసులై కొలుచు వేఱొక్కంటఁ బొంగుప్పలై
రకముల్ దీర్చిన రత్నరాసులయి విభ్రాజిల్ల నావంటరె
డ్డికి ధర్మమ్ములఁ జూచి చూచి జలధిన్ డిండీరకాండమ్ము లెం
చి కటాక్షాంచల చంచలమ్ములగు లక్ష్మీదేవి నృత్యమ్ములన్.

ఉ॥ రాపిడిఁ గొన్న యీహృదయరంగమునం దొకపాటి నవ్వులై
త్రోపిడులాడు భావములఁ ద్రోచి యిదేమిటు తెచ్చెనన్న నీ
కాపు మదీయభాగ్యములఁ గన్నులఁ జూచిన నిచ్చగింపఁడా
బాపఁడటంచు నెంచె నొకొ బాపురె వీని వివేకమేమనన్. ౧౪౧

ఉ॥ రేపులు మాపులున్ నడికిరేలును నిద్దురకోర్చియోర్చి యీ
కాపులువచ్చి యిందు బడికాపులు కాయుదురౌర రడ్డికిన్
సాపడిరో నిసుంగులకుఁ జాలనిగంజియె చూచివచ్చిరో
పాపము వీరికెన్ని యుపవాసము లిప్పటికిట్లు చెల్లెనో. ౧౪౨

మ॥ అభిమానమ్మన దాతతండ్రి తరముల్ పోయుంబ్రవర్థిల్లె నీ
శుభవంశమ్మన నంచు రెడ్డి కటు మెచ్చుం గూర్తు రేకాని యీ
సుభగమ్మన్యుఁడు వారికష్టసుఖముల్ చూడంగ నెంచండు వీ
రుభయభ్రష్టులు గాక యేమగుదురో యూహింపఁగాదయ్యెడిన్.

మ॥ పరలోకమ్మొకఁడుండెనేని ప్రభుసేవాత్యక్త సర్వస్వులై
మరణమ్మందిన వారి కాజగము సంప్రాప్తించు నివ్వారికిన్
దొరలున్మెచ్చరదెంత జేసిన నిటుల్ గోపించు నిల్లాలు దు
ర్భరదారిద్ర్యమునన్ క్షుధావికల గర్భశ్రాంతయై దైవమున్.

చ॥ మునులకు వీరికింగలుగఁబో దొకపట్టున భేద మింతయున్
గనరు శరీరగౌరవము కాంచిరి తృప్తిపహింత్రు సంపదల్
మనమున నీసులేదు నభిమానము పూజ్యము సర్వమందునన్
గనినటు చూడ నేర్తురు జగమ్మఖిలమ్మ నిరీహవృత్తులై. ౧౪౫

మ॥ అని చింతాంబుధిమగ్నుఁడౌ నతని పై పై వల్కె నా మాచిరా
జనఘుల్ మా పెదకాపు మామల రణమ్మర్పించినారంచుఁ జూ
పెను గోశాంతరమందు దిద్దినటులౌ పెక్కుల్ సువర్ణంబులన్
ఘనవస్త్రంబుల మాల్యహారములనా గన్నుల్ మొగుడ్పన్ గనన్.

ఉ॥ అంతటఁ బెద్దకాపు దరహాసముతోడుత మాట మార్చి మీ
యంతటివారి పాదముల నస్మదగారము పూతమయ్యె రం
డింతట చావడింగొలిచి యిష్టకథల్ పచరింతమంచు నా
చెంత గృహాంతరమ్ము నకుఁ జేర్చి కవీంద్రుని దోడివారలన్॥ ౧౪౭

చ॥ అటనొక పట్టుదారముల యల్లిక దీర్చిన మేలి తివాసి పై
నటునిటునున్న దిండుల నొయారముగా సవరించి రెడ్డి తా
మిట దయ సేయుఁడంచనెఁ గవీంద్రు నతండు బయల్ కొలాయి న
చ్చటఁ దగ వేసి దానిపయిఁ జక్కగ దానుపవిష్టుఁడైనచో. ౧౪౮

కం॥ గుసగుసలు పోవువారిని
గసరిన యటుచూచి పెద్దకాపును గూర్చుం
డ సఖులటఁ గొలిచియుండిరి
ప్రసన్న గంభీరుఁడగుచు రెడ్డియునంతన్. ౧౪౯

వ. ఆ కవీంద్రునిజూచి దేవరముదల కీదాసుండు వేచియున్నవాఁడు. మఱియు నొక్క విన్నపంబుగలదు. తమ యనుమతిఁగోరి కావలయు శిష్యులదె నిల్చియున్నవారు. వారింగూర్చుండఁదలంపుడు. అదిగాక వీరలేమేమి చదువుచుండిరో సెలవిప్పింప విన గుతూహలంబు గలదని సవినయంబుగా జిరునగవు మెరయం బలికిన గౌడశాక తెలివొందిన యాసనంబున నాకవీంద్రుండు. ౧౫౦

క॥ తనవెనుక నొదిగి యుదియె
ల్లను విను నాశిష్యుఁ గన్నులను నగి కనఁగా
వినయమ్ము మెరయ గురునకు
ప్రణామ మొనరించి యతఁడు ప్రౌఢగళమునన్. ౧౫౧

క॥ వినిపించె నపుడు నైషధ
మునఁ జదివిన దాని నలునిఁ బురుహూతముఖుల్
గని యాచించిన ఘట్ట
మ్మును వారడుగంగ భావమును నిటుపలికెన్. ౧౫౨

వ॥ మున్ను దమయంతీ స్వయంవరమ్మున కరుగు నలచక్రవర్తి
నింద్రాదులు దమయంతీ సమభిలాషమ్మున వంచింపనెంచి
మధ్యేమార్గమ్మున నతనిం గాంచి సముచితమ్ముగా దమ్మెతిం
గించి యిట్లనిరి. ౧౫౩

శా॥ ఓ చంద్రాన్వయ వీరసేనతనయా! యోదానవిద్యానిధీ!
నీ చారిత్రము వేయికన్నుల సదా నిక్కమ్ము వీక్షించుచున్
తూ, చా తప్పని సత్యసంధతను సంతోషింతు మశ్రాంతమున్
నీచే నొక్క యభీప్సితార్థము గొన న్విచ్చేసినా మింతటన్. ౧౫౪

క॥ యాచితము సఫలమైనను
నీచుని యాచించుకంటె నిజముగ వ్యర్థం
బై చన్న సుగుణశాలిని
యాచించుట మేలుగాదె యమలగుణనిధీ. ౧౫౫

వ॥ అదియు నొక్కింత మార్గాయాసం బపనయించి పలుకుచున్న వార
మనిన విస్మితుండై యా నిషధేశ్వరుండు తన మనంబున. ౧౫౬

చ॥ అడుగకమున్న యర్థిహృదయంబు నెఱింగి తలంపు కెచ్చుగా
నిడఁగలవాఁడు దాతయగు నించుక కొంచిన నాలసించినన్
గడవఁగ బెట్టియున్న నుడికారమునం బరుసమ్ము చూపినన్
గడకు వికారభావమును గన్పడఁ జేసినవాఁడు దాతయే. ౧౫౭

క॥ అడిగించుకొనుచు వలుమా
ర్లడియాసలు బెట్టునాత డధముఁడు జగతిన్
దడఁబడక మాటలోపల
వడిఁదలఁచిన దిచ్చువాఁడు ప్రథముఁడు గాఁడే. ౧౫౮

క॥ యాచించు జనుని కోరిక
తూచినయటు దీర్పకున్న దుర్జను మహి దా
మోచుటకుఁ జాల దగముల
నా చతురబ్ధులను మోయునలదొక్కింతన్. ౧౫౯

క॥ తొలిపుణ్యమ్ముల వ్యయమున
దలకొను సంపదలు నాపదలె చూడంగా
నలఘు చరిత్రుల సితకర
జలజమ్ముల నిడుట వాని శాంతివిధి గదా. ౧౬౦

ఉ॥ ఇంతకు వేడువారు స్వరధీశులు దాతలకెల్ల దాతలై
మంతున కెక్కువారు నరమాత్రుఁడ నేనట యిచ్చువాఁడ నా
వింత యిఁకేమిగావలయు వీరలకుంగొన దుర్లభంబు నా
చెంత లభించునా యనుచుఁ జిత్తమునం దలపోసియంతటన్. ౧౬౧

చ॥ కలదు త్రిలోకసుందరి జగత్త్రయ దుర్లభ భీమపుత్రి నన్
వలచిన వార్త దాని వినివచ్చిరొ వేల్పులు నీర వీరి కా
లలనఁబరిగ్రహింపఁగఁ దలం పదిగల్గినయేని యందునా
వలసిన కార్యమున్నయెడ వంచన లేక ది నిర్వహించెదన్. ౧౬౨

మ॥ అనియూహించెడివేళ వారు నిషధేంద్రా! మేము యాచించు దా
నిని విన్పింతుము నీవు గాదనక మన్నింపంగ దకుండ వ
ర్థి నికాయంబున కెల్లవేళ తమరెంతే పాణిపీడోత్సవ
మ్మున దౌత్యమ్ము వహించి మాకొరకుఁగాఁబుణ్యమ్ము నార్జింపుమా.

వ॥ మాయనుగ్రహంబున నీకదృశ్యత్వంబు తలచినపుడ సిద్ధించుఁగావున
నంతఃపుర ప్రవేశంబు సులభంబు నిశ్శంకముగఁ బోయిరమ్మని

యర్థించుటయు నమ్మహీపతి ధర్మమ్మునకు వెఱచి దానికియ్య
కొనియె.

కం॥ యాచకుఁడగు వామనునకు
భూచక్రము నెల్లనిచ్చెఁ బుణ్యుఁడు బలి ము
న్నా చక్రవర్తికడ శు
క్రాచార్యులు లేరుగాన నదియటు పొసఁగెన్. ౧౬౫

ఉ॥ మంగళ మీవదాన్యజనమండలికిన్ నిఖిలార్థకోటికిన్
మంగళ మీకవీంద్రజనమాళికి మద్గురుమూర్తికిన్ సదా
మంగళ మస్మదాదులకు మంగళ మీమహితాంధ్రభారతీ
మంగళమూర్తికిన్ సుగుణమాన్యుఁడు పుల్లయరెడ్డిమాళికిన్.

కం॥ ఇది వీరభద్రగురువర
సదమల కరుణాకటాక్ష సంజనితగుణా
స్పద శుభగసు
గదితము నలరాజు దౌత్యకథ యిది ముగిసెన్. ౧౬౭

వ. అని సమయోచితమ్ముగాఁ బలికి యా బ్రహ్మచారి మిన్నకుం
డుటయు. ౧౬౮

ఆ॥ వినుచు దాని వారు విస్మయమందిరి
వీరభద్రకవియు వింతపడియె
అరసి యరసి యందు నర్థ మా పెదకాపు
మనసు వింతగాఁగ మారుపడియె ౧౬౯

మ॥ అతఁడా భద్రకవీంద్రుఁజూచి తగునయ్యా! మిమ్ము సేవించి తా
నితఁడీ చిన్నవయస్సునన్ సుకవితా హేవాకముం జూపె మి
మ్మితరుంబోలెఁ దలంచుదోషమదియే నేరీతిఁ బాయున్
తతకారుణ్యనిధాన! తెల్పగదవే! దాక్షిణ్యచిత్తస్థితిన్. ౧౭౦

మ॥ అనుచుం బుల్లమరెడ్డి లేచి వినతుండై వచ్చి యీమీరు వ
చ్చిన యర్థంబట నానతిచ్చి దయ నాచే నద్ది చేయించుకొం
డనుచుఁ బ్రమొక్కిన వీరభద్రకవి యత్యాశ్చర్యముం జెంది స
జ్జనతా కల్పకమైన శంకరుఁగడుఁ ధ్యానించి చిత్తమ్మునన్. ౧౨౧

కం॥ చిఱునగవుతోడ నాతని
మఱిమఱి కూర్చుండబలికి మఱి కూర్చున్నన్
దెఱచిన కన్నుల వినఁ దన
తెఱఁగిటు లెఱిగించె శాంత ధీరస్వరుఁడై. ౧౨౨

కం॥ కాశ్మీర దేశ వాసుం
డశ్మాహారమునఁ జేసి యమల తపంబుఁ
గశ్మలము లుడిగి తిరుగుచు
నశ్మంతక మాది దేశ మరయుచు వరుసన్ ౧౨౩

కం॥ వచ్చె శివయోగి యొక్కఁడు
చెచ్చెఱ నా పూర్వపుణ్యసిద్ధి యనంగా
వచ్చి యట మా గృహమ్మున
కచ్చెరువగు నొక్కవ్రతము నాతఁడు దాల్చెన్. ౧౨౪

కం॥ మానికి బ్రతి శివరాత్రియు
మానెడుజొన్న లట వలయు మన యూరను గా
దేనెచట గిద్దెడైనను
దేనోపక నీదు సన్నిధికి రానయ్యెన్. ౧౨౫

చ॥ కుదువ యొసంగువాఁడ తమకుం బ్రతిగాఁగ నదెట్టిదైన మీ
మదిగలదాని మాకు నొకమానెడు జొన్నలు నిచ్చిపుచ్చుఁడీ
యిదియె యభీష్టమన్న విని యెల్లరు విస్మయమంది రెంతయున్
మదిఁ బరికించిచూచి యనుమానమువాయఁగ రెడ్డి యిట్లనున్.

కం॥ ఒక మానెడు జొన్నలకయి
యకటా మీవంటివార లర్థించుటయా

పకపక నగి నిచ్చుటకును
మొకమోటము లేనివాఁడు పుల్లమకాపా. ౧౭౭

కం॥ వలదింక నిట్టి మాటలు
వలసినయవి తీసికొనుఁడు పంపెద నిపుడే
కొలుచెంత యేని గలదని
కలకల నగి పెద్ద పాలికాపుం గనుచున్. ౧౭౮

చ॥ అదె మన పెద్దకొట్టమున నప్పుడుదాచిన జొన్నలన్నియున్
బదిలముగాఁగ దీసి మన భద్రకవీంద్రు గృహమ్ముఁ జేర్పుఁడీ
యిదె యిటనున్నయట్లు యిపుడే చనుదేవలె నంచు గట్టిగా
ముదల యొసంగె నెల్లరు నపూర్వమటంచును విస్మయింపడన్.

ఆ॥ అన్నియేల మాకు నట వద్దువద్దని
పలికె నతడు వీరభద్రకవియు
దాసుఁడింత మాత్రతగఁడె మీసేవకు
ననియెఁ బెద్దకాపు వినయమెసఁగ. ౧౮౦

ఉ॥ అంతట వీరభద్రకవి యాతని గన్గొని మాకు విస్మయం
బెంతయు నయ్యె నీచరిత మెద్ది యభీష్టము నీకు నావుఁడున్
సంతసమంది మోసుకవి చంద్రమ నిక్కమ యిత్తురేని యీ
పంతములేలఁ బేర్మి మెయి భాగవతమ్మును నాకొసంగరే. ౧౮౧

మ॥ అనియర్థించిన నిశ్చితార్థ మదియే యాట న్వితర్కించి యా
ఘనుఁ డాదీనుల నుద్ధరింప మదిలోఁ గాంక్షించి యేనిత్తు నీ
కు నవశ్యంబును గాని యొక్కటది నీ కుంజేయ శక్యమ్మొకో
యనినం జిత్తమటంచు లేచె నతఁడాహా చెంత నా చూపరుల్.

ఉ॥ తప్పకవానిఁజూచి నెఱతాతవు నీవని భద్రసూరి నా
కిప్పటి కిచ్చుమాట యది యెన్నటికి న్విడరాదు సుమ్ము నీ
యుప్పన కానపడ్డ ప్రజ లొక్కట నాకట మాఁడుచుండఁగాఁ
బప్పులుమాకు బెట్టెదవు భాగ్యము లేటికి మమ్ముఁబోలఁగన్. ౧౮౩

ఉ॥ ఒప్పిదికింప కీదినము నుండియు వీరలపొట్ట చల్లగాఁ
దప్పక చూతు వేనిది యథార్థము భాగవతమ్ము నిచ్చెదన్
తప్పదు నీకటన్న నటు తప్పకొనర్చెద నంచుఁబల్కెఁ దా
ముప్పిరిగొన్న తోషమునఁ బుల్లమరెడ్డి వినిశ్చితాత్ముఁడై. ౧౮౪

ఉ॥ బోరునమ్రోగె నా సభ సమున్నతకంఠము నెత్తి చూచె నా
చేరువ పెద్దకాపు మదసింధురయానము లుల్లసిల్లఁ గ
ర్పూరము తోడ నాకలికిఁ బుల్లమరెడ్డికి లక్ష్మమాంబ వే
హారతులెత్తి ఇచ్చి చనె నల్లన దాఁ దన రాణివాసమున్. ౧౮౫

మ॥ జనము ల్గుంపులుగూడి చెప్పకొను చీ సందర్భమున్ జేరి రా
ఘను గేహమ్మున కట్టివేళ కపుడా కల్లోలమున్ మాన్పి తా
ననియెన్ రెడ్డిగృహమ్ముఁ జేరవలె గాదా! చాలప్రొద్దెక్కె నం
చును నానాననె నాకవీంద్రుఁడు త్రిధాశుద్ధాంతరాళమ్మునన్. ౧౮౬

మ॥ చెలువున్ దిద్దిన పల్లకీ యొకటినిల్పెం బెద్దగుమ్మమ్మునన్
వలదన్న న్వినకా కవీంద్రుని గడుం బ్రార్థించి యెక్కించి తా
వలకేలంగొని పల్లకిన్నడచె నా వర్ధిష్ణుఁడా రెడ్డి వే
తిలకించెం బుర మప్పుడా కవియు నంది గ్రామహాటంగడన్. ౧౮౭

శా॥ ఇంటింటన్ శుభహారతుల్ గొనుచు దామేతెంచి రావేళ ము
క్కంటింగొల్చినయట్లు పంటమెలతల్ కళ్యాణ గీతమ్ములన్
వెంటన్వచ్చిన విప్రపుంగవు లటన్ వేదమ్ము ఘోషింపఁగా
నింటింజేరుచు వీరభద్రకవి దానెంతే విశుద్ధాత్ముఁడై. ౧౮౮

ఉ॥ పుల్లమరెడ్డి పంపిన యపూర్వపు వస్తువులన్ని యేర్చి తా
నెల్లరకిచ్చిపుచ్చె నత డెంతమహాత్ముఁడొ యంచు విస్మయో
త్ఫుల్ల మనంబులం బ్రజలు పొంపిరివోవ ముదమ్మునంది యా
పుల్లమ భొట్టునందుకొనె పో యపు డెచ్చటనుండి వచ్చెనో. ౧౮౯

కం॥ ఆశిష్యుఁ బిలిచి యతఁడొక
కాశీశాలువను దీసి గారవమున

క్తి శక్తి చిరము వర్ధిల
నాశీర్వాదమ్మటంచు నాతని కిచ్చెన్. ౧౯౦

ఉ॥ సందడిలేటి యా సుకవిచంద్రుఁడు గేహిని జేరబిల్చి త
త్సుందరి కందియిచ్చెను మధువ్రవరుజ్జ్వల పుష్పమాల, నీ
విందమటంచు నామెయు నదే యిదియంచును దోడికోడ, లిం
పొంద నలంకరించె నది యొక్క విధమ్మగు నందమందఁగా. ౧౯౧

కం॥ తెలిసికొనెఁ గవియుఁ గ్రమమున
జెలువయు వదినయును రడ్డిచెలి కీవృత్త
మ్మలఘుఁడితఁ డెలియఁబనుచుట
వలనను దనకార్యమిట్లు ఫలియించుటయున్ ౧౯౨

కం॥ మెచ్చుకొనె నాతఁ డాసతి
సచ్చరితకు దనదు సతికి సరిచేయుగుటన్
మెచ్చిడిన పూలదండను
గుర్తిచ్చిన విధమందుఁ గలుగు కులుకు పనులన్. ౧౯౩

కం॥ తా విన్నపమ్ము చేసెను
యావద్వృత్తాంత మప్పు డగ్రజునొద్దన్
దీవించె నతఁడు తమ్ముని
యావజ్జీవమ్ము నిటులె యలరు మటంచున్. ౧౯౪

ఉ॥ అప్పుడు పెద్దకాపు హృదయమ్ము విశుద్ధి వెలుంగఁ బేర్మితో
నప్పటికప్పుడెంచి యధమర్ణుల నెల్లరఁ బిల్వఁబంచి, మీ
యప్పులు నేటితో సమసెనంచు నొసంగెను, వారలిచ్చు నా
యప్పుల పత్రముల్ గుదువలైనవి సొమ్ములు చిల్లిగవ్వతోన్. ౧౯౫

ఉ॥ మార్పుడు బుద్ధి దానగుణ సంపదనుండె, తనయూరి కెల్ల, సం
తర్పణ సేసి తృప్తిపడిన న్మది తృప్తివహింపకున్కి, నా
తీర్పరి బీదసాదల కతి ప్రమదంబునఁ బంచె ధాన్యముల్
తర్పిత దీనభృత్య జనతానుతనవ్య యశోభిరాముఁడై. ౧౯౬

మ॥ జనముల్ దా మట వీరభద్రకవి సాహూచ్ఛృంకరుం డౌటచే
ధనపత్యర్థ సమున్నతిన్ దనకు మిత్రుం డైన యీ రెడ్డిచే
మనకీ భాగ్యము లీయబంచె నిటు లస్మత్పుణ్యముల్ పండె, నం
చును గీర్తించిరి వారిసచ్చరితమున్ శుద్ధాంతరంగమ్ములన్. ౧౯౭

కం॥ కవి హృదయభావముం బలె
రవియును దపియించియించి క్రమముగ బండెన్
నవయుగము పొడుపు వేళల
దివి కెత్తిన జోతివోలె దీధితు లెసఁగెన్. ౧౯౮

ఉ॥ పుల్లయరెడ్డి చేసిన సమున్నత దానము నాకళించి, యు
త్ఫుల్లమనోనురాగమునఁ బొంగెనన న్వెలుగందెఁ బొద్దు, నా
చల్లనివార్త లోకములఁ జాటఁగఁ బోయిన చారసంఘమై
యుల్లన గూండ్లు సేరె సరసార్థగళమ్ములఁ బక్షిలోకముల్. ౧౯౯

చ॥ సరసులఁ గొల్చి కొల్చి, భువి సంచరణమ్ములు చేసిచేసి, బల్
గిరులును బల్లెలున్ నదు లకల్పిష వృత్తిఁ జగించిమించుచున్
విరిసిన పువ్వులా తరుల వేడుక లించుచు నాంధ్రుమెచ్చఁగా
నిరవులు సేరుకొన్న కవులే యనిపించెఁ గవిప్రపంచముల్. ౨౦౦

గీ॥ నవయుగారంభ వేళలఁ గవిసె నిరులు
రాజు వచ్చెడి దాక చిరాకు పడక
ప్రజకుఁ గనువెల్తురీయఁగా వచ్చియున్న
ప్రముఖ నాయక మయ్యెఁ దారక గణమ్ము. ౨౦౧

ఉ॥ ఊరును పేరు లేక పగలుండియు దిక్కుల లేనియట్లుగాఁ
దీరిచి పెట్టు ప్రముగ్గులవిధిం బవలెల్లఁ గృషి ప్రభిన్నులౌ
వారలమెచ్చి దేవమునివర్గము లెత్తిన సేసఁబ్రాలుగన్
దారక లుల్లసిల్లె గగనమ్మున నొక్కొక వింతపువ్వులై. ౨౦౨

గీ॥ వేల్పుజవరాండ్రు శివున కర్పించినట్టి
జాజిపువ్వులఁ బోలె నక్షత్రగణము

్రత్యక్షతలనిడు ధవళాక్షతమ్ములనంగ
వెలిఁగెఁ జుక్కలు వినువీధి మొలకలెత్తి. ౨౦౩

ఉ॥ అంతకుమున్న భద్రకవి యప్పటికృత్యము లన్నిటిం దగన్
సాంతముచేసి భోజనగృహమ్మున కేగుచు శాకపాకముల్
వింతలు పిండివంట లొకవేళను దప్పని పాడిపంటలున్
బంతులుదీర్చి పీటలును బందిరి నల్గడఁజూచుచున్నెడన్. ౨౦౪

కం॥ ఆలస్యము లేదిట మీ
యాలస్యము తీర్చికొంటిరా, రావచ్చున్
చాలతడవయ్యెఁ బి యి
ల్లాలచటం బట్లుపెట్ట నరుదెంచి యనన్. ౨౦౫

కం॥ ఒకతడ విటురమ్మని దా
నొకపనిగల యన్నకొడుకు నొక్కనిఁ బిలువన్
జకచక నాతఁడువచ్చిన
సుకవియు నటు వాని జూచుచుం బలికె నిటుల్. ౨౦౬

గీ॥ చూడువచ్చినయయ్య లేజాడఁగలరో
వారినెల్లరఁ దోడ్కొని వచ్చుటయును
నీవు తమ్ముఁడుగూడను నిలిచి యిచట
వడ్డనము సేయుటయు నీదువంతు సుమ్ము. ౨౦౭

గీ॥ అన్న యీలోన నూరిలోనున్న వారి
నెవరిఁబిలిచెనో వారలనెల్లఁ బిలిచి
వచ్చువాఁడిదె మాపు నీకిచ్చినట్టి
పైకమెచ్చుట? ఉన్నదా భద్రముగను? ౨౦౮

గీ॥ సిద్ధపరపుము వేవేగసిద్ధుఁగూడి
నేను మీతండ్రి వచ్చెడిలోన నీవు
ననుచుఁ బనిచిన నాతఁడాహ్లాద పడుచు
సంఘటించెను నచటి యాచార మెల్ల. ౨౦౯

ఉ॥ తీర్చిన భూతిరేఖలను దిద్దినకుంకుమ, తావళమ్ములన్
చేర్చిన కంఠముల్, మడతపీడని గోచులు రెండుచేతులన్
గూర్చిన పూజపాత్రములు కుల్కుటురమ్ముల లింగకాయలున్
నేర్చిన మంత్రపాఠముల నిష్ఠ దలిర్పఁగ నందడించుచున్. ౨౧౦

ఉ॥ వచ్చిరి యయ్యలందఱటు వచ్చిన వేళనచోటు చూపినన్
జెచ్చెరఁ గూరుచుండి తమచెంతనె సిద్ధముచేసియున్న, యా
పచ్చని చిన్నబిల్వములు వాడనిపూవులు చూచి మెచ్చుచున్
వచ్చిరె యందరింకఁ గలవా శివపూజకు నంచుఁ బల్కుచో. ౨౧౧

ఉ॥ వచ్చెను మంత్రమూర్తి విభద్రుఁడు గోల్వఁగ మానిచంద్రుఁడున్
జెచ్చెర వారిఁ జూచి తలఁచెన్ శివలోకము చేరినట్లు, నా
వచ్చుట లేచిరా, శివశివా యుపచారమటంచు వారికిన్
బొచ్చెము లేనికూర్మి శివపూజ కనుజ్ఞ యొసంగె నాతఁడున్. ౨౧౨

వ॥ అంత నప్పురమమాహేశ్వరాచార పట్టభద్రులెల్ల సుసమాహితు
లయి ౨౧౩

శా॥ దీపమ్ముల్ వెలిగించుచున్ విపులభక్తి న్వాసి నర్పించుచున్
దాపత్రయ్యాపహారమై విమల ఘంటాధ్వాన సంజాతమై
చూపుల్ చేరఁగరాని యా ప్రణవమున్ జూడంగ, లింగార్చనా
శ్రీపుణ్యమ్ము ఫలింపఁజేసి రచటన్ జిత్తమ్ము పేశాగ్రమున్. ౨౧౪

శా॥ ప్రారంభించుచు రుద్రసూక్తము లోగిన్ భక్తిస్థిరంబైన, కం
ఠారావమ్మది శంఖనాదమధురంబై, జాహ్నవీమంజువాః
పూరంబై శ్రుతి కింపుఁ బెంపఁ దమితోఁ బుష్పాంజలుల్ గూర్చి, వా
రారాధించిరి మజ్జనంబులఁ ద్రిలోకాధారు నా శంకరున్. ౨౧౫

కం॥ మజ్జన్మము సఫలంబని
మజ్జన ధారోదకంబు మాళింగొని, యు
న్మజ్జనము చేసి హరునకు
సజ్జనులొక యింత యభవు ధ్యానించి యటన్. ౨౧౬

శా॥ పూర్వుంబోలె సువాసనల్ లలుగ మా బుద్ధిం బ్రసాదింపు మీ
పూవుల్ గైకొనవయ్య దేవ యనుచున్ పుష్పమ్ములర్పించి, యా
శైవుల్ బిల్వదళమ్ములం గొనుచు నీశా! కొమ్మ మమ్మాటికిన్
బ్రోవన్ రాగదె యంచు నాత్రికరణమ్ముల్ చేర్చి రాస్వామిపై. ౨౧౭

కం॥ అక్షరుఁడవైన నీకివె
యక్షతములు మాకు దేవ! యక్షరపదమున్
వీక్షింపు మనుచు మ్రొక్కుచుఁ
త్ర్యక్షారాధనము సలిపి రయ్యారాధ్యుల్. ౨౧౮

గీ॥ వాసితనువును నీసేవ పాలఁబెట్టి
గంధ మర్పింపనేర మీగంధమైనఁ
బ్రీతిఁగొనుమన్న శివునకర్పించి రపుడు
పరిమళము జిమ్ము మృదుగంధపటలములను. ౨౧౯

గీ॥ వత్తివెలిగించి చూపి సాంబ్రాణి ధూప
ములను నర్పించి దర్పణమ్ముల ఘటించి
భక్తివాసన శుద్ధమౌ భావములను
భూతిగై సేసి రప్పుడా భూతపతికి. ౨౨౦

గీ॥ మూఁడుతనువులఁ గాల్చి ముక్తినొసఁగు
మనుచు నీరాజనము లిచ్చి రభవునకును
ఆపరంజ్యోతిలోఁ జేర్పుమయ్య యనుచు
హారతులనిచ్చినారు కర్పూరములను. ౨౨౧

మ॥ భవ! నీలోకము నన్నుఁ జేర్పుమనుచుం బ్రార్థించె నొక్కండు, దా
భవ! నీసన్నిధి నాకొసంగుమనుచుం బ్రార్థించె వేఱొక్కఁడో
శివ! నీరూపము నాకొసంగుమని యాచించెన్ మఱొక్కండు నో
శివ! నీలో ననుఁ జేర్చుకొమ్మని యజించెన్ భక్తి వేఱొక్కఁడున్.

మ॥ తిమినిం బ్రహ్మని బ్రహ్మనిం దిమినిఁగాఁ ద్రిప్పించు నీబుద్ధి దో
షమునన్ శాస్త్రము లెంచియున్ మతములం జర్చించియున్ నీదురా

పము చూడంగల భాగ్యముఁ గలుగ దీ భక్తుంగటాక్షించి, చి
త్తమునఁ నిల్వఁగదయ్య యెల్లప్రుడు నార్తత్రాణదీక్షానిధీ. ౨౨౨

శా॥ సంసారమున సారమంచు గుణులై చర్చించి యందందునఁ
సంసారంబున సారముఁ గనెదు నా చాతుర్యముఁ దొంటి వి
ద్వాంసుల్ చెప్పఁగ వింటి నీ భజనచేతం గల్గునం చింక, మ
త్సంసారమ్మి ససారముఁ జలుపఁగా సాక్షాత్కరింపంగదే. ౨౨౩

మ॥ అనుచుఁ మ్మల్లాణ బిల్లాణంబులు మహిమాన్నదుల్ శివస్తోత్రముల్
వినవించం బఠియించుచుఁ శతకముల్ వేరీతులఁ వారు, ప్రా
ర్థన చాలించిన మంత్రమూర్తియు గడుఁ భక్తిస్ఫురద్గాత్రుడై
మన మూప్పొంగఁగ వారలఁ గొలిచి సమ్మానంబు లందిచ్చుచుఁ.

ఉ॥ పూలును బత్తిరిన్ భసితమున్ గడుదక్షిణ లుంచినట్టి, తాం
బూలము లిచ్చి మెత్తమడుపుల్, శివపూజకువచ్చు వస్తువుల్
చాల నొసంగి భక్తి కొనసాగిన చిత్తము పల్లవింపఁగాఁ
జాలనివాఁడ నెందులకు స్వాములు నన్నుఁ గృతార్థుఁజేయరే.

ఉ॥ ఈ కడుపేదవానిపిలు పెంతటిదంచు నిరాకరింప కీ
లోకమూపాక్షి నిట్లు శివలోకము సన్నిధి సేకినట్లుగా
మీ కరుణన్ గనంగలిగె మీవగు నిష్టములందు లోటు రా
నీయక మీదునిండ్లవలెనే, సెలవీయుఁగ మిమ్ము వేడెదన్. ౨౨౪

కం॥ అని యతఁడు వేడుసమయ
మ్మున నాశివయోగి నమకమును జమకమ్మున్
దనర ఘనపదవిభాగ
మ్మున జొన్నలశివునిపూజ పూర్ణముగాఁగఁ. ౨౨౫

కం॥ చిఱునగవు కనుల నటుగని
మఱచినరొుడలగుచు నచలమానసవృత్తిన్
మెఱసినటు మంత్రమూర్తిని
గుఱిఁగటను జేరఁ గన్నుఁగొనలఁ బిలిచినన్. ౨౨౬

కం॥ వినయమ్ము మెఱయ నాతఁడు
చని డగ్గఱ మ్రొక్కి నిలచి స్వామీ సెలవే
మని యడుగ మునియు నాతని
కనియెం గరుణారసార్ద్రమగు నగళమునన్. ౨౨౯

కం॥ ఉద్భటవంశమ్మునను స
ముద్భవ మందితివి మంత్రమూర్తీ! నీ యీ
సద్భక్తివచ్చె మాకది
నుద్భటవంశమ్ము దా మహోజ్వలమయ్యెన్. ౨౩౦

మ॥ విను మే నుద్భటవంశ్యుఁడన్ దొలుతట న్వేసారి సంసారముల్
పిననాఁట న్మనిధర్మమూని విడికాశ్మీరమ్ము యాత్రార్థినై
గనుగొంటిం బహు పుణ్యదేశముల నిక్కెమ్మెందు నీవంటి భ
క్తుని గానన్ ఫలియింపఁగంటి నిట నా కోర్కెం జిరాపూర్ణమున్.

మ॥ మన యీ శైవ మహామతమ్ము వెలయన్ మావంశమం దొక్కనిన్
జనియింపం దలపోసి వానిజననికిన్ సానమ్ము గావించుచున్
విను మే వచ్చితి నింతదవ్వు నిచటన్ వీక్షించితిన్ నిన్ను, శం
భుని రూపాంతరమున్ మదీయ సుకృతమ్ముల్ పండె నీనాటికిన్.

మ॥ వినుమీ జొన్నలగాథ యీపురమునన్ వేంచేయుచో మున్నుగాఁ
గనుపట్టెన్ వెడపాఱుఁడొక్కఁ డతఁ డిగ్రామమ్మునం దాతిథే
యుని నిన్నొక్కనిఁ బేరుకొంచుఁ జనుచో నూసాడి యవ్వాని చే
తను జొన్నల్ లభియింప విందుననువార్త న్వించుఁ జిత్తమ్మునన్.

ఉ॥ నిన్ను బరీక్షసేసి మదినిల్పిన కోరిక దీర్చికొంట కీ
పన్నుగడన్ భవద్గృహము నచ్చితి మానెడుజొన్నలంచు, సం
పన్న భవత్ప్రభావమునఁ బండె మదీప్సిత మీ శివార్చనన్
మన్నిన జొన్న లివ్వి యొకమానెడు నీవు పరిగ్రహింపుమా. ౨౩౪

కం॥ వినుమివి యెన్నియొ యాసం
ఖ్యను వేలుగణార్చనములు గావింపఁగలఁ

డనఘుండు నవరశంకరుఁ
డనుంగుకొమరుండు సదయమందును నీవున్. ౧౩౫

కం॥ ఇటు నా వ్రతమ్ము దీర్చితి
తటపటపడ కీవు నీదు దక్షిణభుజ మీ
ఘటనాఘటన సమర్థుఁడు
పటుమతి చూ మఱికెవచ్చె భద్రియుకవియున్. ౧౩౬

మ॥ అకళంకమ్మగు నైజవర్తనముచే నా రెడ్డిచిత్తమ్ముఁ దాఁ
బ్రకటత్యాగ నిరూఢకుంజలిపె నీ భద్రుండు సామాన్యుఁడే
సుకవుల్ మీవగు పుణ్యగాథల వచస్సిద్ధిం బ్రసాదింపఁగా
సకలార్థమ్ముల జాహ్నవీమధురవాగ్సర్వం బ్రవర్ధిల్లుడీ. ౧౩౭

మ॥ ఇఁకఁ గొన్నాళ్ళకు నీవు బంధుగులతో నీగ్రామమున్ వీడి, పొ
మ్మొకయూర నన్నదియున్న దేయనుచు నాయుష్మంత రమ్మంచుఁ బొం
దిక మార్గమ్మున బిల్వమున్ జెరుపుచున్ దీవించె మున్మాటి కీ
సుకళత్రమ్ము సుపుత్రులీయనుఁగులున్ శోభిల్ల వర్ధిల్లుమా. ౧౩౮

మ॥ అని దీవించిన విస్మయంపడిరి వా రాగేస్తు నిల్లాలు, నా
మునికిన్ మ్రొక్కినఁ జంద్రకాంతకుసుమమ్ముల్ వాంఛితప్రాప్తి ర
స్తనుచున్ మౌనియొసంగె నాయమకు దా మాలస్యముల్ లేక, పె
ల్చనవడ్డించిరి వారిపుత్రులు యథాచారమ్ము వర్తించుచున్. ౧౩౯

వ॥ అంతవారెల్ల నప్పింతకథం దలంచుచు సుఖభోజనమ్ములు గావించి
యామ హ్రదమ్ములమహాత్మ్యంబభివర్ణించుచు, మహాత్ముల దర్శనంబు
సర్వశుభదాయకంబని యమ్మునివరుంబొగడి తమతమగృహములకు
సగౌరవంబుగా నాహ్వానించిన నతండు వారిం దగుమాటలాడి
వీడుకొలిపి మంత్రయు భద్రయుల నిష్టాలాపంబులం దనిపి వేగు
టయు వారి వీడ్కొని యథేచ్ఛం జనియె. ౧౪౦

కం. ఏకశిలానగరీ మధురాకార మణికిరీటి తాత్మాగారా
ఆకారవంశ జలధిసుధాకర నరసింగ, శివకథామృతసంగా. ౧౪౧

ఇంద్రవజ్రము. శ్రీరాజమాంబా స్థిరపుణ్యభాగా
స్వారాజతుల్యోజ్జ్వల దివ్యభోగా
గోరాజ గాఢాంకురితాత్మరాగా
రారాజదైశ్వర్య రమావిభాగా । ౨౪౨

చ॥ శివపదభక్తి, భక్తిగుణ, చెన్నయపుత్ర, పవిత్రవర్తనా
శివకవికావ్యభావరససింధునిషేవనతత్పరాంతరా
శివకర ధర్మరతుణ, విశిష్ట, సముద్ధృత సత్రమంటపా
నవనవ కీర్తికాముక, మనస్వి యశస్వి, తపస్వి దైవతా. ౨౪౩

మ॥ హారిత శ్రీమునిగోత్ర మల్లయకవీంద్రాదిత్యసత్పుత్ర, సు
స్థిరవిద్వద్గురురాడమోఘకరుణా శ్రీ వీరనారాధ్య వా
క్స్థిరపుణ్య ప్రతిపాద్యమాన మహిత శ్రీ శంకరారాధ్య, స
చ్చరితమ్మందిది యాదికాండము జనశ్లాఘ్యత్వముం గాంచుతన్.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ శంకరారాధ్య చరిత్రము

## ద్వితీయ కాండము

క౦॥ శ్రీ పాశుపతవ్రత దీక్షాపర, నరసింహా, యోరుగంటిపురవర
స్థాపిత కాశీవిశ్వేశాపార కృపాప్రవర్ధితాఖల, విభవా. ౧

అవధరింపు

ఉ॥ ఆమునిచంద్రుఁ డల్లరుగ, నంతట లేచిన, చిమ్మచీఁకటుల్
ప్రామిన చిత్తమందు, మునిభాస్కరు చిత్రచరిత్ర లెంచు, చా
స్వామికృపావిశేషమును, భావనసేయుచు నట్టివేఁకువల్
తా మొకకొన్ని పుచ్చిరటఁ దమ్ముఁడు నన్నయు నందిగామలోన్.

ఉ॥ చుక్కలకన్న మిన్నయగు, సూనునిగాంచ నిశావధూటి, దా
నొక్కొకచుక్క నాబయల నుండఁగనీక, గ్రహించువాఁడునన్
ప్రొక్కని వేలుపౌచు మునిముఖ్యుఁడొసంగిన జొన్నపేలముల్
దక్కఁగ మంత్రమూర్తిసతి దాఁగొని తాల్చెను గర్భభారమున్. 3

ఉ॥ చుక్కలుతగ్గు వేఁకువయి, చూపులకింపుగ నా వధూటి తె
ల్లెక్కిన మేనిఁ జూచుచు మునీంద్రునిమాటలు సంస్మరించి, యా
చక్కి విడంగ బంధుజలజాతముదర్కశుభమ్ము లెంచుచున్
మక్కువ మంత్రమూర్తి బుధమాన్యుని వీడ్కొనె నెట్టకేలకున్. ౪

మ॥ ఒకచో నిచ్చు మహోన్నతస్థితిని, వేఱొక్కంట హైన్యంబు దా
నొకచో నిచ్చు సుజీవనమ్ము నొకచో నూఁగించు జీవమ్ము, గ్రు
క్కకపోవచ్చునె కాలరీతి కెవఁడుం గాలోచితాచారతన్
సకుటుంబమ్ముగ మంత్రమూర్తి విడెఁ గాణాచిన్ వయఃశ్రాంతమున్.

శా॥ ఎచ్చోటం జనియించునో తనువు తానెచ్చోటఁ జాలించునో
యిచ్చోటం చొక నిర్ణయంబుగలదే యీ ప్రాణికిన్ నైవ మే

యిచ్చం ద్రిప్పిన, నట్టులా మటయెగా కేమున్నదో యంచుఁ దా
నచ్చంజెప్పుచు రెడ్డి వీడుకొలిపెన్ భద్రుండు చిన్మాద్రుఁడై. ౬

సీ॥ తాతముత్తాతల తరములనుండియు, వచ్చిన మాన్యము ల్వెచ్చపడిన
పండనిపంటలై నిండినమందువా లయగారి నట్టిల్లు లయినఁగాని
తీయనిచుట్టమై పాయని చెలువమా చావడి తానెంత లేవడైన
చెప్పినచదువులై చేసిన జపములౌ తోటలు నాలలు మాటుపడిన

గీ॥ విడక తమ యన్నదానమ్ము విడువలేక
విడిచి రాయూరు వారలు విడువరాక
చివరి మిగిలిన యాజన్మసిద్ధమైన
సొమ్ము మానమ్ము దారిబత్తెమ్ముగాగ. ౭

శా॥ కన్నీరుంచుచు జూచి యొక్కపరి యాగ్రామమ్ము పొల్మేరలో
నెన్నాళ్ళాయెనో యిందువచ్చి యపురా యీనాటి కీరీతి, పి
డొక్కన్నం బో దభిమానమియ్యెడల నేకొంచెమ్ము మాపైనిఁజూ
పున్నం జాలు నటంచుఁ బల్కిరట నాయూరెంత ప్రాణమ్మొకో.

ఆ॥ వె॥ నందిగామవిడిచి నాటుబండ్లను గొంత
కాలినడకఁగొంతకడచి దేశ
ముల నిజామురాష్ట్రమందు మందుగలన్న
పురము కాపురమున కరవటంచు. ౯

చం॥ అట వసియించి యుండుఁగలయట్టి సుహృజ్జనులాదరింపఁగాఁ
గటకటలేక సర్వజనగౌరవమందుచుఁ బూజ్యపాదులై
యట నొకకొన్నివున్నములు హాయిగ వారలు వెళ్ళఁబుచ్చి రె
చ్చట సుకృతాత్ములందఱు నిజస్థితి లభ్యములై నమన్ననల్. ౧౦

గీ॥ వారిరాకడ యా యూరివారికెల్ల
గ్రీష్మతాపంబుచల్లార్చి కీర్తిగన్న
నవ్యవార్షిక మగుచు నానందమొసఁగి
యద్ది యానందవత్సర మగుట తెలిపె. ౧౧

ఉ॥ ఆశివు వామదక్షిణములౌ నయనమ్ములు పుష్పవత్పద
శ్రీశబలమ్ములై, గతివిశేషమున, న్నిటలమ్మునంట, గౌ
రీశుఁడు నీ తమోమయ మహీతలమెల్ల సముద్ధరింప, వా
రాశితరంగమై, సుమధురమ్మగు చల్లనిచూపు, చూచినన్. ౧౨

మ॥ శరదారంభములయ్యె, నాకసమునన్ శాంతించె వర్షాబ్ద, ని
ష్ఠురగర్జానినదమ్ములెల్ల, వ్రజకున్, సూర్యప్రతాపంబు, భా
సురమయ్యెన్, జరమాద్రికొమ్మతుదలన్ జ్యోతిష్మతీనాథుఁ డు
త్తర శృంగోన్నతిమించె నాగిరిశమూర్ధ స్వర్ణదీపిచియై. ౧౩

శా॥ శ్రాంతిం జెంది, నభోనభస్యములు, వర్షస్నిగ్ధవిశ్వంభరా
ప్రాంతమ్ము ల్గను వేడ్క, నా శిఖరుల న్రాజిల్ల, భూమీధరో
పాంతమ్ము ల్పొలుపొందె, నాకసము విస్పష్టంబుగావచ్చె, వ
ర్షాంతప్రస్ఫుట చంద్రపాండురకరవ్యాలీఢసర్వాంగమై. ౧౪

శా॥ శ్రీవిశ్వంభరమాతృభావమధురశ్రీ దోఁచె నల్దిక్కులన్
గోవుల్ లేగలఁగాంచి పాడికురిసెం, గుంభమ్ములన్, బంటలన్
దావుల్ నించెఁ బొలాలు శంకరుని యాత్రావేళ నర్చింప నాఁ
బూవుల్ పండులు హస్తపల్లవములం బూనెన్, లతావృక్షముల్.

శా॥ ఈ విశ్వమ్మును జుట్టిరా నరిగె మున్నేమాని సర్వజ్ఞుఁడా
శైవస్వామి, విశుద్ధజీవనుఁడు, సంజ్ఞామాత్ర సంస్తంభిత
గ్రావాధీశుఁడు దక్షిణాపథ నభోరత్నం బగస్త్యుం డటన్
వేవచ్చెన్ సతిగూడి శంకరుని యావిర్భావకాలజ్ఞుఁడై. ౧౬

కం॥ పరిపూర్ణసస్యసుందర శరదాగమమధురగతి విశారదయయ్యెన్
హరభక్తుగృహిణి జేజెమ పరిపూర్ణమ్మయినగర్భభారమువలనన్.

మ॥ కలఁగాంచున్ సతి పెక్కువేఁకువల నాకైలాసవాసిన్ శివున్
దలఁపింపంగల మేనిచక్కదనమై, తావచ్చి యొక్కండు, ని
చ్చలు సేవించుట, భక్తరూపము గణార్చల్ పెక్కుకావించుటల్
కల గాదంచుఁ దలంచు నంత మునివాక్కల్యాణమూహించుచున్.

కం॥ పరిహాసకమ్ముగను, నా పురంధ్రి, కల తెలిపి పతికిఁ బొలతి సలజ్జా
దరభావారుణవదన మ్మరసి కృతార్థతనుగాంచు నాతఁడు నెమ్మిన్.

శా॥ నీళ్ళాడంగను ప్రొద్దులై సతికనె న్విశ్వేశదీవ్యత్కృపా
వాల్లభ్యైకఖనిం గుమారు నొకనిం బ్రాచీశరోగర్భ సం
ఫుల్లాబ్జమ్మును లోకబాంధవుఁబలెన్ ముత్తైదువల్వచ్చి శో
భిల్లం దీర్చిరి నాఁటిముచ్చటలు సంప్రీతి త్వరారూఢలై. ౨౦

మ॥ దినముం జూతురు భాస్కరుం డుదయవీధి న్వచ్చుచోఁ గాని, యా
దినవైశిష్ట్య మెఱుంగ రెల్లరును, జ్యోతిర్వేత్త యే యొక్కఁడో
కనుగా నయ్యది యంతమాత్రమునఁ దద్గణ్యత్వము ల్పోవునే
జని వేళామహిమమ్ము నారకయ యాశాస్త్రమ్ము ఘోషించెనే.

ఉ॥ ఒక్కమహాత్ము పుట్టువును నొందు దినమ్మొక పర్వమౌనుగా
కెక్కడ నెంత చెడ్డదినమే నది, వేఱుగఁ జెప్పనేల, పే
రెక్కిన శుద్ధపంచమిని, నీజగముం బలుగాసిపెట్టు, పెన్
రక్కసి దున్మ దేవి నవరాత్రములన్ జనియించు పుణ్యమున్. ౨౨

కం॥ పంచమహాభూతములా పంచమిని ప్రసన్నగతులభాసిలె, దెసలున్
పంచగ్రహమ్ము లుచ్చ స్సంచారముగాంచె నతని జననము వేళన్.

కం॥ ఆనందవత్సర మ్మది యానందము కలదిగాన యానంద మిడెన్
దానన్వర్థమ్మయి, జగదానందకరుండు వాని యవతారమునన్. ౨౪

మ॥ ముని యాశీర్వచన ప్రసాదము, పురాపుణ్యైకరూపంబు, నా
తనయుంజూడఁగ మంత్రిమూర్తి విధివత్కార్యమ్ములం దీర్చుచున్
గనియె న్మాపుర నా త్రివర్గము నటు ల్గళ్యాణి యిల్లాలు, దాఁ
గనియె న్నేఁడు చతుర్థధర్మమనుచుం గాంచెం గుమారున్ సతిన్.

కం॥ శంకరభక్తుం డాతఁడు శంకరయతి మాటఁదలఁచి సకల జనులకున్
శంకరుఁడగు బాలునకు శంకరనామంబునిడియె జనములు మెచ్చన్.

ఉ॥ ఎంతటిజ్ఞానియైన నతఁ డెంతటి భక్తుఁడు యోగియైన, నీ
సంతతిపైనిఁ బేర్మి విడఁజాలఁగ నేరమి యొప్పుగాదె, యై

కాంతికమై, పరస్పర మహత్తర భవ్యనిజానురాగ సి
ద్ధాంత మహత్వమన్నఁ దలిదండ్రుల యీా పొడలే మనస్థితుల్. ౨౭

కం॥ తనజనన్ము కతమ్మునఁ
దనతండ్రి కృతార్థుఁడయినఁ దా నిపుడయ్యెన్
దనుముగులు పుత్రుఁ బడయుట
ననఘుఁడు శ్రీమంత్రమూర్తి యఖిల జగమ్మునన్. ౨౮

ఉ॥ పుత్రులఁ గాంచరే మునువు మూపుర, వారలకంటె సీతఁడే
పాత్రము వారి మక్కువకు వారసదాయనఁగా రొకింత యీ
చిత్రజగమ్మునం గల విశిష్టగుణమ్మది, యొంత పాత్రయున్
జిత్రము, క్రొత్తచేసి నరుచిత్తము కొల్లగఁ జూఱవెట్టెడిన్. ౨౯

సీ॥ ఊయేలలో నిద్రనున్నచో నొక ముద్దు
నొక యింతనవ్విన నొక్కముద్దు
గడ్డాలలోనున్న గదియొక్క మురిపెమ్ము
నుగ్గున కేడ్చుచో నొక్కసొగసు
నేలబారాడుచుం దూలిన నొక ముద్దు
కూర్చుండిపడుట యొక్కొటిబెడంగు
కవ్వించి నవ్వించి కసరుట యొక ముద్దు
బిక్కమోమును జూచు టొక్కముద్దు
గీ॥ చెలఁగి జిలిబిలి పలుకులఁ బలుకరించి
పలుకు పలుకున ముద్దులు తొలకరింప
ముద్దులాడుట వేఱొక్క ముద్దుగాఁగ
ముద్దులకు ముద్దు బాల్యమ్ము నుద్దిగలదె. 30

చ॥ అలసిన నొక్కనవ్వు కడు పాకుటఁ దూలిన నొక్కనవ్వు, చూ
పొలసిన నొక్కనవ్వు, మదినొక్కొక వేళలఁ గోపగించినన్
దెలియనినవ్వు, తల్లి యొడిఁ దేర్చిన, నవ్వుగ బోసిననోట, న
వ్వులు వెదఁజల్లు బాల్యము బోలఁడుగా నరుఁ డేమవస్థలన్.

మ॥ అరిషడ్వర్గము చేరరాని హృదయమ్మై, యెవ్వరిం జూచినన్
గురిపించుం దెలినవ్వు నెల్లపుడు సంకోచమ్మె మాయించు, నీ
చిఱుప్రాయమ్మును బ్రహ్మతత్త్వము మదిన్ జీర్ణించుకోలేక, పో
దురు సంసార మసారమంచుఁ గుమతుల్ దుర్గాటవీభూములన్. ౩౨

ఉ॥ మాటలురావుగాక యను మాటల యర్థమెఱింగి, పంతమున్
బోటుతనంబు జూపు మొగముం బిగియించిన చిన్నిచూపులన్
నాటెవ చిత్తమాచుఁ జిననాటి కతల్ దలపించు శ్రీలు స
య్యాటలఁ జేర్చు భాగ్యమదియందుదు రెంతటిపుణ్యదంపతుల్. ౩౩

మ॥ మనసుల్దీరఁగ ముద్దుపెట్టుకొనుచున్, మన్నించుచుం, స్నల్గితే
యనుచున్, న్వింతగ దిద్దుచున్ సొగసు, నిత్యానందనిర్మగ్నయై
మనసారం గని, యుఁగరత్నలిడుచున్ మాతృస్వరూపంబు, దాఁ
దనయుం బెన్మిటికందియిచ్చు నదెపో దాంపత్యసర్వస్వమున్. ౩౪

శా॥ ఆయిల్లాలు కుమారశంకరుని, నూయాలందుఁ బొత్తిళ్ళలో
హాయింజేరిచి, జోలల న్నిదురవో హాయీ భవానీపతీ
నాయనా, ననుగన్నతండ్రి యనినన్ బాలుండు లేనవ్వులన్
హాయి న్నిద్దురఁజెందు నానుడుల నేమర్థంబు నూహించునో. ౩౫

ఉ॥ హా, యిది మాయలోకమని యాత్మనెఱింగిన పిన్ననవ్వులో
హాయి, జగమ్మసత్యమని, యాత్మఁదలంచిన, లేఁతనవ్వులోఁ
దాయి మెడందఁ జిమ్ము మధుధారలఁ గ్రోలిన మొల్కనవ్వులో
యే మెవఁడేని చెప్పఁగలఁడే యిది యిట్లని పిల్లనవ్వులన్. ౩౬

కం॥ నవశరదారంభమ్ముల
నవతారము గన్నబిడ్డఁ డమలశశికళా
నవనవవృద్ధిం బెరుఁగఁగ
ననమమ్యోను వానిఁగను మనమ్ముల ముదమున్. ౩౭

మ॥ అత డెంతే నధికారియైన నగుఁగా కల్లారుముద్దైనఁ సం
తతి కొవ్వుల కంటిచాయ మొలఁగున్ ధన్యత్వముం జెంది, న

ట్లితరుం జెప్పఁగ నేల, నిక్క మిదిగాదే, యెందు నిర్లిప్త సం
గత శాల మ్మిదికాంచుకం టెంగలవే శానక సమాధిస్థితుల్. ౩౮

శా|| పంచాబ్దమ్ములదాఁక దైవ సముగా భావించి యాతం డ్రిడి, (శ్రీ)
పంచాక్షర్యుపదేశపూర్వకముగా వర్ణమ్ములక్ దిద్ది, పం
పించెం బుత్రకు దాసభావమొలయన్ విద్యాగృహ మ్మంత, నా
పంచాబ్దమ్ములవాని యొజ్జలకృప న్వర్ధిల్ల దీపించుచున్. ౩౯

కం|| మును పెన్న, డొ చదివినయటులనె ప్రతిభాశాలియైకళామర్మముల్
గనిగురువులమన్ననకును జనవునకును బాత్రమయ్యెశంకరుఁడంతన్.

మ|| అది కుగ్రామముగాన, నాసుతుఁడు, విద్యాభ్యాసముం జేయుచో
టిది గాదంచుఁ దలంచి, చింతపడి యే నెచ్చోట నేరీతిగాఁ
జదివింపంగలఁ జిన్నబిడ్డ ననుచుం జర్చించి, చర్చించి, కో
విదుఁడాతండుకుటుంబయుక్తుఁడగుచున్ వీడ్కొంచు నాగ్రామమున్.

సీ|| శ్రీరామభక్త ప్రసిద్ధిఁ గాంచు నవాబు
పరిపాలనను వన్నెవాసికెక్కి
యక్కన్న మాదన్నలను సన్నదమ్ముల
మంత్రిత్వమునఁ జాల మంతుకెక్కి
మతభేదములు లేక మన్నించు ప్రభువుల
ధర్మమ్మునకు రాజధాని యగుచు
హైదరుజంగుచే నపుడు కట్టంబడి
హైదరాబాదు విఖ్యాత మగుచు

గీ|| వెలసి దక్షిణాపథపురీతిలకమైన
పురము నాతఁడుచేరెఁ గాపురముగాఁగ
ముందుగల గ్రామమునసున్న మాన్యజనులు
విడువతప్పక కన్నీట వీడుకొనఁగ. ౪౦

గీ|| బహుళ శిష్యప్రపంచక పరివృతుండు
మర్మములులేక చదివించు మాన్యుఁ డనఁగ

గలఁడు శ్రీ ముదిగొండ లింగయ్యశాస్త్రి,
యచటఁ బండితుఁ డారాధ్యుఁ డమలగుణుఁడు. ౪౩

మ॥ చదువం బెట్టెను దండ్రి యాతనికడన్ సాహిత్య మా పుత్రుఁడున్
జదివెన్ శంకరుఁ డెల్లశిష్యులను బ్రజ్ఞ న్మించి యే వేళలన్
ముద మొందం గురుఁ డొజ్జ లాల్ప వసనమ్ముల్ దాన సద్భక్తిమై
నొదుగుం దన్ వలదన్న యాగురుని నోహో చేయు వృత్తమ్మునన్.

మ॥ వినయంబు న్నయనమ్ము కళాప్రతిభలు న్వీక్షించి, యాయొజ్జ, తా
మన మొప్పంగఁగ నాప్తమిత్రులకడ న్మాపేరు నిల్పంగ వ
చ్చినశిష్యుండని శంకరుం బలుకు దాక్షిణ్యంబు వర్ధిల్లఁగాఁ
దనయంతం బొనరింపఁజూచు నపుడే తత్తత్కళాసంపదన్. ౪౪

శా॥ ఆ తేఁడేండ్ల ప్రాయమప్పు డొకప్రొద్దా శంకరుం డప్పుర
శ్రీరమ్యంబగు రాజవీథిఁ జనుచోఁ సింగారముల్ దిద్ది, రా
దారిన్ జోడు గుఱ్ఱాలబండి పయినిం దావచ్చెఁ దత్పత్తనో
దార శ్రీపతియౌ నవాబు జననేత్రానందసంధాయియై. ౪౫

మ॥ పరికించెం బురవీథి బండి సాగసుం బైని న్నవాబు న్మహా
పురుషున్ జిత్తమునం గుతూహలము రేపుల్వేట నంతంతటన్
బరుగుల్వారుచు నంటి బండివెనుకన్ బాలుండు వ్రేలాడెఁ జె
చ్చెర నాబాలుఁడు సేయు నాపనిని వీక్షించె న్నవా బంతటన్. ౪౬

ఉ॥ ఆ కరుణారసార్ద్ర హృదయమ్ము నవా బట బండి నాపి నీ
కీకడు సాహసంపు పని యేటికి బాలక! చెప్పు నావుడున్
నాకొక పుస్తకమ్ము వలె నా మది మెచ్చిన చిన్న నవ్వునన్
వే కొనుమంచు గాసొకటి నిర్మలచిత్తము నట్లొసంగినన్. ౪౭

శా॥ నా కేలా యొకచిన్ని పొత్తమున కీనాణెమ్ము మన్నించుచో
రూకొక్కండిడజాలు నన్న సుగుణారూఢుండు నబ్బాలకుం
డాకర్షించె నవాబు పుణ్యహృదయ మ్మంతండు నాకోరికన్
లోకు లెచ్చగఁ దీర్చి యేగె గృహమున్ లోలో వితర్కించుచున్.

శా॥ ఆలోకించుచు వాని పుణ్యగుణ మా యౌదార్యశీలుండు శ్రీ
సాలర్జంగు నవాబు చిత్తమున వాత్సల్యంబు దీపింపఁగా
బాలుం గోటకుఁ బిల్పించి యొసగెం బ్రత్యేకపు స్మన్నసల్
చాల న్మాసము మాసమట్లిడఁగ నాజ్ఞాపించె నుద్యోగులన్. ౫౦

ఉ॥ సారటునెక్కి వచ్చు నల శంకరుఁ గన్గొని తోడివారు దా
మీరస మెక్కినార లొకయిద్దరు ముగ్గు రొకింత కాల మే
వారికిఁ దక్క నద్ది పరభావవిశారదుడైన శంకరుం
డారసి మిత్రులందఱ కుపాయన మిచ్చెను వింతవస్తువుల్, ౫౧

మ॥ అదియెల్లం గని దల్లితండ్రులును నాయాచార్యుఁడు న్మెచ్చి రే
కొదువల్లేని కుమారుబుద్ధి కటుపై గొండొక్క కాలమ్మునన్
గుదిరె న్మంచిముహూర్త మొక్క టతనిన్ బోధించి గాయత్రి బై
నొదలించెన్ శివలింగధారణము మేలొప్పంగ నాతండ్రియున్. ౫౨

శా. తానై లేచు సముద్రఘోషముల నందంజేయు లేగాలులన్
బైనిన్ శుక్రుఁడు కాంతిఁజిందుదనుకన్ వ్యాయామమున్ జేయు, బై
స్నానాదుల్ నెఱవేర్చి ఘార్ఘ్య రవికై సంధ్యావిధుల్ దీర్చి తా
ధ్యానించున్ శివు శంకరుండు బహుభక్త్యారూఢచిత్తమ్మునన్. ౫౩

మ॥ చలియు న్వానయు గానకే నియమముల్ సాగించు నేవేళ నో
జ్జలు మున్నిచ్చిన పాఠముల్ చదువుచుం జర్చించి సందేహముల్
తొలఁగించున్ సహపాఠకావళికి మాధుర్యంబుదీపింపఁ గో
యిలకంఠమ్మునఁబాడు శంకరుని యా యాపుణ్యగాథాకృతుల్.

మ॥ జననీవందన మాచరింప శివు డేచాయం గనంబోఁడు త
జ్జనకుండిచ్చిన ధ్యానతిం జలువకేసంగర్భముంజూడఁ డె
త్తినకే తెన్నఁడుసించి తానెటుగఁ దర్శింబ్రోచు కాలమ్మునం
దనఘుం డాతఁడు చిన్ననాఁటనె మహత్వాంశల్ ప్రవర్ధిల్లఁగా. ౫౫

చ॥ చిలుకలకు పేర్మిమైఁ జదువుచెప్పినఁ గొంతగఁ బల్కనేర్చుఁ గో
యిలకు స్వభావసిద్ధము మనీషిమనఃప్రియ పంచమస్వరం

బాలయును షడ్జమాధురి మయూరము, హంసము పాలునీటిలోఁ
గలిసిన నేర్చు నీ కలిజగమ్మున వింతలె తారతమ్యముల్. ౫౬

మ॥ ఒకసాయమ్మున కుమారశంకరుఁడు దా నుద్యానసందర్శనో
త్సుకవృత్తిం జని తోఁడిబాలకులతోఁ జూచెం దదారామ కౌ
తుకసంధాయకపుష్పపల్లవసమృద్ధుల్ కంటికి న్విందుగా
నకళంకమ్మగు వానిబుద్ధి నపు డుయ్యాలూఁగె భావస్థితుల్. ౫౭

ఉ॥ పెంచినపెద్దయై చిగురువెట్టి సుమమ్ములు పండ్లునిచ్చి యీ
పెంచినవారి కిమ్మఁ ఫలవృద్ధులఁ జూపెడి నీవనమ్ము పు
ష్పించి, ఫలించి కాసల దపించెడి వారలనెల్లఁ బేర్మిఁ బో
షించును గాన నమ్మదివిశేషము తానెటు లందనేర్చెనో. ౫౮

మ॥ గజముం దానొక చిన్నపత్రిపుటముం గల్పించి చూపించు రీ
తి జగమ్ముం బ్రతిజీవివృత్తమునఁ జిత్రించెం జగత్కర్త పై
నిజధర్మమ్ముల నేర్పరించి తెలిపె న్వీక్షించియు న్నిత్య మీ
నిజముం గానరు మూఢులింతయుఁ బురానిర్ణిద్రబంధమ్మునన్. ౫౯

ఉ॥ ఈ వనిలోననున్న ప్రతివృక్షము పోలిక నీజగమ్మునన్
జీవనమున్ సుఖమ్ముగను జేయుదురే ప్రజ లెల్లవారు కొ
దీవనమందునుంగల వివే యొకకొన్ని యభాగ్యవృక్షముల్
పూవులు పండ్లులేక యుడివోయిన ప్రాయము హెచ్చరించుచున్.

మ॥ అనుచుం బెక్కుగ నూహసేయు నెడఁ బ్రత్యక్షమ్ముగాఁ దోఁచె నా
వనమెల్లన్ శివరూపమై యతనికిన్ భావింప నిక్కమ్ముగాఁ
గనుపట్టన్ బ్రతివస్తువందును జగత్కళ్యాణముం గౌరవం
బును స్వీయస్థితియున్ యథార్థగతులన్ బూతాత్ములౌ వారికిన్.

మ॥ అతఁ డాభావపరంపరాశబలితస్వాంతస్థితిం గొంత సే
పితరుండోయననుండి నెచ్చెలులవై వీక్షించి యల్లంత చూ
చితి రే మొన్నటిపారమందుఁగల వైచిత్రిం దపోభూమి వ
ర్ణిత మానాటకమందుఁ జూడఁడిది దానింబోలునో పోలదో॥ ౬౨

చం॥ ఆది సహజమ్ము రమ్యతర మాశ్రమసీమ శకుంతలాప్రియం
వద లనసూయ పెంచిన తపస్వుల పెంపుడుబిడ్డ యౌవనిన్
జదివిన కన్నులంగన నసారము కృతిప్రియమౌచుఁ దోఁచు నీ
పొదలిన వృక్షమై నెఱయఁ జూచిన యీయెలదోఁట బుద్ధికిన్. ౬౩

ఉ॥ పల్లెకు బస్తికిం గలుగు భావవిభేదము చూడ నిందునుం
దెల్లము పల్లెటూరి ప్రజ నిక్కను డెక్కునెఱుంగ దింతగాఁ
గల్లరి మేనిసొంపు నొడికారపునొక్కులు టక్కుటెక్కులున్
బెల్లగు బస్తివారి నెఱపీతము లీ యెలదోఁట తీయముల్. ౬౪

ఉ॥ చూపులకుబ్బమై మనసు చూచిన వేళన యోగి వింతగన్
రేపి వికార మచ్చ్యుదియు నిక్కపుఁ జక్కఁదనంబు దీవిగాఁ
జూపెడు తీయనైన విపసుందరవస్తువుపోల్కి దీనిపైఁ
జూపరు పేర్మి తాత్త్వికులు చూపిన చూపరు నిల్వనేర్తురే. ౬౫

ఉ॥ మొత్తని లేఁజివుళ్ల మిసిమిం బరికించిన యొక్కతీరు కొం
గ్రొత్తలు మాయు నీముదిచిగుళ్ల వికాస మదొక్కతీరునై
క్రొత్తయుఁ బ్రాఁతయౌచుఁ బ్రజకుం గనువిందులు సేయుతోఁటమీ
చిత్తములం దొకింత పరిశీలనచేసి తలంచి చూడుఁడీ. ౬౬

గీ॥ చూడఁ జూడఁగఁ బ్రత్యేకసుందరమ్ము
నయ్యు నంతయు వింతసోయగము నెఱపు
ఖండసౌందర్యమెఱిఁగి యఖండమైన
దానిసౌందర్యమెఱుఁగుట జ్ఞానిగుణము. ౬౭

ఆ॥ చివురు మెత్తదనము సింగారములు చూపు,
పూవు వింతవింతతావు లీను
ఫలము రుచులొసంగుఁ గొలుగ దిందొకటియు,
వృక్షమూలమైన బీజమునకు. ౬౮

గీ॥ పూలుకలిగియు ఫలములఁ బొంద దొకటి
= పూలు లేకయు ఫలములఁ బొదలు నొకటి

వ్యర్థమైనట్టి భాగమిం దణువుగాని
కానిపింపదు కనువానిఁ గనముగాక.

మ॥ మతముల్ భిన్నము లిట్టులాంతరము సంబంధం బభిన్నంబె, యీ
మతసిద్ధాంత మశేషలోకమునకు న్మాంగళ్య మందిచ్చు టీ
ఋతము న్గానక గ్రుడ్డివండ్రు గజము న్వీక్షించి వాదాడు నా
కతన్ లక్ష్యములౌదు రీ జగతిలో గర్వాంధులై పండితుల్. ౨౦

కం॥ కాదనె నౌననె విశ్వము వేదము శివరూపమును వివేకింపఁగఁ దాఁ
గాదనిన నింతమాత్రమె కాదని సర్వంబువనుట కాదె యగుననన్.

గీ॥ గంగడోలున్న దావసఁ గాంచునొక్కఁ
డద్దిలేనిది యావు కాదని దెలియు
నొక్కఁడు క్త్రిపై చిత్రిగా కొఱసిచూడ,
బలుకఁబడినది వేఱుగాఁ గలదె యొకటి. ౨౨

గీ॥ నీడపోలిక నిగమమ్ము జాడ నడచె
స్మృతులు కత లల్లి యాయర్థ మెఱుకపఱచె
మహిఁ బురాణమ్ము లయ్యవి బహువిరుద్ధ
గాథలందురు తెలియని కారణమున. ౨౩

శా॥ ఘోషించు న్వియదంతరాళమున వాక్కు ల్విశ్వసత్యార్థ మా
భావల్ దుష్కరసత్తపఃఫలములై ప్రత్యక్షమై మ్రోసె, ని
శ్శేషక్రోధ ఋషీంద్ర చిత్తగుహలన్ సిద్ధార్థులవ్వార లా
భాషార్థమ్ము లుపన్యసించి రట శబ్దబ్రహ్మనిత్యత్వముల్. ౨౪

వ॥ కావున వేదమ్ము లపౌరుషేయమ్ము లనంతమ్ములు నిత్యమ్ములనం
బరఁగె. మరియుం బురుషుండన పరమాత్మయగు సర్వశక్తి
సంపన్నుడగు నతని వలన వెలువడిన యీశబ్దబ్రహ్మమ్ములు
పౌరుషేయమయిన నగుం గాక. ఒండు రీతి నాడఁదగునే యది
యుంగాక

గీ॥ ఇట్టి వేదమ్ములన్నియు నేకమగుచు
శివకరమ్మంచు దేనిఁజర్చించి పలికె

నదియె ధర నద్వైతశైవమహామతమ్ము
నిఖిలజనబంధమోక్షణ నిపుణతరము. ౭౮

కం॥ సహజమ్మగు భావమ్మును బహుశ్రుతులుధర్మమనిరి పరిపాటిమెయిన్
మహి ధర్మవిరుద్ధమ్మన సహజవిరుద్ధమ్మె యనుట చర్చింపంగన్.

కం॥ కావున సత్యము ధర్మము భావింపగ నొక్కరూపబహువిధములుగా
గావించు సమన్వయముల త్రోవలెబహుమతములై నిరూపింపబడెన్.

గీ॥ కారణము లేని కార్యమ్ము గలుగకుంట
గర్తయొక్కఁడు గలఁడీజగమ్మునకును
కారణము వోలె నాతఁ డాకారరహితుఁ
డగుటచే భిన్ననామంబు లతనికయ్యె. ౭౯

గీ॥ కారణము లోనిగుణములు కార్యమందు
గలుగుగావున గలఁ డీ జగాన నతఁడు
కారణము నందె కార్యమ్ము కలసియుంట
విశ్వ మా విశ్వవిభులోన వెలసియుండు. ౮౦

గీ॥ సర్వవిద్యల కాతఁ డీశానుఁడనియు
సర్వభూతాళి కాతఁ డీశ్వరుఁడు ననియు
బ్రహ్మ బ్రహ్మంబు బ్రహ్మాధిపతి శివుండు,
సనుచు వచియించె నిగమమ్ము లతనిమహిమ. ౮౧

కం॥ కారణకార్యమ్ముల నిల నారసి భేదమ్ముకనమి యద్వైతము త
త్సారమ్ముగొనుచు భేదము నారయుట విశిష్టమైన నద్వైతమగున్.

గీ॥ అన్నివిధములఁ దనయట్లు యగునుగాక
కాని ప్రతిబింబమునకును గలదె శక్తి
తాను స్వయముగఁ జరియింపఁగాన జగతి
కలదు జీవేశ్వరుల భేదగరిమ యటుల. ౮౩

గీ॥ ఉదయవేళల బ్రహ్మతో నుపమ నొఱసి
నడుమ హరివోలెఁ బరిపాలనము నొనర్చి

యస్తమయమున రౌద్రరమ్యాంగుఁడగుచు
బగలుహరియించువాఁడౌ విభాకరుండు. ౮౪

మ॥ అని యాశంకరుఁడాడుమాటలు సహాధ్యాయుల్ నితాంతాదర
మ్మున వించుం దము దారెఱుంగరు కళాపూర్ణుండుసూర్యుండటన్
గనుపట్టం దొలిదిక్కునం బడమటం గాశేకశంకశ్రవో
మణిభూషాకృతిఁ దద్రుచుల్ నెఱసె సంధ్యారాగరమ్యంబులై. ౮౫

కం॥ కని శంకరుఁ డొట్టెదుటన్ దినాంతరమణీయతపనదీధితులను బం
డిన యవ్వని నటదీశ్వరకపదరుణజటాటవీ ప్రకారాకారన్. ౮౬

సీ॥ కాలకంధర శిరఃకల్యాణకుసుమంబు
చిందిన మధువులై చెదరె నిందు
నీలలోహితజటా నిర్మలారుణకాంతి
వెలివీడువిరిసె నీ కెలకునందు:
గాలకాలుని పావ గండపెండారంబు
తళుకుబొత్తము శిటఁ గొలువచ్చె
నృత్యావసాన గౌరీశ్వరాన్యోన్యవీ
క్షణరోచు లిచ్చోట గ్రందుకొనియె. ౮౭

గీ॥ మిత్రుపోకను గువలయమిత్రురాక,
నొడవు ఖేదమ్ము మోదమ్ము నొఱసె ననఁగ
గష్టసుఖముల సమరీతి కానిపింప
సాంధ్యరాగమ్ము నల్గడఁ జదల నిండె. ౮౭

గీ॥ పగలు శిరసాభజించి తాపమ్ము నెల్ల
బడలికలుదీర్చుఁ దననీడ కడుపుచలువ
రేయి వెన్నెలఁ దలయెత్తి హాయిగూర్చు
వాసనలు చిమ్ము నీవని పాటిగలదె. ౮౮

మ॥ ఉదయించున్ రవి యస్తమించు నిటు లెన్నో సంజ లీనాఁటికిన్
దుదముట్టెం బ్రతిసంధ్య క్రొత్తయగుచుండోఁచున్ జనం బీతుదన్

మొదటంజూచియెఱుంగనేర దకటా పుణ్యాత్మకర్తవ్యమున్
బదిల మ్మెమ్మెయెడనుండు నేమిది మహోపాతమ్మునన్ దీపమై ౮౯

శా॥ దీపమ్మారసఁగఁ జక్క దిద్దికొనుమీ దేహమ్ము గేహమ్ము నీ
వాపైనన్ దురపిల్లుటల్ వృథలు నిర్వ్యాజాంబుసేతుక్రియల్
'పాపీ జీవతి శాశ్వతం న సుకృతీ వర్ధస్వ పుణ్యైర్నభో
దీపాకార' యటన్నఁ బ్రానుదుల బుద్ధిన్నిల్పి సేయందగున్. ౯౦

శా॥ పుణ్యమ్మైన యశశ్శరీరమున జూపున్నిల్పి తత్సిద్ధికై
పణ్యాగారముబోని యీమొదలు దీపమ్మట్లు వెల్గింపఁగాఁ
బుణ్యాత్ముండెవఁడో యొకండె యెఱుగున్ మూర్ఖుండెటుల్నేర్చునై
పుణ్యమ్మయ్యదపుణ్యదుర్లభ మహాంభోమధ్యమాణిక్యమున్.

శా॥ ఆకాశమ్మునఁ జుక్కలుంబలె నసంఖ్యాకుల్ విభిన్నాకృతుల్
లోకుల్ భిన్నగుణుల్ మిథస్స్థితిధురాలోలుర్ స్వయంవ్యక్తులున్
గాకేమున్నది యెంచిచూడ విపులాకాశమ్మునన్ భేద మే
రాకానాథుఁడో లోకబాంధవుఁడో విభ్రాజిల్లఁగా కొక్కఁడన్.

మ॥ అను నా శంకరుదృష్టి కాకసమునం దాచిన్ని చుక్కల్, మహే
శునకర్పించిన తుమ్మిపూవులగుచుం జూపట్టె, నా వ్యోమకే
శుని సంధ్యారమణీయపాటల జటాస్ఫూర్జన్మరుత్ప్రోధుకం
కణముల్ దోఁచెను జుక్కలొక్కొకయెడన్ గంధాక్షతాకారముల్.

ఉ॥ ఆ తలపోత లాత్మగురు నప్పటివేళ శివార్చనమ్ములై
చేతము త్రొట్టిలంగ నడిచేసితి నాసమయమ్ము జాఁగఁగాఁ
జూతురు నాదురాశకుఁ బ్రసూనసమర్పణవేళ మద్గురుల్
చేతములెల్లఁ జూపులయి చెన్నటినై ఋట నాలసించితిన్. ౯౪

మ॥ అనుచున్ దిగ్గనలేచి నేఁడు కడుప్రొద్దయ్యెన్ గృహమ్మందునే
మనుచుం జూచెదరో గురుల్ వడిగ రండంచున్ సఖుల్ గూడిరా
వనము న్వీడి గృహమ్ము చేరె నతఁడవ్వారెల్ల రానందమున్
వినయమ్మద్భుతమున్ బెనంగ నతని న్వీడ్కొంచు నన్యోన్యమున్.

చం|| చదువుటలేదె యుండఱము శంకరుతోసరిగాఁగ, దేని కా
చదువుట వానిలోఁగల సారము నిమ్మెయిఁజెప్పనేర్తు మే
మదుగురలోఁగాదు నొకవందకు వేయికి నొక్కఁడైన నీ
చదురులు నేరఁజాలునె యశస్విలమైతిమి వీని మిత్రితన్. ౯౬

కం|| ఎక్కడిచదువులుచదివినఁ దక్కునె జ్ఞానమ్ము పూర్వతనుకృతసుకృత
మ్మొక్కటఫలింపకుండిన నక్కటమతి చెఱుపుగాక సార్థకమగునే

కం|| పలువిధములనిటుతలచుచుఁ దలిదండ్రులయొద్ద నద్భుతమ్ముగ వారల్
పలికిరవిగురులవీనుల నొలికినయమృతమ్ముపోలె నొసఁగెసుఖమ్మున్.

మ|| చనియెన్ శంకరుఁడింటి కంత శివపూజాపుష్పములున్నవి ని
ల్చిన పుత్రుంగని సంతసించిరిగురుల్ శ్రీమంత్రమూర్తీశ్వరుం
డానరించెం గొమరుండుదెచ్చిన సుమమ్మొక్కొక్కటంబూజ మె
చ్చిన యట్లయ్యెఁదదీశ్వరార్చనము రాశీభూతపుణ్యాకృతిన్.

ఉ|| శంకరసంయమీంద్ర వరజన్మఁబ శంకరుఁడోయితండ్రి, నీ
లెంక భవత్కటాక్షసఫలీకృత జన్మునిఁజేయువాని, నా
కింక నొకంబు వేఁ గలదే పరమేశ్వర యంచుఁ బూజలన్
శంకరుతండ్రిదన్పె, దివిషన్మతిభృంగము నిష్టలింగమున్ ౧౦౦

కం|| మఱునాఁటిప్రొద్దు వారల కెఱుకపడెఁగొమారు వార్తయెల్ల సఖిజనుల్
పఱతెంచిచెప్పమేనుల, గఱుపాటొదవంగ వినిరిగాఢప్రీతిన్. ౧౦౧

ఉ|| ఎంతటి పుత్రుఁగంటి వది యెంతటి పుణ్యము చేసినాఁడవో
సంతరియించె మీకొలము శంకరుఁడన్నగ శంకరుండె యం
చింతలు నంతగాఁబలికి రిష్టులు పక్కన పలు  లంతఁగోఁ
గొంతయె నిక్కమంచెటిఁగెఁ గోవిదుఁడౌనల మంత్రమూర్తియున్.

ఉ|| అంతటఁ గొంత కాలమున కాత్మవిదుండగు మంత్రమూర్తి యే
కాంతమునందుఁ బుత్రుఁగని యాడె సధర్మిణి విన్చుచుండ నా
వంతు భవ ప్రవాస మిది పారముముట్టెను నేఁటితోడ నా
వంత కలంకలేక వినవయ్య కుమార ముముక్షు మార్గమున్. ౧౦౩

చం॥ ఎఱుఁగుదు వెల్లధర్మముల నెందును నీదగు వర్తనంబునన్
గొఱతఁ ఘటిల్లఁ దారయు నఖండితవృత్తిని బ్రహ్మచర్యమున్
నెఱపుట నుత్తమంబెయగు నిక్కపు గేస్తున కెంచి చూడఁగా
నఱవని యగామెతల్గడమయాశ్రమము ల్బహుళాంతరాయముల్.

చం॥ తనదగుజీవిత మ్మొక యుదాహరణమ్మయి మించ సత్కళా
ధనమును బ్రోగుచేసికొనఁదగ్గదికాలము బ్రహ్మచర్య మా
ధనమును వమ్ముసేయక సదాశివచింతన వెళ్లఁబుచ్చ నే
ర్చిన మనుజుండె చూ డమృతజీవియు ధన్యుఁడు ముక్తుడున్ సుతా.

ఉ॥ తక్కిన యాశ్రమమ్ములకుఁ దావలమైన గృహస్థ ధర్మమున్
జక్కఁగ నిర్వహించుకొనఁ జాలిన గేస్తునితోడఁ బాటిగా
నొక్కఁడు గల్గఁ డూరకయ యొక్కటి చేయగ నేర కెన్నియో
చిక్కులు దెచ్చికొందు రవశీకృత బుద్ధులు కర్మబద్ధులై. ౧౦౬

చం॥ తగులము పో నడంచి తన ధర్మము చక్కఁగ నిర్వహించుచున్
వగపును సంతసమ్ము నొకపాటిగఁ జూచుచుఁ బ్రాణిహింసకున్
దెగని నరుండు ముక్తుఁడను ధీగుల పల్కుల నాచరించుచో
సుగతులు పుణ్యలోకములు చూఱలుగావె కుమార యారయన్.

చం॥ మనమున నున్న శత్రులను మార్కొన లేక వనాంతరములన్
దినములుగాఁ గృశించిన యతిత్వము చూపెడు వేషభాషలన్
దనరినముక్తుఁడౌ నె శరణమ్మని లోగుటయుం బ్రభుత్వ మా
మనము జయింపఁ జాలుట సమస్తము నేలుటగా నెఱుంగుమా.

చం॥ కలిగిన దానఁ దృప్తిపడఁ గల్గిన వానికి సార్వభౌముడున్
దులయగునే విశుద్ధమతితో పరిపత్తురె వేషభాషలన్
మెలఁగెడు గంగిరెద్దులు మనీషికిఁ గల్గునె పక్షపాతముల్
గలిఁగినఁ బక్షివాచ్యుఁడగుఁగాని యతం డొక పండితుండునే.

మ॥ నివుఱుంగప్పిన నిప్పుగా మెలఁగుమీ నీవెప్పుడుం దండ్రి ! నీ
కెవరున్ శత్రులుగల్గ రగ్గమగుచో నింతింతలై పోయి దు

ర్వ్యవసాయమ్ములు భస్మమై మగుడ నీ యండం బ్రవర్ధిల్లుచే
యవు నెవ్వారికి నిక్కమా నలుక చేయంబోకు మెవ్వారిపై. ౧౧౦

ఉ॥ ఒక్కటిలేదు చింత గల దొక్కటి వెక్కటి యున్నదానమే
నిక్కడఁ జేయ నేర స్మరియింపుము నీ పినతండ్రి ముచ్చటల్
దిక్కును మొక్కు లేని యతి దీనుల పొట్టలు చల్లగాఁగ నీ
వెక్కటి నిర్వహింతు వది యెల్లనటంచును విశ్వసించెదన్. ౧౧౧

కం॥ అనుచుం గేహిని గనుఁగొని, వినుచుంటివి గాదె యెల్లవిధులన్ వీనిన్
గనుఁగొను మీయానతి యిచ్చినవాడిదె నేఁడు పరమశివుఁడు కరుణతో.

మ॥ శివలోకమ్మున కేగువేళ వినవచ్చెం జూడు మాహేశ్వర
శ్రవణీయేశ్వర మంగళస్తుతికథాసంగీతసారస్యబాం
ధవముల్ శాశ్వరకంఠహారమణిఘంటామంజునిక్వాణముల్
సవిధమ్మందున నిల్చినారు ప్రమథస్వాముల్ నతోత్తంసులై.

మ॥ అదిగో శుద్ధసువర్ణవిగ్రహముచాతున్ నీలనీలమ్ములై,
యొదిగె న్మాజగదేకమాత తనులీలోదారకాంతిచ్ఛటల్
పదమంచు న్వినసయ్యె నీ ప్రమథసల్లాపంబు లాలోచనా
మృదుహాసాననసుందరుండు శివుఁడే యేతెంచె నిచ్చోటికిన్. ౧౧౪

మ॥ అనుచున్ దిగ్గన లేచి మ్రొక్కుచును నీహారాంశుకోటీర స
జ్జనమందార యఘప్రహార హర విశ్వక్షేమసంభార యీ
చెనటిం బ్రోవఁగ నింతదవ్వులకు విచ్చేయంగ నయ్యెంగదే
నను మన్నింపు మనాథనాథ యనుచున్ బ్రార్థించి కన్మోడ్చినన్.

మ॥ ఒక తేజ మ్మట బ్రహ్మరంధ్రమున నిష్క్రాంతమ్మ మిన్నందె నా
వికలస్వాంతులు దల్లియుం గొడుకులే వేపట్టి రవ్వానిఁ దూ
లక యండం గడెలోన నిట్లతఁడు కైలాసమ్ము వేంచేయ వా
ర్త కలంచెం బురమెల్ల నద్భుతవిషాదమ్ముల్ ప్రవర్తిల్లఁగన్. ౧౧౬

కం॥ దొరకొని యె ననాయాసము
మరణము దైన్యమ్ము లేని మనుగడ పుడమిన్

దొరయొవరు మంత్రమూర్తికి
బరమశివుం డతఁడు పుణ్యభావముఁ గలిమిన్. ౧౧౭

మ॥ అనుచున్ సంస్తుతియించి యాపయిని గార్యశ్రేణి శాస్త్రోక్తి నా
య్యనఁ జేయించిరి పెండ్లివోలె నది మృష్టాన్నప్రదానమ్ములన్
గనుపట్టెన్ స్థిరుఁడయ్యె దా గురువియోగక్లేశభారమ్మునన్
మునుకల్ వెట్టుచు శంకరుండు గడపెన్ గ్రూరమ్ము కాలస్థితిన్.

గీ॥ వృత్తవృత్తమ్మనను మాధవీవసంత,
మధురమంగళగీతికావిధురకోకి
లాంగనాలాపములు విన్నైన సుభగ
కాల మేతెంచె భూదేవి పూలతొడుగు. ౧౧౯

ఉ॥ పూచిన వేపలందు గడివోవక చిమ్మిన కమ్మతెమ్మెరల్
తోఁచెను నూతనాగతవధూపరిరంభణవాసితమ్ములై
యా చిగురుల్ తదీయతరళాంగుళులయ్యె వనప్రియాంగనా
వాచనముల్ నవప్రణయభాషలునై వినిపించె నయ్యెడన్. ౧౨౦

ఉ॥ ఓయి రసాల నీమృదువులొ లెక్కడె యాంతరవృత్తి యింతకున్
వేయిముడుంగులై మధువునించిన పూవుల తావిగాఁగనై
సేయు వసంతలక్ష్మి పని చేసినదీవనవోలెఁ గోకిలల్
హాయిగఁ బాడె లేఁజివురు లానిన కంఠములూఁది యొయ్యనన్.

ఉ॥ వేకువలన్ శుభమ్ము వినిపించెను మెల్లని చల్లగాలి లేఁ
బోకల గూడిమాడి మధువుల్ దెరలించిన గొంతులెత్తుచున్
గోకిలముల్ తదీయమృదుకోమలక రవం వంతపాటగాఁ
గూకువురించె బావురము, కుక్కుటరుత్యయనె తామ్రచూడముల్.

ఉ॥ వచ్చెను శంకరుండు గురువర్యగృహమ్మున విద్య నేర్చుచో
సచ్చరితుం డతం డొకఁడు శంకరునొద్దికరూపమున్ గుణం
బొచ్చెములేనివృత్తియు సమజ్జ్వలమేఘగభీరకంఠమున్
మెచ్చి యితండె యల్లుఁడగు మే లది యెంతటివారికబ్బునో. ౧౨౩

కం॥ అంతటియదృష్టమును నాయింతటి సుకుమారుగనిన దేతల్లి యీయా
చింతనుగాఁ కల్లుఁడుగాఁ బంతముడిగి యామె యిష్టపడునో లేదో.

ఉ॥ నా సుత కన్నులంగనిననాఁడును గోడలుగా గ్రహింపఁగా
నేసతి యీయకోదయిన నింతకు నెవ్వని గోరికోరి యా
సాసల నింతదవ్వుల ప్రయాసపుఁబాటుల కోర్చినాఁడనో
యా సుకుమారశంకరుఁడె యానె యితం డటుగాక యొక్కఁడో.

కం॥ అనుచుం బరిపరివిధముల
మనమున దినమకలుపడుచు మాని యతడు న
య్యనఘుఁడు లింగయదేశికు
ననియెం జదువరులు వీడునంతకు దిరమై. ౧౨౬

మ॥ ఎవ రీబాలుఁడు మంత్రమూర్తిసుతుఁడే యే వీవి నల్లుండుగాఁ
గ వరింపం జనుదెంచితీవ్ గురుఁడవై కార్యంబు సాధించిపె
ట్టవె యుఁకన్నగి లింగశాస్త్రి కడు నిష్టమ్మెద్ది నాబుద్ధికిన్
దవు వియ్యంకుఁడ వీవు నిన్నెఱుఁగనే దాఁపంగ నేలా యిటన్.

కం॥ పోచుఁ శ్రీశైలమునకుఁ
జూచితి మీయింటవిడియుచో మీకొమిరెన్
నాచిత్తమ్మున శంకరు
డాచూపులలోనఁ దవిలె ననుగుణుఁ డంచున్. ౧౨౮

ఉ॥ ఇంతకు నీదురాక ఘటియించుశుభ మ్మిక వేయునేల నా
యుంతనమై శంకరుగృహమ్మున కేగుద మప్పు డెల్లప్రొ
త్తాంతిము చక్కనౌననుచు నప్పటికృత్యము లాచరించి వా
రంతట జల్లగాలి శుభమైపఱతెంచిన ప్రొద్దువాలికన్. ౧౨౯

కం॥ శంకరుగృహమున కేగిన
శంకరుఁ డా గురుని జరుని సముచితపూజా
లంకృతులఁ జేసి గురు లీవంకకు
దయసేత తెలియవచ్చునె యనినన్. ౧౩౦

ఉ॥ అమ్మను జూచిపోవలయు నంచును గుంటుపపాటియగ్రహా
రమ్మున వారు బంధులు తిరమ్ముగు బ్రేమను వచ్చిరన్న వా
డిమ్ములనేగి యావిషయమెల్లను దల్లికి విన్నవింప జే
జెమ్మయు గ్రోత్రయానమను చిక్కవెలార్చుచు వచ్చినిల్చినన్.

కం॥ అమ్మా శివపురవంశ్యం
డిమ్మహితుఁడు కోటిలింగ మిష్టుఁడు నాకున్
మిమ్ముఁ గనవచ్చె మీ వి
య్యమ్మందగ గోర్కెగలిగి యాతఁడుగాఁగన్ ౧౩౨

కం॥ కలవాఁడు సంప్రదాయము
కలవాఁడును బాంధవమ్ము కలవాఁడు సుతుల్
గలవాఁడు మనకు వారికి
గలవును వియ్యములు చెప్పఁగా నేమిటికిన్. ౧౩౩

కం॥ వినియుండు వీవు సీతని పెనుపును మామంత్రమూర్తి వీడును నేనున్
జిననాఁటిమిత్రులము నీయనతో వియ్యమ్మునందు టతిహితముసుమీ.

మ॥ అనిన స్మీర లెరుంగనట్టి దిట లేదైనం బురాచారముల్
మనమం దెన్నరు నేఁటివా రెపుడు మీ మాటన్న వేదమ్ము నా
యనకు న్నెనయి చెప్పఁగాఁగలది లే దాపైనిఁ గార్యమ్ము చ
క్కనచేయంగలవారు మీర లెకదా కానిండు ముమ్మాటికిన్. ౧౩౪

మ॥ ధనధాన్యమ్ములమాట నెంచక యె విద్యాగంధముంబట్టి వ
చ్చినవారిం బెఱమాటలాడుటకు నాచిత్తంబు మైకోదు వా
రనుమానింపక యీదరిద్రులకె కన్యారత్న మర్పించుచో
నన నేమున్నది వారికే తెలియుఁగా కౌదార్యగాంభీర్యముల్.

మ॥ అనినం బల్కెను గోటిలింగ మగు నమ్మానిక్క మీమాటకున్
మనసున్ నచ్చిన దే నెఱుంగనె గటా మామంత్రమూర్తిం దపః
ఖని విద్వత్కవిసార్వభౌమపదరేఖాముద్రు మాభద్రునిన్
వినుమా నీకొమరుండు నల్లుఁడగుటే వేవేలు మాయింటికిన్. ౧౩౭

కం॥ కలదింత యనుచుఁ జేసిన
నిలుచునె భాగ్యములు విడువ నిర్ధనుఁడనుచున్
గలవాఁడుగాఁడె యెవ్వరి
లలాటలిఖితంబుగన వలంతులె యెవరున్. ౧౩౮

ఉ॥ ఇంటికి బిల్లనిత్తునని యేనయి వచ్చుటగొప్పచేసి యీ
కొంటివి తల్లి నీదయిన గొప్పతనమ్మును వింటిఁ జూడఁగాఁ
గంటిని నేఁడు మాపురము కన్నియఁజూడఁగ రాఁగదమ్మ యీ
వెంటనె పెండ్లిమూర్తమును బెట్టఁగవచ్చును బెద్దలౌనన్.౧౩౯

క॥ నావిని జేజెమ చూడంగావలయునె గుఱుఁడుచూచెగాదే కన్యన్
లే పీయాచారమ్ములు మా వంగడమందు వేఱుమాటలు లేఁకేలా.

చం॥ అనవిని యెజ్జ శ్రీగిరికి యాత్రకుఁబోవుచు వీరియింట నే
మును బసచేయఁ బార్వతియె ముందయి సేవలఁదన్ని నన్ను నా
వినయము బుద్ధి శీలము వివేకము రూపము పోల్చిచూచి నీ
యనుఁగువధూటి కాదగు నటంచు మనమ్మున నిశ్చయించితిన్.

ఉ॥ ఇంతకు దైవయోగ మిది యిట్లునికిన్ దయచేసె నీతఁడం
చంతట లింగశాస్త్రియు నతానను శంకరుఁ జేరఁబిల్చి వృ
త్తాంతమునెల్ల వింటివిగదా భవదిష్టముచెప్పు నావుడున్
స్వాంతము క్రొత్తసిగ్గు తెరలై చెఱలాడఁగ నాడఁడిట్లనున్.౧౪౨

మ॥ భరమైనట్టి గృహస్థధర్మము వహింపంజాలు టూహించి శం
కరు శాసింపుఁ డటన్న నవ్వి వినుమా కళ్యాణకాలమ్ము నిన్
వరియించెం గొఱలేదు నీయెడ భవద్భావమ్ము గుర్తించితిన్
వరణీయుండవు సాహితీవిమలకన్యామూర్తి కేభంగులన్. ౧౪౩

కం॥ విను విదుషివైన గేహిని
తనరిన స్వర్గమ్ము లేదు దాంపత్యమునన్
మనసొకటియగుట ముఖ్యము
వినయమ్మది లేనిచదువు వృథయె కుమారా. ౧౪౪

చం॥ చదివిన నేమిసార్థకము సారమెఱింగి గృహస్థధర్మముల్
బదిలము చేసికో నెఱుఁగఁ బాల్పడకుండిన గేస్తురాలికిన్
జదువులసారమెల్ల సహజమ్మను రూఢముసొంటయొప్ప నీ
చదువు నెఱుంగుఁ బార్వతి యశస్విని నీ మదిలోని భావము. ౧౮౫

కం॥ నా విని మీ కెదురాడంగా, వెఱచెదఁ దండ్రి లేఖ గన నీయుని నా
దైవము గురుదక్షిణగొని, కావింపుడు పిదప నెల్ల కార్య మ్మనినన్.

ఉ॥ నవ్వి గురుండు శంకర! మనమ్మున నొక్కటి వెడ్డు పెట్టి యీ
చివ్వకుఁ జాగితే తగిన శిష్యుఁడవౌదువు కొత్తు నవ్వృత్తముల్
ద్రవ్వెద వేల రావలదు తావకభక్తి నెఱుంగనే మదిన్
నొవ్వకుమోయి నీమనము నొప్పిసహింపదు నాదు చిత్తముల్. ౧౮౭

ఉ॥ నాపయినున్న భక్తికి ఘనమ్ముగ నాపలు కాదరించు నే
నీ పొనరించు దక్షిణ మనీషుల కింతకు వి త్తమున్నదే
సైఁపవు నాదువీను లొక చక్కటి చెప్పద నాలకింపుమీ
నీపలు కేల కాదనఁగ నిర్మలబుద్ధిని నెంచి చూడుమీ. ౧౮౮

చం॥ పయిడియు వెండి లోనయిన వస్తువులే యొక సొమ్ముగాఁగ వి
ద్దియల నెఱుంగనట్టి పెనుద్రిమ్మరి నీగుకుఁ డంచుఁ జాటెదో
నయము శ్రుతమ్ము నెంచును ధనమ్మని నీ గురు నిర్ణయింతొ ని
శ్చయము మొనరించి పల్కుము వశంవదుడయ్యెద వేయు నేటికిన్.

చం॥ అనవిని కేలు మోడ్చి తగునయ్య మహాత్మక యింతపట్టు ప
ట్టిన బదులాడ కుట్టులు నుడిం బొరపాటులు గల్గకుండు నే
వినుఁ డొకమాట చెప్పెదను వేయును నేఁటి కనుగ్రహమ్మనన్
బనిగొనుఁడీ భవద్గురుత వర్ధిల నావయి నెల్లకాలమున్. ౧౯౦

కం॥ నిరతము గురుచరపూజాచరణము బస వేశ్వరుండు సలిపిన మాహే
శ్వరపూజావ్రతచరణము గురుదక్షిణగాఁగ మిమ్ముగొలువఁదలఁచితిన్

చం॥ అనవిని విస్మయమ్ముపడి యంతటివాఁడవు నౌదు వత్స! నీ
మనమున నిల్చి శంభువు సమగ్రము సేయుత నీదు పూన్కి కా

దనుటకు నెవ్వ రీశ్వరహృదంతరనిశ్చితవృత్తి నంచు దీ
వనయుఁడె నాగురుండు మునిపల్కులు ప్రోసెను జేజెమాంబలో.

చం॥ కనుఁగొనెఁ గోటిలింగ మతిగాఢమహత్తరవిస్మయమ్మునన్
ననిచినమేన నిర్ణిమిషనవ్యముదశ్రుకణార్ద్రవీక్షలన్
గనుపడి రంత వాని తెలికన్నుల కా గురుశిష్యు లిర్వు రొ
య్యన నలశంకరుండు వృషభాధిపునట్టుల భిన్నమూర్తులై. ౧౫౩

కం॥ ఇంతటి యల్లుఁడు గాహిమవంతుఁడనా నేను బిల్ల పార్వతి తపమే
యింతగ ఫలించెనని కడుసంతోషమునందె నట్టిసమయమునందున్.

కం॥ సకలమ్మును శుభమైనది
యిఁకఁ బెండ్లిప్రయత్నములకు నేలాతడయన్
ప్రకటమ్ముగ శుభలేఖల
నొకమార్గము నిశ్చయించి యొగిఁ బనుపనగున్. ౧౫౫

కం॥ అను లింగయగురుమాటలు
విని వారలు మోదపడిరి పిడ్కొని వారిన్
జని కోటిలింగ మింటికి
ననిపెను శుభలేఖ పుణ్యమగు దినమందున్. ౧౫౬

ఉ॥ అంతటఁ బెండ్లివారు శుభమైనదినమ్మునఁ గుంకుమాటి క
త్యంతముదమ్మునం జనిరి యచ్చటి వియ్యము లంతనంత వృ
త్తాంతము లాకళించుచు ప్రయాణపు టుమ్మలికన్ము సేదలన్
గొంతలు కొంతగా నెదురుకోలు నొసంగిరి పెండ్లివారికిన్. ౧౫౭

ఉ॥ వచ్చిరి చూడగా జరరపాటలగంధులు పెండ్లిపెద్దలై
నచ్చినవారిచూపులు మనమ్మున హర్షముపట్టలేక వి
ద్యుచ్చపలమ్ములయ్యె నొకయుగ్మలి పెండ్లికొమారు జూచితే
యచ్చపుశంకరుండె యనునట్లుఁ జూచె మఱొక్కయుగ్మలిన్.

ఉ॥ ఆపగరాని నాలుకయి యందలి ప్రౌఢ యొకర్తు చూడుమీ
పావడు తగ్గవాఁడె మనపార్వతికిన్ కడుముగ్ధ పీని దా

నే పరిపాటిదిద్దుకొని యేలఁగ నేర్చునో యింతరూపువాఁ
డా పసిపాపచిత్తమును నాఁడిపెట్టక యేల నేర్వఁడే. ౧౫౯

కం॥ అన గోడలకుం జెవులుండును గుసగుసమాన వెచటనుఁ బదపడ వ
చ్చినపనియైనది నిలువకు మనకటపనిలేదె యిచటమసలఁగ నేలా.

కం॥ పిలుపదిగో పెండ్లికూతురుతలయంటఁగ వలయుననుచుద్వరఁ జేసినవా
రల నల్లవెండితళుకులతలగల యొకచాన కార్యతత్పరయగుచున్.

కం॥ సుముహూర్తముడగ్గఱెనని
ప్రముఖులఁ దొందఱను బెట్టి పదపదఁడని స
క్రమముగఁ గార్యమునడపెను
సుముఖుండు పురోధనిగమ చోదితవిధులన్. ౧౬౨

గీ॥ ఎన్నిపెండ్లిండ్లు చేయించి యొంతమందిఁ
గనె వధూవరులను గాని కానఁడెందు
నిట్టిదాంపత్య మనియెంచె గట్టిముసలి
వేధసముఁడైన వాఁ డాపురోధసుండు. ౧౬౩

కం॥ అరమరికలేని కాపుర
మొరసి నరయు తలల నొప్పుచుండెడి వృద్ధుల్
చిరముగ నాదంపతులకు
వరమిడి రుడివోని సేసఁబ్రాల్తల నిడుచున్. ౧౬౪

ఉ॥ కాంచెను శంకరుండు నిజకామిని మఱి దెరవంకఁ గాంచు నా
కొంచెపుఁజూడ్కికిన్ వెఱఁగుఁగొల్పఁగ నాదలఁ బ్రాలువోయుచోఁ
గించిదుదంచితమ్ములగు క్రేవల చూపులఁ బుల్కరింతలన్
వంచినమోముఁదమ్మిగ నపాఙ్గకటాక్షదరస్మితమ్ములన్. ౧౬౫

ఉ॥ కాంచి తలంచు నాచెలిమికత్తియ నెన్నఁడొ చూచినట్లు, ప్రా
పించిన పూర్వజన్మములఁ బేర్చినవాసన నవ్వధూటికి యూ
హించును దీగవోలె నెలయించి మనమ్మును జూఱఁగొన్న యా
వంచితపంచబాణుఁ డగువానిఁ బురాభవవైభవమ్ముగా. ౧౬౬

మ॥ జరిగెం బెండిలి యైదునాళ్లును మహోత్సాహమ్మునన్ బంధు శే
షోఱుపుల్లేక చెలంగి రొక్కఁడు నసంపూర్ణాత్ముఁ డచ్చోట తే
డరయు న్వారలనెల్ల వీడుకొని కల్యాణోజ్జ్వలాంగుండు శం
కరుఁ డేతెంచెఁ బ్రహృష్టబాంధవులు కొన్కట్లెట్టఁగా నింటికిన్.

చం॥ పరిమళభారధీర్ఘమధువాసరము ల్గతియించెఁ గొన్ని తా
మరిగెను దుర్దినప్రచురమైన యహమ్ములు కొన్ని యంతటన్
శరదభిరామమంగళదినమ్ములు వచ్చిన పట్టివేళఁ గా
పురమును వచ్చెఁ బార్వతి సముజ్జ్వలశారదలక్ష్మి యో యనన్.

చం॥ ఇరువదియైదువేసఁగుల నేచిన శంకరుప్రాయ మప్పు డా
శరదభిరామ పార్వతి వశంవదవర్తన వాసికెక్క నా
యిరువురికాపురమ్ము గణియించి మనమ్ములదిద్దుకొందు రా
యిరుగులపొర్గువారనిన సేమనవచ్చును వారియున్నతుల్. ౧౬౯

సీ॥ కొడుకులలో నొక్కకొడుకయ్యెఁ బార్వతి
జేజెమాంబకుఁ దనచిత్తశుద్ధిఁ
దోడికోడండ్రకుఁ దోఁడఁబుట్టువె యయ్యె
బార్వతి తన శుచివర్తనమునఁ
గారాబుచెల్లెలై కాన్పించె బావల
మనములఁ బార్వతి వినయశీల
పార్వతి తానొక పార్వతియై తోఁచె
శంకరు నమలినస్వాంతమందుఁ

గీ॥ పార్వతీశంకరులఁ జూచువారికెల్లఁ
బార్వతీశంకరుల బాలభావ మిట్టు
లుండు ననిపించెఁ గోటికి నొక్కఁడిట్టి
కాపురముగల్గుఁ దఱచుగాఁ గలుగదెందు. ౧౭౦

గీ॥ కాపురము వచ్చి నెలయౌనో కాదొ గాని
యాపురంధ్రిని విడఁజాల దత్తగారు

ఎవ్వ రెవ్వరి కేమేమి యెప్పుడెపుడు
వలయునో వాని సమకూర్చుఁ బార్వతమ్మ. ౧౭౧

గీ॥ అరమరిక లేక యొకయింతి యలత లేక
చిన్నతనమున నెవ్వరో చెప్పినట్లు
పెద్దముత్తైదువయ్యె నా ముద్దరాలు
పెట్టుపోఁతలఁ దమయింటి చుట్టములకు. ౧౭౨

ఉ॥ ఎప్పుడువచ్చెనే నటకు నెవ్వఁడు వచ్చిన వారియింటిలోఁ
దప్పక యాగితీరు మదిఁ దాఁ దనయింట వసించునట్లుగా
నప్పటికప్పుడే వలయునట్టివి కూర్చి యొసంగు నన్న మా
యొప్పులకుప్ప పార్వతి ప్రియోక్తులఁ దా నొకయన్నపూర్ణయై.

గీ॥ ఆఱువేళలఁ జేయు శివార్చనమ్ము
నాఱుస్థలకుల నెఱిఁగిన యతులబుద్ధి
నార్వురహితుల నడఁగించి యాఱుకర్మ
ములను నడపించు శంకరుఁ డలఘువృత్తి. ౧౭౪

సీ॥ కోడికూతకు మేలుకొని మహిమ్నాదులఁ
బారాయణము సేయుఁ బరమభక్తి
వ్యాయామమొనరించి యాచరించును స్నాన
సంధ్యాద్యనుష్ఠానసముదయములను
పదపడి నిగమమ్ము పారాయణము సేయు
నరుణుండు కొండపై కరుగుదాఁక
చదువుచెప్పును శిష్యసంఘమ్ములకు నెల్ల
భావమ్ము నుడువుచు బాఁదుకొనఁగ
గీ॥ అతిథు లభ్యాగతుల వార్చి యధికభక్తి
నభవుఁ బూజించి యష్టవిధార్చనముల
మౌనముంబూని భక్తిసామ్రాజ్యమేలి
జరపు నాతఁడు నిత్యప్రసాదనియతి. ౧౭౫

ఉ॥ ఆతని శీలముల్ శ్రుతము నచ్చపుభక్తియు నాదరించి సం
ప్రీతిఁగఁ దెచ్చియిత్తురు కుబేరసమానులు భక్తివిత్త వి
ఖ్యాతులు పౌరవైశ్యులు పదార్థము లన్యహ మేసు సేసు నం
చాతఁడు వానినిచ్చును శివార్పణమంచును భక్తకోటికిన్. ౧౭౬

ఉ॥ ఇచ్చునుగాక యొక్క డదియిచ్చినమాత్రన దాచికోక తా
నెచ్చట భక్తకోటి కిటు లిచ్చుటకై మదినిచ్చగించునే
ఇచ్చుట వారికే తగియె నిచ్చినదిచ్చుట యంతకంటె మే
లిచ్చను శ్వేతకేతు విడనీఁడె యగస్త్యుఁడు రామమూర్తికిన్.

ఉ॥ విచ్చిన పుచ్చపూల మటుపించెడి వెన్నెలరేలుగాఁగ వా
రిచ్చ ద్వితీయధర్మ మొకయింపొనరించి రధర్మహాని గా
నచ్చదు వాని మెచ్చునిది నాతిసువమ్ముగ నామె మెచ్చకే
నచ్చదు వాని కామనను నచ్చుట యిట్టిదనంగవచ్చునే. ౧౭౮

ఉ॥ పండినయాకులన్ దులిచివై చెడుకాలము దాపురించె రే
యెండలు విచ్చు మంచు తెరలెత్తిచఁ జాటునమాటునొందె నా
పండినయెండదేశములవారికిఁ జల్లనికాలమైన నొ
క్కండు సహింపఁడయ్యెఁ జలికాలము దా వడకించు దాడికిన్.

ఉ॥ కాలము మార్పులందు నొదుగన్వలెఁ గాని యొకండు దాటఁగాఁ
జాలెనె సృష్టియాదిగను శంకరుతల్లియు నత్త యెట్టి వి
య్యాలొకొ పంతగించిరో మహాశివరాత్రిని రెండుజాములన్
జాలు నిహ మ్మటంచు శివసన్నిధికేగి రదెట్టిపుణ్యమో. ౧౮౦

కం॥ ఆ దుఃఖవారినిధి వా రీదిరి కడముట్ట దీర్చ నిష్టులవలనన్
ఖేదమ్ము నిడిన నిడనీ తాఁ దీర్పఁగఁ గాలమొకటి దక్షముగాదే.

కం॥ తనమాతృవియోగమ్మునకును వగచినకంటె నత్తకు న్వగచిన దా
వనజాక్షి శంకరునిమతి ననరిన దటు వారిభావపరిణతి యేమో.

సీ॥ చిన్నమామలపుణ్యచిత్రచరిత్రమ్ము
చెప్పె నీమారేడుచెట్టుక్రింద
నిచ్చోటఁ బూజించు నిచ్చలు గౌరమ్మ
నిది యెంతచిన్నవోయినది నేఁడు
మొదటఁగాఁ గాపురమ్మునకు
వచ్చినయప్డు వివరించె గృహధర్మవిధుల నిచట
మాయమ్మ మఱపించె మనసునొచ్చిన వేళ
సరసి న్నాహృదయమ్ము నౌరసియిచట

గీ॥ మాపు లిచ్చోట శయనించు మనసులోనఁ
బార్వతీశ్వరసంవాదబహుళమైన
పాట లవి యెన్నియెన్నియో పాడు నిచట
ననుచు నవి చూచిచూచి తా నలమటించు. ౧౮౩

గీ॥ మాతృ దుఃఖంబు హృదయఘస్మర మైన
దల్లిమఱపించినట్టి యత్తలకు వగచు
హృదయభారమ్ము సడలింప నెంచి రంత
వార లామాతృదైవ సంభావనమున. ౧౮౪

కం॥ అటుకొన్ని వసంతమ్ములు
కుటిలాలక కడచు నెడలఁ గోమలి తనమొ
క్కట ఫలియించినదన ప్రేంకటిసంధ్యఁ
బ్రతీచియనఁగఁ గడుఁ నింపారెన్. ౧౮౫

కం॥ వనిత పితృప్రసు వనఁగాఁ
గనెనట నొకకన్య నామకరణముచేసెన్
జనకుఁడు లింగాంబ యటం
చును బాలిక కొనలుసాగ జ్యోతిమ్మతినాన్. ౧౮౬

కం॥ బహువిధములైన వారల,
మహీయమనురాగ మ్మాసమూరికగా వా

రహములను గడపి రుత్సవ బహుళ
మ్మ్రల బంధునయునపర్వదినములన్. ౧౮౭

గీ॥ అయిదునెలలైన చిఱుతప్రాయమున బాల
యుత్త యనన్నేర్చెఁ దలిదండ్రు లాత్మలందు
నొక్కటిఁగఁదోఁచుఁ దల్లుల యొప్పిదములు
తోఁచు వెనువెంటఁ గన్నులఁ దోయశాళి. ౧౮౮

ఉ॥ ఐదువసంతము ల్గడచునంతకుఁ బార్వతి గాంచెఁ బుత్రు నా
యైదుగ్రహమ్ములన్ శుభములై యలరారఁ గుమారుఁగాంచిము
త్తైదువులెల్ల శంకరున శారయుఁ బార్వతికిం జనించె వీఁ
డాదికుమారుఁడం చనిరి యయ్యది యొప్పెను వానినామమై. ౧౮౯

కం॥ తనతండ్రి తనకు మును చే
సినవిధమున శంకరుండు చిన్నిసుతునకున్
బొనరించె విధులు ముచ్చట
లనుదిన మది యొక్కపండువయి యలరారన్. ౧౯౦

కం॥ మాతృస్తన్యముతో వా
జ్మాతృస్తన్యముల రుచులు పరికించి సభా
జైత్రుఁడనం దండ్రికి నా
పుత్రకుఁ డొనరించెఁ దనివిపోని సుఖమ్మున్. ౧౯౧

ఉ॥ చల్లని పిల్లగాడ్పుల వసంతము లిమ్మెయిఁ గొన్నిచెల్లఁగా
నల్లుఁడు బుద్ధిమంతుఁ డొకయన్వయశాలికి నిచ్చిచేసె నా
పిల్లను బెండ్లి దైవమది వేఱుగుటన్ జనఁ గొంతకాల మా
యల్లుఁడు గూతురుం దివమునందిరి గొడ్డలిపెట్టుగా మదిన్ ౧౯౨

గీ॥ సానఁబెట్టక రత్నంబు చాయగనదు
పటినూరక కత్తికిఁ బదనురాదు
క్షతములందక జోదు లెక్కకునురాఁడు
కష్టపడకుండ నరుఁ డెందు ఘనుఁడు కాఁడు. ౧౯౩

చం॥ హృదయము లోఁతుచూడఁ బరమేశ్వరుఁ వైచిన గాలమైన బె
ట్టిదము సుతావియోగము ఘటిల్లఁగ నోర్చెను శంకరుండు దా
చెదరిన గుండె గట్టిపఱచెన్ విధిచేతకు నొఁదలించి యా
చదురులు నేర్చి పార్వతి సహారి మొఱనేర్చెను వానిసంస్మృతిన్. ౧౯౪

గీ॥ చిగురుకొమ్మల హృదయమ్ము చిక్కఁబెట్టు
వయసుకాఁడైన కొడుకురూపమ్ము గాంచి
జాతిగణముల మృదులవాసనలు చిమ్ము
కన్యపెండిలిగావించెఁ గౌతుకమున. ౧౯౫

ఉ॥ అంతట శంకరుండు నిరతాన్నవితీర్ణికి నూహచేసి గ్రా
మాంతరముల్ చరించి కొనినంత ధనమ్మున నిల్పె సత్రముల్
కొంతగఁ గాలమేగ నవికుంఠితమౌచును తీర్థయాత్ర గా
వింతమటంచు గోర్కె యొదవెన్ ఘనుఁ డాతని కొక్కవేళలో.

వ॥ కోరిక యొదవుటయు తడవుగా నమ్మహాభాగుండు పరమశివపూజా
దురంధరుఁడును నిగమాగమవిశారదుండును బరమమాహేశ్వరా
చారపట్టభద్రుండు నగు ముదిగొండ లింగావధాని మున్నగా
నేబండ్రు మాహేశ్వరుల రుద్రగణంబులఁబోని వారి మున్నిడికొని
వెడలి, ౧౯౬

స్రగ్ధర॥ కావించె న్మజ్జనమ్ముల్ గగనచరధునిన్ గాంచె శ్రీవిశ్వనాథున్
సేవించె న్భక్తకోటిన్ శ్రితులను దనిపెన్ క్షేత్రముల్ పెక్కు చూచెన్
భావించె న్విశ్వమెల్లం బరమశివవపుఃప్రస్ఫుటంబంచు నంతన్
రావేడ్కల్ పుట్టు భక్తప్రవరుల మతితోఁ గ్రమ్మఱెన్ జన్మభూమిన్.

ఉ॥ వచ్చుచు శంకరుండు శివభక్తులఁ గన్గొని తీర్థయాత్రగా
వచ్చుట పుణ్యమన్న బుధవాక్యము సారమెఱింగినారె తా
నిచ్చ నెఱుంగునే మనుజుఁ డింట సుఖమ్ముగ నున్నవేళ నీ
హెచ్చులు తగ్గులుం గలుగు నీ జగతిం గల చిత్రవృత్తముల్.

చం॥ పిడికెడుబిచ్చ మెన్నఁడును బెట్టియెఱుంగని లోభియైనఁ బె
బడలిక నాకటన్ సురిగి ప్రాణము కోల్పడునట్టి వేళ నీ

కడుపున మంట చల్లఁబడఁగా ఘటియిల్లిన యాతిథేయమున్
బడసినయంత ధర్మగుణపద్ధతి కొంతయెఱుంగ నేర్చెడిన్.

చం॥ బహువనపుష్పసారముల బాఱిన పుణ్యనదీజలమ్ములన్
గ్రహణముచేసి యీవిమలగంధవహమ్ములఁ గ్రోలిక్రోలి దు
స్సహములు రోగబాధలు ప్రశాంతివహించుట యబ్బురంబె యీ
మహితములైన దృశ్యములు మానసబాధ హరింపనేరవే. ౨౦౧

గీ॥ చిత్తమున కిచ్చు శాంతి యాస్తికత దెలుపు
ఘనుఁడ ననిపించు గర్వంబుఁ గడకుఁద్రోచు
సమతబోధించు సర్వభూతములయందు
తీర్థయాత్రలు పుణ్యోపదేశకములు. ౨౦౨

గీ॥ అల్పుఁడగువాఁడు తనకంటె నల్పుఁజూచి
ఘనుఁడనువాఁడు తనకన్న ఘనునిఁజూచి
హృదయరోగమ్ము శాంతించి యెఱుఁగనేర్చు
సర్వభూతమ్ములందును సామ్యబుద్ధి. ౨౦౩

కం॥ అది ముక్తికిమార్గంబగు
నిది యెఱుఁగక తీర్థయాత్ర లేగిన ఫలముం
డదు మాటల గార్యమ్ములు
పదిలమ్ములుగావు నడపవలయును విధులన్ ౨౦౪

వ॥ మఱియు సధ్యయనవిశేషంబున ముఖస్థంబయ్యు వివిధధర్మబోధకంబు రసాత్మకంబగు సారస్వతంబు దేశాటనంబునంగాని హృదయకీలితంబు గానేందని పలువిధమ్ములఁ దత్త్వవివేచనమ్ముసలుపు నా శంకరు ప్రసంగమ్ములం బ్రశంసించుచు దను దర్శించిన తీర్థమ్ముల విశేషమ్ములం దలంచుచు నయ్యపరశంకరుని యనుగ్రహంబునం దమ కిటు ధన్యత్వంబు సమకూడెనని పొంగుచు నాశివభక్తులు శైవబ్రాహ్మణప్రభుపరిపాలితంబగు సుర్లామునగరముం బ్రవేశించిరి. అంత నప్పటి సంస్థానాధీశ్వరియగు మహాలక్ష్మీదేవి

యమ్మహేశ్వరునకు భక్తివినయసంపన్నంబులు మధురంబులు
నగు విందులనొసంగి గారవించునప్పుడు, ౨౦౪

గీ॥ ప్రమథగణములు గొలువంగ వచ్చియున్న
శంకరుఁడె యంచు భావించె శంకరయ్య
గాంచి యారాణి యారాణిఁ గాంచి యతఁడు
లక్ష్మిసాక్షాత్కరించుటలను దలంచె. ౨౦౫

సీ॥ ఒక గొప్పబిరుదయ్యె సుర్లాము పండితుం
డనుట యాలక్ష్మిచేతను దలంప
నొక మహాకృతియయ్యె సుర్లాముచరితంబు
పండితకవిజనప్రస్తుతంబు
నొక బ్రహ్మపురమయ్యె సుర్లామునగరంబు
వేదపండిత మిథోవాదములను
సుర్లాము పండితుం డొగి వచ్చెనని విన్న
నేరాజు దర్శనం బిచ్చితీరు
గీ॥ రాజులే లేరొ కోట్లకురారొ ధనము
వచ్చుఁ గాకేమి యుర్లాముప్రభులవంటి
రాజు లింతకుఁ గలుగరు రాణిలక్ష్మి
నిలిపె నాకీర్తి తన నాఁడు నిశ్చలముగ. ౨౦౬

గీ॥ లక్ష్మిపాలనమందు సుర్లామునగరి
యొక మహాతీర్థమైపోయె నుర్వి నాల్గు
కడల కవులకు బుధులకు గాయకులకు
వేదవిదులైన శ్రోత్రియవిప్రులకును. ౨౦౭

గీ॥ అన్నమిడువేళ రాణి శ్రీ యన్నపూర్ణ
ప్రజ్ఞలెసఁగెడు పట్టుల రాణి వాణి
కాన్కలిచ్చెడి యెడల నిక్కముగ లక్ష్మి,
యా మహాలక్ష్మి సరిరాణి యనఁగఁగలదె. ౨౦౮

చం॥ కవులకుఁ గామధేనువనఁగా నుతికెక్కిన లక్ష్మిఁ జూచి యా
శివగురుఁ డౌర యీపురికిఁ జేరినయప్పుడు చిల్లిగవ్వ లే
దవునిఁక నెట్లు భక్తుల ప్రమాణము లీవని నంచునెంచె నా
వివిధములైన విందులకు వేఁగెను వారికిఁ గొన్ని వేఁకువల్. ౨౧౦

కం॥ ఆవింగుల మఱఁగినవారై వారు తలంప రట ప్రమాణపువార్తల్
వేవియు విసువదును ధనాభావమ్మును శంకరుండు ప్రకటింపఁడటన్.

కం॥ జరుగ నిటు కొన్నినాళ్ళకు
నురుచిరనిజబంధుజనవియోగము కలిమిన్
మఱిఁగిన మనసుల మాహే
శ్వరులను గుర్తించె రాణి సముచితరీతిన్. ౨౧౨

ఉ॥ అంతట నొక్కనాఁ డట మహాసభ శ్రావణియంచు నయ్యె నా
ప్రాంతమునందుఁ బేరుగలపండితులుం గవులున్ రసజ్ఞు ల
త్యంతసుదూరదేశములయందులనుండియు వచ్చినారు వా
రెంత కళాభిమానులొ మఱెంతదరిద్రులొ యంతయున్నతుల్.

సీ॥ అపరనందీశ్వరుం డగు నందికేశ్వర
శాస్త్రియు సంగమేశ్వరబుధుండు
ఆంధ్రబృహస్పతి యల్ల రాయుఁడుశాస్త్రి,
హరికథాబ్రహ్మ నారాయణుంకు
ఆస్థానబుధుఁడు సీతయ్యశాస్త్రియుఁ బెక్కు
రవధానులును దీర్చి రట్టికొలువు
నందు నధ్యక్షత్వ మారాణి కోరిక
నధివసించెను శంకరయ్య యంత
ఆ॥వె॥ వివిధ నిగమగాన కవిబుధాశీర్వచః
ప్రస్తుత మంగళారంభ మగుచుఁ
గన్నువిందయి యాసభ మిన్నుముట్టఁ
బ్రతిభ మెఱసిరి నూతనాగతులు బుధులు. ౨౧౪

క॥ వేదమునఁ జె శాస్త్రమునఁ జె కాదు కవిత్వమున మధురగానక్రియలన్
వాదోపవాదముల నామోదమునిశి రట్టిబుధుల మోసల వారల్.

క॥ ఆ వివిధ బుధుల విద్యాప్రావీణ్యము లొక్కయెత్తు వారల యాయా
ప్రావీణ్యతారతమ్య విభావన మొకయెత్తుగాఁగఁ బండితులుండన్.

క॥ పక్షమ్ము లేక యాయధ్యక్షుఁడు వివరింప వార లపుడయుమూఁడా
నక్షిని డాచిన శంకరు సాక్షాత్తుగఁ గంటిమనిరి స్వాంతములందున్.

ఉ॥ ఆతఁటి శంకరుండు వినయావనతుండయి మీర లింత వి
ద్యాతిశయమ్ము వారలు మహాత్ములు నన్నొక పెద్దఁజేసి ప్ర
ఖ్యాతము సేసికొంటిరిగదయ్య యనన్యము సౌమనస్యమున్
చేతము సంతసిల్లె బుధసింహుల మిమ్మిటు కొల్వఁగాంచుటన్.

క॥ పొడవొందుకళలు మిమ్మిటఁ
బొడఁగంటిని బుణ్యవశత పూజ్యులుమీకే
ముడుగరల నీయనేర్చెద
నడిపుట్టువువాఁడ మిగుల నజ్ఞుఁడ ననుచున్. ౨౧౯

చం॥ తొడవుల నూడ్చియిచ్చె బుధతోషణతత్పరుఁ డాతఁ డంతటన్
దడఁబడకుండ రాణి తొలిదర్శనమప్పుడొసంగినట్టివిన్
మెడఁగలయట్టివిన్ బసిఁడివిగ్గులమేల్జలతారుశాలువల్
మడతలువిప్పనట్టివి తలత్తలలీను బెడంగుపుట్టముల్. ౨౨౦

చం॥ అదిగని విచ్చుకన్నుల మహాద్భుతమందుచు సభ్యులెల్లఁ దా
మిది యిది నాఁగ నేరరు మహేశ్వరి లక్ష్మియు జేచ్చవోయి యే
నిదె యిఁక నీ వదాన్య మదియెట్లుగఁ గొల్వగ నేర్తునంచు నిం
పొదవ నొసంగె వారికి బహూకృతు లాత్మనుసంతసిల్లగా. ౨౨౧

క॥ ఆసభ యిటుముగియంగా నాసభ్యులు సెలవుగొనుచు నరిగిరి భూకై
లాసం బుల్లామనుచును, వాసిగ నా శంకరయ్యఁ బాయనిమదులన్.

కం॥ ఆలక్ష్మి యంత శంకరు లీలామానుషవిలాసలేఖాంచితుఁడా
కైలాసవాసి వీవని చాలఁగ నుతియించి విడువఁజాలని మదితో.

శా॥ వేయి న్నూట పదాఱులిచ్చి ప్రియముల్ పెంపొంద నా రాణి దా
నా యా వారల వారియుండ్లకడ కొయ్యాఱంబంపె నా శంకరుం
డా యౌదార్యము నా వినీతియును నిత్యమ్మైన యాభక్తి యా
భూయస్సంచితపుణ్యరూపగుణముల్ భూషించి చిత్తమ్మునన్.

చం॥ సముచితరీతి వీడుకొని సత్రము చక్కఁగ నిర్వహింపఁగా
సముచితమైన దేశము విచారణచేయుచు నోరుగంటికిన్
క్రమముగ నేగి యయ్యెడఁ బకాపికలైన మహాంధ్రచిహ్నముల్
సమదతురుష్కదండశిథిలమ్ములఁ జూచి తలంచె నిమ్మెయిన్.

కం॥ శివకవి బుధగురుతోషక, శివపాదాంభోజమధునిషేవణ పరమా
భవతరణ పరమకారణ, శివ పంచాక్షరజపైకచిహ్నితహృదయా.

మాలిని॥ అనవరత శివధ్యానాబ్ధి వీచీవిహారా,
కనదతుల మహేంద్రాఖండభాగ్యప్రకారా,
అచితరకరణీయఖ్యాత ధర్మాభిమానా,
వినుతసుకవిభావా ! విశ్వనాథైకదేవా. ౨౨౭

శా॥ భక్తిస్థాపితవిశ్వనాథభవనప్రఖ్యాతవిద్యాలయా
యుక్తాయుక్తవిచారశూర విమలోద్యోగా శివారాధనా
సక్తస్వాంత, యుదారవర్తన త్రిధాసత్యప్రవృత్తా వరి
త్యక్తస్వార్థ నృసింహగుప్తవిభవేంద్రా విత్తవిత్తేశ్వరా. ౨౨౮

మ॥ హారితశ్రీమునిగోత్ర మల్లయకవీంద్రాదిత్యసత్పుత్ర సు
స్థిరవిద్వద్గురు రాడమోఘకరుణా శ్రీవీరనారాధ్య, వా
క్చిరపుణ్యప్రతిపాద్యమానమహిత శ్రీశంకరారాధ్య స
చ్చరితమ్మందు ద్వితీయకాండము బుధశ్లాఘ్యత్వముంగాంచుతన్.

—□—

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీశంకరారాధ్యచరిత్రము

## తృతీయ కాండము

కం॥ శ్రీశంకరపూజాగత కాశీముఖబహులపుణ్యకటకవిహారా
ఆశాజైత్రకసుయశోరాశీ నరసింగ భక్తిరంజితచరితా. ౧

వ॥ అవధరింపు మట్టు లాశంకరుండు తిరిగి యేకశిలానగరంబు ప్రవేశించి యచ్చటి శిథిలమ్ములంగని విభిన్నహృదయుండై యొక్కింత తడవు నిలచి. 2

మ॥ ఇరుమున్నూరువసంతముల్ చిలికెనా యిచ్చోట విచ్చేసి శా
పుర మున్నట్టి పురాణదైవము స్వయంభూస్వామికి న్నేటి క
చ్చుర లూరేగిన రాచబాటలఁ దురుష్కధ్వాంతఘోరధ్వనుల్
పొరయ న్గెల్చిన వాయసాయపరవమ్ముల్ వీనులింతింతగా. ౩

మ॥ శివదేవయ్య ప్రధానిగా గురుఁడుగా సింహాసనమ్మెక్కి యా
యవనిం బ్రోచిన కాకతీశ్వరుల పుణ్యస్థానమా యిద్ది యా
చవికెం బాల్కురిసోమనాథకవి తా సల్లాపమూలించె నా
శివరూపుండు ప్రతాపరుద్రధరణీజిష్ణుండు భక్తాళితో. ౪

శా॥ తానై వచ్చి మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండు వి
ద్యానీరేజభవుండు తిక్కన యోగిన్ దద్భారతామ్నాయమున్
వీనుల్విందులు తేనెసోనలిచటన్ విన్పించి వర్షించె నా
యీనాఁ డీమొగసాలచెంత వినరా వేలా కవిప్రస్తుతుల్. ౫

శా॥ ఆతిక్కన్నప్రధానశిష్యుఁడనఁగా నానాఁటి కీనాఁటికిన్
ఖ్యాతింగాంచినవాఁడు మారకవి మార్కండేయమర్పించె నా
యీ తెల్గుందొర నిండుకొల్వు కవితాహేలావిలోలస్థితిన్
బ్రాతర్మంగళపంకజాకరముగ న్నాఁగన్న సేనానికిన్. ౬

శా॥ ఆవిద్యానిధియౌ నగస్త్యునకు విద్యానాథపట్టం బిటన్
గావించెన్ బహుదేశపండితకవీంద్రప్రస్ఫుటాంగీకృతుల్
గ్రీవాకుంచనసూచితమ్ములౌ లయన్ శ్రీవీరరుద్రేశ్వరుం
డా విద్యాసతిహర్షనిర్భరకటాక్షాంగీకృతుల్ దెల్పఁగా. ౭

శా॥ సిరిమొల్లంగఁ గొల్లగొట్టుకొన నీశిల్పంబు లింతింతగాఁ
జెఱుపం జేతు లవెట్టులాడెనో గటా చిత్రమ్ములన్ జూచుచోఁ
బురుషభ్రాంతిని రోషమూఢులగుచుం బోరాడి పోరాడి యా
పరిపంథుల్ తలవాంచిపోయి రనుచున్ భావింతు నిక్కమ్ముగన్.

మ॥ అదిగో కాకతియమ్మవారిగుడియౌ నాక్రిద క్రీడాసర
స్సదిగో రాజుల రాణివాస మకటా యీచెంత దేవాలయ
మ్మదె యాస్థానపురఃప్రదేశమున స్తంభాగ్రమ్మనన్నిల్చి యీ
శిథిలమ్ముల్ గన లేక రాలఁగిన హంసీహంసయుగ్మంబగున్. ౯

మ॥ ఇది మాయాంధ్రులస్వర్గభూమి యిపుడో యీ రుద్రభూమి న్గనన్
జెడగుం గుండియ రాతిగుండె యెవఁడో నిర్భాగ్యుఁ డీశిల్పమున్
విదళించెన్ బహుశాంధ్రరక్తఝరముల్ మిన్నందె నిచ్చోట నాఁ
డిది నేఁ డాంధ్రులపుణ్యతీర్థమొసఁగు న్వీక్షింపఁ బూర్వస్మృతిన్. ౧౦

ఉ॥ ముద్దులొల్కు నీవృషభము న్గనిసంతసవాసికన్నులన్
బెద్దసిశాచ మావహిలి పెంపఱఁజేసెను రాయియైన యీ
యెద్దును జూడలేని యది యెట్టిపశుత్వమొ మానవత్వమో
యెద్దులపాటిబుద్ధిగలదేనియు నింతలు సేయ నేర్చునే. ౧౧

మ॥ శిలలందున్ బరమేశ్వరాంశము నిటుల్ చిత్రించి చూపించె నీ
కళలన్నేర్చిన శిల్పవేత్త యదియు న్గానంగలేఁడాయె నా
మలినస్వాంతుఁడు రాయి నీశ్వరునిగా మన్నించు నీజాతికిన్
దలయౌ గోవులమాంసము న్మెసవు నా దుర్జాతి యేనాఁటికిన్. ౧౨

మ॥ మది నీమాత్రము నూహసేయఁడు మతోన్మాదంబు నైపెక్కి యా
హృదయ మ్మించుకకల్గనేని చనఁడే యీశిల్పమున్ మ్రొక్క నాఁ

డది దౌర్భాగ్యము నిత్యమై నిలిచెనే యీసంపదల్ నేఁటి కా
మ్మృదుసష్టాత్మచరిత్రలే నిలిచె నీరేఖావిశారమ్ములన్. ౧౩

చ॥ కలదు నిజమ్ముగా నరయఁ గష్టమునందు సుఖమ్ముకింతగాఁ
గలదన నేల సిక్కమఁగఁ గష్టమునన్ సుఖమొక్కటే యగున్
దెలిసెను నేఁటి కీ శిథిల దృశ్యములంగని యేడ్చియేడ్చియున్
దొలఁగదు చిత్తమించుక యెదోయొకసౌఖ్యము నందుచున్నటుల్

సీ॥ ఇది రుద్రదేవుల మృదులపదస్పర్శనంటెచ యాస్థానమంటపమ్ము
అదియెవిద్యానాథునమరభారతి కాలియం దెఘుల్లనిమ్రోసినట్టితావు
ఇది రాణిరుద్రమపదము పారాణిచేఁ బరిఢవిల్లినది సౌభాగ్యభూమి
అదెకవిబ్రహ్మయీయరుణాంబుజమ్మునసీను డైయుండినటులెతోచు

గీ॥ రత్నకంబళములనమ్ము రచ్చలివియె
పూవులమ్మెడు నంగడిభూము లివియె
నంచు నూహాలు పెక్కగావించుకొంచు
నిశ్చలుండయి యటఁ గొంత నిలచియుండి. ౧౪

శా॥ ఆ వేగమ్మది పట్టలేక యిదియా యానాఁటిభాగ్యంబు మా
కీవేళన్ మిగిలెన్ మహేశ్వర దయాహీనుండ వై తేల నీ
భావ మ్మించుక యల్గిచూచు నెడలన్ భస్మమ్ముగాఁ బన్న యా
దైవద్రోహిచమూసమూహములు నీదాక్షిణ్య మిట్లయ్యెనే. ౧౫

మ॥ ఇఁక నైనం గరుణింపు మాంధ్రజనులన్ హేరాళవీతోర్యురిన్
స్వకపూర్వార్జితపుణ్యసంస్కృతులచే సాధించి యిష్టంబు తా
వకపాదమ్ముల భక్తి తొల్లిటి మహైశ్వర్యమ్ము లర్పింపఁగాఁ
బ్రకటింపంగదవయ్య నీదుమహిమన్ స్వామీ త్రిలింగేశ్వరా. ౧౬

శా॥ ఆవాసింతువు వెండికొండ నెటులో యారీతి సంతుష్టిమై
నావాసింతు మహాశ్మశానమున నీ కామెచ్చు నీతగ్గు లే
దేవెంట న్నరుఁ డట్లుతుష్టిపడునే యీమాటికర్థించెదన్
రావయ్యా దయచేసి మమ్ముమనుపన్ స్వామీ స్వయంభూవిభూ.

మ॥ మును శ్రీనాథుఁడు చూచునప్పటికి రూపున్ మాయ దింతింతగన్
వినిపించెం గవిగాన నాతఁ డదియున్ గ్రీడాభిరామమ్మునన్
నిను నేఁ జూచితి ముందుముందు దితరులు వీక్షింతురేగాక యా
కనువిందుల్ దలపింతుగాని నిజభాగ్య మ్మెవ్వ చూపింతువా. ౧౯

మ॥ అనుచున్ లేచి నిరూహచిత్తమున దా నల్లంత నిశ్శబ్దతన్
జనుచున్ దవ్వుగ నేగి యచ్చట సహస్రస్తంభసౌధంబు గాం
చెను దుఃఖించెనో సంతసించెనో మటన్ శిల్పమ్ములన్ జూచి రా
లెను నేత్రమ్ములనుండి బాష్పకణము ల్వీక్షింప వీక్షింపఁగా. ౨౦

మ॥ ఎవరీశిల్పకుఁ డెవ్వి యెన్నికళలం దెంతెంత విజ్ఞానముల్
చివురుల్వెట్టిన విందులన్ భరతమా శిల్పంబ వేదాంతమా
యవురా పేరున్ వ్రాయ డెందు నది యేమాచారమో పేరు లె
య్యవి యైనన్ ఫలమేమి కాంచు నొక వేదాన్తమ్ము పాటించెనో.

మ॥ తన కావించిన శిల్పమందుగల సౌందర్యంబులక్షించి యే
మనుజుం డెమ్మెయి బిల్వఁగాక సముఁడై మన్నించునే వీనికిన్
మన ఉద్దిష్టము కాక నాఁటికది సామాన్యంబు నేఁడైన నీ
జనముల్ మెత్తురె మెచ్చుకున్న, జెడెనా సంపత్తి యవ్వానికిన్.

ఉ॥ వస్తువుకల్గ దానిగుణవర్ణనకల్మిఁ బొసంగు నామముల్
వాస్తవ మింతలేని యతిభారపుఁ బేరుల నేమివచ్చు నీ
వస్తువువెన్క శబ్దమనుభావము స్పష్టము సేఁతగాదె యీ
యాస్తికుఁడైన శిల్పిహృదయార్థ ముకించుక యెంచిచూచినన్.

ఉ॥ తానొకఁ డుండియుం దనకుఁ దండ్రియె లేఁడను పాడుకాలమం
దేను జనించి నీమనసు నెట్టులెఱుంగుదు మీచరిత్రపై
బూనిక లేదు మీకుఁ బెఱభూములవారల యెల్లిదమ్ములన్
బూనఁగ నయ్యొ మాకు నుడిపోవని రక్తమునన్ జనియించియున్.

ఉ॥ రాయిదొలంచితో మెఱుఁగరా దిది యొట్టులు కూర్చితయ్య నీ
వేయివిధమ్ములౌ ప్రతిభ లింతకు నొక్క నిదర్శనమ్ముగా

నీ యనవద్యశిల్పమున నిల్చియుఁ బిల్చినఁ బల్క వేమి యీ
గాయములైన దేహమును గాంచి బకల్పడ వేమి నేఁటికిన్. ౨౭

స్రగ్ధర॥ ముప్వొంకన్నాఁడులింగమ్ములునడ మమహామూర్తి నందీశ్వరుండున్
నవ్వుల్ దొల్కాడు నీమంటపమును గనిన న్నాస్తికుండైనగానీ
యపొంటన్ భక్తుఁడై తా నభవ పశుపతీ యంచుఁ బ్రార్థింపకున్నే
దవ్వుల్ పాయంగఁబాపార్ద్రిములు చరితముల్ ధన్యమూర్ధన్యతాప్తిన్.

వ॥ అని విషణ్ణమానసుండగుచు నొక్కింతతడవుగ నిలిచి, యచటి
కనతి దూరమ్మునఁగల పద్మాక్షి దేవి యాలయమ్ముంగని
విచిత్రితహృదయుండగుచు బిట్టుగావగచి విశ్వేశ్వర దేశికుండు
సోమనారాధ్యుండు మున్నగు నప్పటి పరమమాహేశ్వరులం
దలంచి కలంగిన మనమ్మున

కం॥ శివదేశికుండు రా ,జిసి
నవి యూళు లొసంగెనంట యధికప్రీతిన్
శివునకు శివాలయమ్మొక
వివిధకళానిలయమగుచు విభవమ్మెసగన్. ౨౮

కం॥ ఆనాఁటి యగ్రహారము లానాఁటి శివాలయమ్ము లఖిలకళా వి
జ్ఞానాలయములుగా వారానాఁడు ప్రతిష్ఠసేసి రధికప్రౌఢిన్. ౨౯

కం॥ దానమ్మున జ్ఞానమ్మున
మానమ్మున వారు నిరుపమానులు నేఁడా
దానము జ్ఞానము మానము
గానము నిర్వీర్యమయ్యెఁగాఁ ప్రజయెల్లన్. 30

మ॥ అనుచు న్వెండియు బెక్కుగావగచి తా నాశంకరుండొక్క వె
చ్చని నిట్టూరుపు పుచ్చి యట్టిమహితుల్ సంచారముల్ చేయ మె
చ్చినయప్పట్టణమందు సత్రమునిడన్ సిద్ధాంతముంజేసి యె
ట్టని యేగానియులేనివాని కెటు దీర్పన్వచ్చు నంచెంచుచో. 3౧

శా॥ ఆ కాలమ్మున నోరుగంటిపురిలో నాకారవంశోద్భవుల్
శ్రీకల్యాణగుణాభిరాములగు నా చెన్నయ్య వెంకయ్య సు
శ్లోకుల్ సోదరులై శ్రీశైలగిరో త్రిధా శుద్ధాత్ము నాశంకరున్
బ్రాకారోజ్జ్వలదివ్యసౌధమునకున్ రప్పించి భక్త్యున్నతిన్. ౩౨

మ॥ అట మన్గట్టిన యొక్క సౌధమును సత్రార్థమ్ము నర్పించి రం
తటి సంకల్పవిశుద్ధిఁజూచి యతఁ డాధన్యాత్ముల న్మెచ్చి య
చ్చటఁ బ్రారంభ మొనర్చెఁ బాంథవికలశ్రాంతాంధపాలీమనః
పుటసమ్మోదన మన్నదానము స్వయంభూలోకసోపానమున్. ౩౩

కం॥ అక్షరలక్షలుగాఁ బం
చాక్షరము బురశ్చరణముసలిపి యతం డా
యక్షరలక్షకొనర్చెను
ద్రవ్యకౌరాధనము నన్నదానము భక్తిన్. ౩౪

వ॥ మఱియు న ప్పరమమాహేశ్వరుండు లక్షతొంబదియాఱువేల
భక్తగణార్చనమ్ము సేయు సమకట్టుటయు నా సంకల్పమ్ము నెఱింగి.

కం॥ చిఱుతొండనంబి సెట్టికిఁ
జెఱుతలు ధర్మమున నూరిసెట్టులు భక్తిన్
దఱచుగఁ గనకము గురిసిరి
పరిపూర్ణముగాఁగ నతని వ్రత మఖలమ్మున్. ౩౬

కం॥ శంకరుఁ డొకపని తనమది
సంకల్పించుటయు తడవు సాధించు నిరా
తంకుం డతనికి స్వాలకుఁ
డంకితమానసుఁడు వీరయారాధ్యుఁ డిలన్. ౩౭

కం॥ ఒకభక్తుఁ డిడియె నతనికి
నొకగృహమును దాని నాతఁ డొసరిచెఁ బ్రీతిన్
బ్రకటితముగ నొక విద్యా
నికేతనముగాఁగ ధర్మనిశ్చలబుద్ధిన్. ౩౮

క॥ శ్రుతిపరిమళిమాదిగ బహు
కృతులను రచియించె భక్తికృతుల నొనర్చెన్
బ్రతిభకు నిదర్శనములుగ
నతిశయముగ యోగవిద్య నభ్యాసించెన్ ౩౯

మ॥ ఎవ రేమిచ్చిన దాచికొంట యెఱుఁగం డేనాటి కానాఁటికే
యవు నేభక్తునకో శివార్పణముగా సర్వాని దర్శింపఁగా
నెవ రేతెంచిన శూన్యచిత్తములతో నెన్నండు పోలేదు వా
ని విశేష మ్మది యేమహాప్రభువు గానీపొందఁగానేర్చునే. ౪౦

క॥ ప్రతిసోమవాసరమ్మున
వ్రత మాతఁడుపట్టె రజతపాత్రల నొసఁగన్
క్షతిలేదు దాని కెన్నఁడు
శితవ్రతుఁడు వాని పుణ్యజీవిత మందున్. ౪౧

క॥ అతిథులు నభ్యాగతులును
బ్రతిదినమును సత్రమునకు వత్తురు వారిన్
మతి మెచ్చ నాదరింతురు
సతత మ్మా సత్రమందు శంకరు భక్తుల్. ౪౨

క॥ నయయుతమగు గౌరవమును
బ్రియవచనముతోడి యోగి వినయము గల వి
ద్యయు శంకరు హృదయమ్మున
దయవలెఁ దమయంత సహజతను భజియించెన్. ౪౩

క॥ ఒకనాఁటి శివార్చావే
ళకు మాహేశ్వరుఁ డొకం డలఘుఁ డచ్చటకున్
జకచక వచ్చియు లోఁజన
మొకమోటమిపడుచుఁ దిరిగిపోయిన వార్తన్. ౪౪

క॥ విని మఱఁగిన మనమున భో
జన మొకరీతిగ నతండు సలిపి రయమునన్

జనె నాథ భక్తుఁడు విడిసిన
యనఘుని గృహాముసకు వింతయయిన మనమునన్. ౪౫

ఉ॥ తాను భుజించు పళ్లెరము దానికిఁ దోడగు వెండిచెంబు చేఁ
బూని స్వయమ్మెగా నడిమిప్రొద్దున నేఁడకు నోర్చిపోవు న
వ్వానినిఁజూచి తా మచటిభక్తులు తొందఱ వెంబడించుచున్
బూసిరి డాయఁగా వెఱచు బుద్ధుల నింతను నంత ఛత్రముల్. ౪౬

కం॥ వారలు వెంబడివచ్చుట
యీారయఁడో కాక తెలిసి యటు చనఁగలరే
వారలు శంకరగురు మతి
నారసి "యిద మిత్థ మనఁగ నగునె యెవరికిన్. ౪౭

కం॥ చని యటుల మ్మాహేశ్వరుఁ
గని సాష్టాంగమ్ముగాఁగఁ గావించి నతిన్
వినయవిహీనుఁడ నా యీా
పొనరిచిన శివారాధను సైఁపఁగదే. ౪౮

కం॥ ఎఱిఁగియు నభ్యాగతుఁ డీ
శ్వరుఁడని నిను విడిచి భుక్తి గలిపిన దోష
మ్మొనరసిన పాపిని బ్రోవవె
చరలింగమ శంకరయ్య సైఁపఁగదయ్యా. ౪౯

శా॥ లంచమ్మంచు గణింపకీ జడుని వాలాయమ్ము మన్నింపవే
యంచుం బళ్లెము పాత్ర మాతనికి నాయ్యన్ భక్తి నర్పించినన్
వించుం గంచుసు విస్మయమ్ము పులక ల్వేట్టింప నాతండు వీ
క్షించెన్ శంకరు వానికన్నులఁదోఁచెన్ స్వామిసాక్షాత్కృతుల్.

ఉ॥ తోఁచి యతండు భక్తజనతోషణ శంకర యెంతసేసి తీ
నీచుని కోసమై యకట నిప్పులురాలెడు నెండలోన నీ
యీా చనుదెంచుటేమి యివియిచ్చుటలేమి యెఱుంగనేర నీ
కేచను దాతృతామహిమ మీాచరిత మ్మొకకావ్యమై చనున్. ౫౧

ఉ॥ దోసము లేదు నీయెడను దోసము నాయది నిన్నుఁజూడఁగాఁ
చేసినపుణ్యము య్యదడచెన్ దొలి పాములఁగన్న దోసముల్
దోసము పుచ్చుకొంట ధనలోభము పీసము లేని వానికిన్
దోసముగాదె నీమనసు నొచ్చుట నాకిట నేమి సేయుదున్. ౫౨

కం॥ వినియుంటిఁ గొంత కొంతెగ
ముని లింగవధాని చెప్ప మును గాశికిఁ బో
యిన నాఁటి నీ చరిత్రము
గనుగొంటిని నేఁడు ధన్యగణనను గంటిన్. ౫౩

చ॥ అనవిని శంకరుండు వినయ మ్మది రూపమునంది నట్టు లో
యనఘ మదీయదోష మది యాగినయట్టుల నేను గుర్తుగాఁ
గొనఁగదె యంచు వేడినఁ దగుల్వడి యాతఁడు స్వీకరించె నా
జనములు మెచ్చిచూచి రట శంకరు నాతని చిత్తశుద్ధులన్. ౫౪

చ॥ కల దొక భక్తురాలు తన కల్మికిఁదగ్గని నిండుబుద్ధితో
వెలగల పట్టువస్త్రములు వేయి వరామరికల్ ఘటిల్లఁగాఁ
జలిపినవాని వెండివియు చక్కని వౌ శివపూజపాత్రలన్
దోఁగని చిత్తవాసనలతోడ నొసంగెను శంకరయ్యకున్. ౫౫

కం॥ నవ్వుచుఁ గైకొని శంకరుఁ
డవ్వనితగృహమ్ములోని కరిగెనొ లేదో
దవ్వులఁ బాడఁగను భక్తున
కవ్వి సమర్పణముచేసె నమలినభక్తిన్. ౫౬

ఉ॥ అంతట వచ్చి యాయువిద యయ్యకు దా నిడినట్టి వస్తువుల్
చెంతలనున్న భక్తగళసీమను జూచుచు విస్మయించుచున్
గొంతగ సాహసించి యనెఁ గొంకుచు నక్కట దాసురాలిపై
నింతటి కోప మేల ధరియింపగ రాదొకొ యొక్కపూటయున్. ౫౭

ఉ॥ నా విని నవ్వి శంకరుఁడు నా కిడునంతకె నీవి వస్తువుల్
నా వయినంత నేమి యయినన్ బనియున్నదె నీకు నాడ నో

భావిని నీవు నీదయిన భక్తిని జూపితి నేను నా విధిన్
బోవమి తప్పగానియటు వోయిన దోసము కల్లనేర్చునే. ౫౮

కం॥ ఓతన్వి నీదుగురు నొక దాతను గావించు పుణ్యధనమున కరయన్
బ్రాతిమె వే ఱొక్కటి నే బ్రీతుఁడ నగుకంటె నీ కభీష్టముకలదే.

చ॥ అన విని యామెయుం దెలిసె నక్కట చిత్తము తృప్తికోసమై
జనములు పెక్కుచందముల నామికి నర్పణ లిచ్చుచుందు రా
ధనములు వానికి న్వలెనె తాఁ దనయంతనె యీశ్వరుండు ద
న్మనమునఁ దన్నుగొల్చుటకుఁ దద్దయు మెచ్చును భక్తిగొల్చుటల్.

కం॥ ఒకనా డిద్దరువై శ్యులు సకలమ్మును సిద్ధమయ్యె సామీ సుతు పెం
డ్లికి రెండునూ ర్లరూప్యము లిఁక దక్షుపయు నెడులోనని చ్చినతండుల్.

చ॥ అది యొక వేళ గవ్వయును నాతనిదగ్గఱలేదు వర్ణి యొం
డది తెలియంగ లేకతని యాచన సేసెను బెండ్లికోసమై
మది మఱుగంగజూచెఁ దన మానిని పార్వతిమోము నాత డా
హృదయమెఱింగి యొంటి తొడవెల్ల నొసంగిన దామె వానికిన్.

కం॥ పెట్టిదియొగడుసుది యా బట్టునఁ బతిజూచునంత పడతియుసొమ్ముల్
పెట్టిగ నటు లిడవలెనే కట్టనికిన్ దనకు లేరె కొడుకులు కొమ్మల్.

ఉ॥ ఆభరణమ్ము లెక్కువను నాడుది గల్గదు వింతవింతలౌ
నాభరణమ్ము లెన్నిగల వన్నియు నట్టిటు మార్చి మార్చి దా
నే భరియింపఁగాఁ గలదికెన్నఁడు పెట్టి యెఱుంగఁ డాతఁడే
యాభరణమ్ము నట్టి పతి నా సతి యెంచెనొ యొక్కసొమ్ముగా.

మ॥ ఒకనా డాతఁడు భోజనమ్మునకు నుద్యుక్తుండు కాగా క్షుధా
వికలుండన్ దయతోఁ బ్రసాదము నిటల్ బెట్టింపరే యంచు వా
నికి విన్పించెను భిక్షు కంఠ మదియు న్వించుల్ క్షుధాశాంతి నా
నికిగా నన్నము పెట్టిగాని తిన డా నిక్క ంపుభక్తుం డిటల్. ౬౫

చ॥ అతనికిజెల్లె నిట్టివి శతాధిక ములే ఘటియింపఁ బుణ్యముల్
క్షితి నొకపేరుకోసము చేసెకునారికి నెల్ల వచ్చునే

ప్రతములనిర్వహింపఁగఁ దిరమ్ముగ లు పుట్టువుతోడి భావముల్
కృతకమొ యైన ధర్మము పరీక్షితమై చెడిపోవు నొక్కటన్. ౬౬

క౦॥ మరణోన్ముఖుఁ డొక భక్తుఁడు
గురుశంకరుదర్శనమ్ముఁ గోరఁగ గురుఁ డా
దరమున వానిం గనఁగా
నరిగెడు నప్పటికె వాఁడు నరిగెఁ బరమ్మున్. ౬౭

చం॥ మరణము వేగ మిట్టిది సుమాయను నీశ్వరు హెచ్చరింతయై
త్వరగ గృహమ్ముచేరి శివభక్తుల కచ్చటనున్న వారికిన్
వరుస సువర్ణమీయ నొక భావము కల్గ నయంతలోన శం
కరుఁడు మనమ్మునం బ్రతినగా నది పుత్త్రునిఁబిల్చి యిట్లనున్ ౬౮

చం॥ నవరసు లీయఁగావలయు నాయన యిచ్చట నున్న వారికిన్
శివునకుఁ బ్రీతిగాఁగ నది చెల్లక లేదు ప్రసాదమంటుట
న్న విని యతండు నట్లని ఘనమ్ముగ యత్నము చేసిచూచె నా
శివపురవంశ్యుఁగూడ యటఁ జేకుర దెంతకు నొక్కకాసునున్. ౬౯

గీ॥ నూటయేఁబండ్రుభక్తులానాఁటివారు
నూటయేఁబదినవరసు లోటలేక
యొసఁగవలెనన్న మాటలా యున్న నేమి
యోరుగంటను నంత లున్నారొ లేరొ. ౭౦

చం॥ అనశనమూని శంకరుఁ డనన్యమనస్కుఁడు యోగనిష్ఠుఁడై
మనమునఁ నెంచె నీశునట మా చరలాన్వయశీతరశ్మి రా
మన యను నొక్కభక్తుఁ డసమానుఁడు నా శివపూజసేయుచోఁ
గనులకుఁదోఁచె నా గురునికన్నుల నీ రొకయింత కారుటల్. ౭౧

ఉ॥ తోఁచినయంత నే మిగులఁ దొట్రిలుచిత్తము చిక్కఁబట్టుచున్
లేచుచుఁ దంత్రివార్త నిడ లెంకనుఁ బంపుచు నోరుగంటికిన్
వేచె జవాబు కైకొనక విస్తరిముందఱఁ గూరుచుండియే
యా చదురుంచు వానిహృదయమ్మున నా గురుభక్తి యెట్టిదో.

గీ॥ ఆ సికిందరుబాదు రామన్న యిడిన
తంతి యోర్గల్లు చేరిన తత్క్షణంబ
బయలు పల్కిరి శంకరు ప్రతిన యెల్ల
నెట్టెటూ యంచు రామన్న సెట్టి లేచి. ౭౩

మ॥ ఇదిగో నేనయి వచ్చుచుంటి నిపుడే యీరేయి రైల్బండిలో
మది గొంక న్పనిలేదివే నవరసుల్ మాతండ్రి కర్పింప మీ
రిదియెల్ల న్వినిపించి యా గురునిచే నీపాటి కాహార దీ
క్ష దయన్ మాన్పుఁడటంచుఁ దంతిఁబనిచె న్సాధింప గుర్వర్థముల్.

కం॥ వరతంతువునకుఁ గౌత్సుకు
గురుదక్షిణ యొసగె మున్ను గురుభక్తి కలిన్
జరితకు నెక్కించిన యా
పరముడు రామన్న శ్రేష్ఠివలె నొకఁడున్నే. ౭౫

కం॥ అరుదెంచుచు నవరసు లా
గురుచరణములందుఁ బోసి గురువర యిదియున్
భరమయ్యెనె దేవర కీ
దురంతమా వ్రతము పూనుదురె యేఁ గలుగన్. ౭౬

కం॥ అక్షరలక్షల నిడు పంచాక్షరి నుపదేశ మిచ్చినట్టి గురుఁడవో
సాక్షాచ్ఛంకర నీపని లక్షింపగ మాకు నేలలక్షలు చెపుమా. ౭౭

మ॥ అనిన న్నవ్వెను శంకరుం డచటివైశ్యశ్రేష్ఠు లల్లల్ల వం
చినమోము ల్దెలివొందఁగాఁ గురిసి రాచెంత న్వినూత్నమ్ము లా
కనకమ్ముల్ సకలమ్ము శంకరుఁడు భక్తశ్రేణి కర్పించె న్నా
ఘనుచారిత్రము దాల్చితావహయుతు సాక్షాచ్ఛంభుఁ డాతండగున్.

ఉ॥ ఆతని యన్నదానమహిమాతిశయంబును దీనపోషణం
బాతని భక్తి యీయఘు నచ్చపుఁగీర్తిని జూచిచూచి సం
ప్రీతిగ నాని యూ యడుగు రేఖల నించుక పెంపుసేయుటన్
ఖ్యాతిగ గాశినాథకవులుండయ్యెను దా నొకవిశ్వదాతగన్. ౭౯

కం॥ శైవమతోద్ధారణకై శైవమహాసభను సౌమ్యసంవత్సరమం
దావిజయవాటిఁదొలుతగఁ గావించెను నేటికతనికరుణ వెలయఁగా.

కం॥ ఒకపదివసంతములు నా యకళంకుఁడె శైవసభలకధ్యక్షుఁడై
ప్రకటించెఁ గార్యదక్షత సకలాంధ్రశ్రేణిశైవజనసమ్మతుఁడై. ౮౧

కం॥ బంగారులింగకాయయు బంగారపుసూత్రి మొక్కభక్తుఁడిడియెనా
జంగమలింగమునకుమదిఁబొంగారెడుభక్తిరూపమునుఁబొందెనర

ఉ॥ ఆతనిపాదసేవకుఁడు నచ్చపుభక్తి సదాభజించు వాఁ
డాతని కొక్కవేళ బద మల్లనఁబట్టుచు స్వామికన్నులన్
వే తెఱలాడు నిద్రఁగని వెంటనె బంగరులింగకాయకై
చేతము చిక్కవెట్టఁ దన చేయుటుచాచె విమూఢబుద్ధియై. ౮౩

చ॥ మెలకువఁ జూచె శంకరుఁడు మేను చెమర్చెను వాని కంత ని
శ్చలకరుణాంతరంగుఁడగు శంకరుఁ డా శివసూత్రయుక్తమున్
వెలయఁగ లింగకాయనిడి నీవిది కైకొనిపొమ్మ దవ్వుగాఁ
దెలిసిన వీరు వారు నిను ధిక్కృతి నేమి యొనర్పఁ జూతురో. ౮౪

మ॥ చిరకాలమ్మగఁ బాదమొత్తుచు నను న్సేవించినా వీవు ని
న్నొరు లేమన్న సహింపఁజాల నిక నేయూరైన విచ్చేయు మీ
దురు దర్కంబగు దొంగబుద్ధి విడుమీ దూషించి యెచ్చోట న
వ్వరు నిన్నేమి యొనర్తురో మెలగుమీ పాటించి సద్ధర్మమున్.

మ॥ అనిన న్వాడు పదమ్ములం బడుచు దేవా తప్పుమన్నింపరే
నను మీసేవకు మిమ్ముల న్విడువఁగా నాచిత్త మొట్లోర్చు దు
ర్జనుడ న్స్వామికిద్రోహము న్దలిపితిన్ రక్షింపు మో తండ్రి య
న్నచు వేడ న్వినుమోయి నిన్నుఁగనిన న్కోపంబు లేదింతయున్. ౮౬

శా॥ భక్తుండౌటను దీని నీవు ధరియింపం గోరి చౌర్యక్రియో
ద్యుక్తుండైతివి భక్తకింకరుఁడ నేనూహింప వేఱొండుగా
భక్తుల్పెక్కగ నుండి రియ్యెడల నే భక్తస్వమాశించునో
యుక్తాయుక్తవిహీనమా నునను నీ వూహింపగా నేర్తువే. ౮౭

ఉ॥ ఇంతటిబుద్ధి గల్గునని యెన్నడు మున్ను దలంచినావె యీ
చెంతలనున్న భక్తజనచిత్తము వింతలు సైపనేర్చునే
వంతను వీడి నీమనసువచ్చినతావు సుఖమ్ము పొమ్మ నా
చెంతలనుండ గాదనుచు జెచ్చెర వానిని వీడుకొల్పిరన్. ౮౮

ఉ॥ పోయె నతండు దుఃఖపరిపూర్ణమనస్కత నయ్యగారిపైఁ
జేఁయెటులాడె దొంగిలఁగఁ జేసినతప్పు మఱల్పవచ్చునే
యే యెడకేగి యెమ్మెయిని నే నిఁకఁ గాలము పుచ్చనేర్తు నా
కోయనిపంట యీచెఱకుకొమ్మన నిమ్మెయి వెన్నుపుట్టిరన్.

మ॥ అని దుఃఖించుచు బెక్కుగా నతఁడు మున్నాస్వామిసాన్నిధ్యముం
గనియుంట న్వినియున్న పాటలు కథల్ గాథల్ మనమ్మందు బా
యని సొమ్మై యలరింపఁగా హరకథావ్యాహారపారీణుఁడై
మనియె న్జీవితమెల్లశంకరకృపామాధుర్యమూహించుచున్. ౯౦

వ॥ అంత—

కం॥ పదియేను వసంతమ్ములు ముదముగఁ గాపురము చేసి పురహరలోక
మ్మది చూడ నరిగె పార్వతి చెదరుపడన్శంకరయ్యచిత్తమొకింతన్.

కం॥ మార్గశిరస్థితదశమిని స్వర్గమ్మును మించియున్న సంసార మిటుల్
దుర్గారణ్యమ్ముగ శ్రీదుర్గాపదమంటుకొన్న తోయలి గనుచున్.

చ॥ మఱచెదనన్నఁ జిత్తమును మాటికి మాటికి రెచ్చఁగొట్టినన్
మఱవగనీవు నీ విటుఁబొనర్చిన సేవలు నన్ను వీడి నీ
వరుగుట యెట్టులో తెలియ నయ్యెద నిప్పటికైనగాని నిన్
మఱచుట యెట్టులే తెలుపుమా యది నా హృదయైకవాసినీ. ౯౩

కం॥ చదువ వడదసిరి మా గురు
లది యేలో కాని నన్ను నజుని విలాప
మ్మది యేమి? చెదరె నింతగ
హృదయమ్మిటువచ్చి పల్కరించుట తగదే. ౯౪

ఉ॥ అత్తను మించినా వతిథి కర్చనమిచ్చెడ యట్టి వేళలన్
గ్రొత్తగు పెండ్లికూతురయి కోమలికన్నులఁ దోఁచినావు నా
చిత్తములోన నా కనని చిన్నెల వన్నెల దిద్దినావు నీ
మిత్తని చిత్తముం గనక మృత్యువు కాలది యెట్లుపెట్టెనే. ౯౫

మ॥ అనుచుం బెక్కువిధమ్ములై హృదయ మల్లాడించు నా శోక మా
ఘనుఁ డెట్టెట్లొ మ్రింగి చిత్తమునకు న్గల్గించె స్థైర్యమ్ము కా
ని నిరూఢాత్మహృదంతరప్రణయినీ స్నేహప్రసంగమ్ము లా
తని కిచ్చెన్ సుఖదుఃఖశబ్దపరమార్థజ్ఞానసౌభాగ్యముల్. ౯౬

కం॥ మును దాక్షాయణి విడినన్
ఘనయోగస్థుకలిమి దక్షిణామూర్తి యసం
గను నెగడిన శంకరుఁ డ
య్యెను శంకరుఁ డపుడు భక్తు లెల్లరఁ బ్రోవన్. ౯౭

మ॥ అవతార మ్మపసంహరించుసమయ మ్మాసన్నమైనట్లు శం
భువు సూచించెనొ నాఁగ దద్గృహిణి యీ భూలోకమున్వీడ శాం
భవదీక్షాపరముండు రాముని కథ న్భావించి యా శంకర
య్యు విషాదమ్మునడంచె నిత్యశివభావారూఢ చిత్తమ్మునన్.

ఉ॥ ఆత్మజయమ్మొనర్చి ప్రమథాధిపుఁ జిత్తమునందునిల్పి ప్ర
త్యక్షముఁగాఁగ శంకరుఁడె యయ్యెను శంకరుఁ డాత్మవిద్యచే
లక్షలుభక్తు లాతని కెలంకులఁ జేరిరి ముక్తిఁగోరి పం
చాక్షరతత్త్వముఁ దెలిపె నాతఁడు వారి కనుగ్రహమ్మునన్,

ఉ॥ శిక్షితమార్గమందు దమ చిత్తమునన్ సరిదిద్ద నేరమిన్
భిక్షుకులైరి పెక్కురవివేకులు దండము కావిబట్టలున్
మోక్షమునిచ్చునేమి మనముం బరిమార్చుట ముక్తిగాక యీ
భిక్షుకకంచుకుల్ సకలవిశ్వసుఖస్థితిధూమకేతువుల్.

ఉ॥ దక్షత యింతలేక విశదమ్మగు చిత్తము మున్నె లేక సం
శిక్షితశాస్త్రబోధనము చెందక పెద్దలసేవ లేక యే

కుక్షిని నింపుమాటలను గొన్నిఁటి నెట్టులో యభ్యసించుచుఁ
మోక్ష మొసంగువారమని మూఢజనమ్ముల మోసగించుచుఁ.

ఉ॥ లక్షలు లక్షలై చెదలలాగు నమాయికచిత్తవిత్తముల్
భక్షణచేసికొఁగ నలవాటయి దేశము నాల్గు దిక్కులఁ
విక్షుభితమ్ముసేయు నవి నేకుల బెక్కుర రూపడంచె సం
శిక్షితచిత్తవృత్తి సువశీకృతలోకుఁడు శంకరుం డటఁ. ౧౦౨

ఉ॥ ముక్తుఁడు వీడ సుమ్మనగ మున్పొకవా రిడినట్టి చిహ్నముల్
రక్తులుగూడ దాల్చుటఁ గరమ్ము నశించెను బాహ్యదేవతా
భక్తియు ధర్మరక్తియు బ్రపత్తియునుం గరుణాస్వభావముఁ
శక్తివిహీను రాజ్యమున సంపదలట్లు క్రమక్రమమ్ముగా. ౧౦౩

కం॥ సకలమతమ్ములు జనులకు
నకళంకసుఖమ్ము లిడుటకయి పుట్టుట లెం
చక ధూర్తపండితబ్రువు
లకారణమ యన్యమతము లను దుర్మతులై. ౧౦౪

కం॥ శకవికలుగాగ నెల్లెడఁ బ్రకటింపఁగసాగి రపుడు పరమతనిందా
ధికము లుపన్యాసమ్ములు పకృతము లుద్రేకభావ విషపూరితముల్.

కం॥ ఆ కలకల మడఁగింపగ నేకశిలానగరసింహ మీశ్వరభక్త
ప్రాకార మతఁడు వెడలెను నాకారమ్మయిన విమలసౌజన్యమునా.

ఉ॥ ఒక్క యతిబ్రువుండు వినయోన్నతు శంకరు గుర్తెఱుంగమిఁ
తక్కిన శాస్త్రగర్వపిహితస్ఫుటభాషల వెక్కిరింతగా
రక్కస లిఁతలంతిరుదు రా కరతావళముల్ ధరించినఁ
దక్క నె మోక్షలక్ష్మి వికృతమ్ములు వేసము లేమిసేసెడిఁ. ౧౦౭

కం॥ లింగములనచుం బెనురాలం గట్టిగదాల్చ ముక్తలకుఁడగు నా
జంగములకుగా కెట్లైనం గలదే లింగధారణము విప్రులకుఁ.

ఆ॥ వె॥ అల్ల క్రైస్తవులకు నా తురుష్కులకును
వలె సమాధి చేయువారు గాన

కారు వేదమతముపా రంచు వెండియు
నవకతవక గాఁగ నతఁడు పలికె. ౧౦౯

చ॥ పలికిన నవ్వి మీ రనిన పల్కులు పామరహార్షణీయమై
యలరుననుగాక మీ మనమునందు యథార్థము తోఁపకున్న వి
చ్చలవిడి పల్కఁగా నగునె సత్ఫ్రభలన్ గడు సారహీనముల్
పలుకులు మీకు నుత్తరముపల్కుట తప్పమి గొంత సెప్పెదన్.

కం॥ తలగొరిగించెడుసన్యాసులును మహాయోగవిభవశూరులును దురు
ష్కులునుఁ గ్రైస్తవులగుదురెపలుకవె వారికిసమాధిపద్ధతివిధులున్.

మ॥ కలవే యన్నిమతమ్ము లారయ వృథా కల్పించి భేదమ్ములన్
దలయన్ దోకయులేవి వాదములతో దర్కించి వాదించినన్
ఫల మేమున్నది సర్వసంగములను వ్వర్జించు మీబోంట్లకీ
పలుకుల్ పల్కుట భావ్యమా యిదియు విద్వద్గోష్ఠియా? చూడగన్.

కం॥ జ్ఞానాగ్నిదగ్ధదేహున కేనా డది దగదటంచు నేర్పతిచె విధుల్
జ్ఞానాగ్నిదగ్ధుఁ డితం డౌనని నిర్ణయముసేయు నంతలు గలరే?

కం॥ వేదోక్తధర్మమియ్యది కాదందురొ యెన్న జేసి గనుఁగొంటిరె ఋ
గ్వేదమ్ము సమాధివిధిన్ గాడనియెనొ దానియునికి కలదని యనెనో.

కం॥ ప్రాచీన వేదమని విద్యాచతురులు పలికినట్టి దది యెటు లనగా
నీచ మ్మదియనిపలుకుట వాచాదోషమ్ముగాక పరమార్థంబే. ౧౧౫

ఉ॥ ఇంతకునుం బ్రమాణ మది యిట్టిదటంచును దీని కొక్క సి
ద్ధాంతము చూపినాడ నిజ మారసిచూడగ జీవి లేని యీ
గంతను బూడ్చిపెట్టినను గాల్చిన నీటను ద్రోసివేసినన్
సుంతయు భేదమున్నె? పరిశుద్ధమనమ్మునఁ జర్చఁజేసినన్. ౧౧౬

శా॥ ఆర్యాదేశముల న్వసించు జను లాయారీతి సంస్కారముల్
జేయం జేయగ వంశధర్మమగుచున్ సిద్ధించె నానాట నా
చాయం ద్రొక్కుచు వారిసంతతి యనూచానమ్ము నాచారముల్
బాయ న్నేరదు స్వీయ జాతిమతధర్మప్రీతి నీనాటికిన్. ౧౧౭

ఉ॥ ఆరయఁ బాంచభౌతికమె యైనను బార్థివమైన దేహముల్
ధారుణిఁ గల్పనెంచు టుచితమ్మటుగాక యనేకరోగముల్
గూరిన యీశరీరమునకున్ దహనమ్ము జలప్రవేశముల్
ధారుణిఁ గల్పకం బెను యథార్థమునం దొకయింత తక్కువల్.

మ॥ శవధూమమ్మున రోగముల్గలుగు శౌచమ్మెల్ల బాయున్ నదీ
నివహమ్ముల్ ధరయెల్ల గంగయగునా నిక్కమ్ముగా దేహ మీ
యవనిం గల్పుట ప్రాక్తనమ్మయిన సమ్యగ్ధర్మ మిద్దాని భూ
రివివేకు లెగనాడ లేరు సహజప్రీతిన్ సదాచారతన్. ౧౧౯

కం॥ దహనమ్ముకన్న ఖననము
మహనీయమ్మనుట కిన్ని మాటలు వలెనా
మహితాత్ములయిన యతులను
దహనమ్మొనరింపమియ యుదాహరణ మగున్. ౧౨౦

కం॥ శ్రుతులు స్మృతుల్ విప్రున కు
న్నతిఁ జెప్పిన లింగధారణము కాదన్నన్
శ్రుతవంతులు నవ్వెద రా
కతలం గయికొన్న లక్ష గ్రంథము పెరుగున్. ౧౨౧

గీ॥ వాగతీతమ్ము సుమి పరబ్రహ్మ మనిన
వాక్కు కండెనొ లేదొ చెప్పగను వలెనె
అటుల నా బ్రహ్మరూపమ్ము నాత్మలింగ
మందు నార్థికముగఁ జూపు టరయ నిదియు. ౧౨౨

గీ॥ చంద్రమౌళీశ్వరుండనఁ జనిన లింగ
మూర్తి నా శంకరుండును బూజసేసె
నతని యీ శివానందలహరినిఁ జూడ
స్పష్టమగు గాదె శంకరుభక్తి యెల్ల. ౧౨౩

కం॥ రోగాకృతియగు తనువున రోగమ్ములు చేరనీవు రుద్రాక్షమ్ముల్
రాగమ్మునడచు ముక్త్యనురాగమ్మునొసంగు భక్తిరసరంజితముల్.

కం॥ నిగమాగమములు స్మృతులును
జగతిని రుద్రాక్షమహిమ సన్నుతియించెన్
తగ నెఱిగించె బురాణము
లగాధగాథాకథేతిహాసము లరయన్. ౧౨౫

కం॥ కడచనిన కొలది కాలము నడచిన చరితయె పురాణనామంబందెన్
పొడవడగి చరితకొంతగ జెడక నిలిచి గాథమున బ్రసిద్ధివహించెన్.

కం॥ మునుపటిదె యయ్యు గడు నూ
తనమాట బురాణమయ్యె దానిని విజ్ఞుల్
పినిచిరి "పురాఽపి నవ్య"
మ్మను వ్యుత్పత్తిని బురాణ మను పదమునకున్. ౧౨౭

శా॥ మార్గం గావుత వింతవింతగను నామమ్ముల్ బ్రపంచమ్ములన్
మారం బోనిది మార్పురానిది పురాణఖ్యాతతత్త్వంబు నీ
చారిత్రంబులు త్రివ్వి చూచికొనినన్ సత్యంబు వేరున్నదే
పారమ్మంటిన మంచిచెడ్డలస్వరూపమ్ముల్ విడందీసినన్. ౧౨౮

ఉ॥ సూటిగఁ జెప్పగావలయుచోటుల నవ్వి యొకింతయేని మో
మోటమి లేక యున్నయది యున్నటు లేవచియించె నొక్కచో
జాటువుగాఁ జెప్పె దెఱచాటుగఁ జెప్పెను వ్యంగ్యరీతులన్
నాటగ నొప్పిపుట్టని మనమ్ముల కెక్క బురాణము ల్వ్యాధుల్. ౧౨౯

చ॥ జరిగిన వృత్తమయ్యు గడచన్న కొలందిఁ జరిత్రమాచు బై
నరుదుగఁ గొంతకాలమున కందినదై యితిహాసరూపమున్
ధరను బురాణమంచును బ్రథ న్వహియించిన భారతమ్మె యీ
చరిత పురాణమాట కొక సాక్ష్యము నిదె తలంచిచూచినన్.

చ॥ సకలపురాణసారమని సన్నుతిఁగాంచిన భారతమ్మునన్
బ్రకటనచేసె ద్రౌణి కల వ్యాసుఁడు సర్వము లింగపూజనా
ధికులగు కష్ణపార్థులను దెల్పుచు నాతడు కృష్ణుఁడు న్శివా
ధికతను ధర్మపార్థులకుఁ దెల్లముసేయరె సత్యసంపదన్. ౧౩౧

మ॥ ధ్వనిగా నర్థముచూపిచెప్పు టది విద్వన్మార్గమా గావునన్
మును వారల్ పరికించి ధర్మ మటులన్ బోధించు నా మార్గమున్
గనుగో నేరని జాడ్యతామహిమ నన్యంబైన సంస్కారమున్
గని దూషించినఁ బోవునే యవి మహాకళ్యాణరూపమ్ములై. ౧౩౨

ఉ॥ భారతముత్తి కొంచుఁ దొలిపల్కుగ నా వినతాచరిత్ర మిం
పారగ వ్రాసె వ్యాసుఁ డది భారతభావికథార్థసూచిగా
ధీరుడు నన్నపార్యు డది తెల్లముసేసెను దక్కుగాథలన్
దా రచియింపకే విడిచి తత్కథకెల్లను సింహపీఠిగా. ౧౩౩

కం॥ సవతులకయ్యము నూరుగు
రవు పుత్త్రులు చెడుట దాస్యమగుటయు మిషచే
దివిజేంద్రజయము తొలిచూ
లవమానిత మగుట మూల మగుటయు దలపన్. ౧౩౪

మ॥ సమముల్ రెంటను బ్రాహ్మణార్భకవచస్సంరంభసంక్షీణ మ
య్యె మహీనాథకులమ్ము శృంగికథ యీవృత్తాంతముం దెల్పునీ
క్రమముంబట్టి యొకింతచూచునెడలన్ గన్పట్టు నన్వర్థముల్
రమణీయమ్ములు పెక్కుగాథలు మహారత్నంబులై యయ్యెడన్.

ఉ॥ సూచనగాఁగ మార్గమిదిసుమ్మనియంటిఁ బురాణగాథలన్
జూచుట కా పురాణములనుంబది యీశ్వరు బ్రస్తుతించె గా
ణాచియటంచు వేల్పుల కనంతములైన కళావిశేషముల్
వీచికలై మెసంగినవి వేదపయోనిధియైన వానిలో. ౧౩౬

గీ॥ పదిపురాణమ్ము లీశ్వరుఁ బ్రస్తుతింప
నడుమ నద్వైతముగఁ జేర్చినారు కొంద
ఱన్యమతదూషణమ్ముల నభవుమహిమ
దెలుపు తాననె యీశ్వరధిక్కృతియును. ౧౩౭

కం॥ శివతత్త్వపురాణమ్ముల
శివదూషణ వ్యాసుఁ డేల సేసెడి నిది దు

ర్వ్యవసాయులైన విబుధ
బ్రువ కర్మ మ్మనుచు స్పష్టముగఁ జెప్పనగున్. ౧౩౯

క|| శివుఁడట రాముని నామము శివాని కుపదేశమంట చేసెన టే యీ
యవివేక మేమి సెప్పుదు శివ శివ యద్వైత మెంత సేసెనుదుడుకున్.

క|| త్రేతాయుగమున దశరథ
భూతలపతిసుతుఁడు రాముమూర్తినిఁ గొలిచెన్
భూతపతి నిఖిలనిగమ
ఖ్యాతుఁడు శివుఁడన్న సత్యముగనా తలఁపన్. ౧౪౦

క|| రామప్రతిష్ఠితమ్మని రామేశ్వరలింగమును పురాణములన వే
రాముని శివభక్తి శ్రీరామాయణ మందుఁ జూడరా విబుధవరుల్.

ఉ|| ఒక్క మహాత్ముఁడా పురుషు నూర్జితవృత్తముచూచి పండితుల్
దక్క గ వాని నొక్కయవతారమునా గఁ దలంచి కొల్తురే
తక్కువ లెక్కువ ల్లనక తక్కటివా రది యాదరించి స
మ్యక్కృతభక్తిమార్గరతులై తరియింతురు జీవితాంబుధిన్.

చ|| సకలజనీనముల్ కృతులు సాధనచేయగ జీవితమ్ము నెం
చక యట ధారవోసిన ప్రశస్తగుణాఢ్యులమీఁది భక్తి వ
ల్లిక లటు సేయు నల్లికల లీలలుగా శివ వేదమూర్తులా
కళవికగా గతానుగతిక మ్మగు లోకమటం చెఱింగమే. ౧౪౩

ఉ|| అంతియకాని యస్వ్యమత మందు నిరాదృతి సేయుబోరు సి
ద్ధాంతమెఱుంగుపండితు లహంకృతి చూపరు ధర్మబద్ధమై
శాంతముగాగ లోకము ప్రశస్తపథమ్మునఁబోవు టొక్కటే
యంతయు వారి కిష్ట మిదియే పరమార్థము విశ్వభావలన్. ౧౪౪

క|| తన పుట్టినమతమునగల
యనూనతత్త్వమ్ముగనక యన్యమతమ్మున్
గొనువాడు గబ్బిలమ్మన
జను నుభయభ్రష్టుఁడగుచు సకలవిధములన్. ౧౪౫

ఉ॥ అంతయు నొక్కటేయనుట యందలి నిక్క మెఱుంగ నేరమిన్
భ్రాంతులు తప్పుదారి బడి భ్రష్టతనొంది రభేదవాద సి
ద్ధాంతులమన్న యొక్క దురహంకృతి చిక్కను వీరికెల్ల న
త్యంతవిగర్హితమ్మగుచు నన్యమతాసహనైకతానమై. ౧౪౬

గీ॥ అవయవములెల్ల భిన్నంబులయినఁ గాని
యం దభిన్నంబె యవయవి యనుటగాదె
యరయ నద్వైతవాదసిద్ధాంతసార
మింతకును మించి వేఱుగా నేమిగలదు ౧౪౭

కం॥ జీవాత్మ లభిన్నములై కా వటు లల్పాధికత్వకలనముచేతన్
గావున శుద్ధాద్వైతము భావింపరు తత్త్వవిదులు పరమార్థముగన్.

ఉ॥ వ్యాసుని బ్రహ్మసూత్రములభావము నిట్టిదిగాఁగ మున్నుగాఁ
జేసెను నీలకంఠగురుసింహము భాష్యము శంకరుం డటన్
వ్యాసునిమార్గ మద్వయమె యన్నను దానిని ద్రోసిరాజుగన్
జేసి రనంతభాష్యము లనేకులు వారల యిష్టరీతులన్. ౧౪౯

కం॥ నీవును నేనును మిథ్యయె యీ విశ్వమ్మెల్ల మిథ్యయే యనువారల్
భావింప నిన్నికర్మము లేవిధముఁ జేయవలసె నెఱిగి యెఱిగియున్.

చం॥ గురుఁడని వీఁడు శిష్యుఁడని కొందఱు పెద్ద మగండు నాలునున్
దొరయని బంటు వీఁడనియును బురుషుండును స్త్రీయటంచు లే
దరయఁగ భేద మీ మతమునం దివి కేవలకల్పితమ్ములై
పరగుట విశ్వవర్తనశుభస్థితి కియ్యది లోకచక్రయా. ౧౫౧

కం॥ ఆచార్యపురుషు భావము తూచా తప్పకయె కనని దోషవశమునన్
వాచామాత్రవిదగ్ధులు కాచమ్మును మణిని నొకటిగాఁ జేసిరటన్.

కం॥ అనుభవము లేక శాస్త్రములను జదివినమాత్ర ముక్తి లబ్ధంబగునా
వినుమెన్ని జన్మముల కీయనుభూతియె యొసగునదియ కమృతపదమ్మున్

కం॥ ప్రతిభావిశేషమెసఁగన్ మతసిద్ధాంతములొనర్చిన స్మర్తలు గా
కతనిని ముక్తుం డందురె యతులజ్ఞానైకదీప్తులయిన మహాత్ముల్.

కం॥ భక్తి విరక్తియు జ్ఞానము
ముక్తికి సాధనములగుట మూఁడు నొకటిగా
శక్తిత్రయసంయుతమై
వ్యక్తంబగు శైవజనమహామతము ధరన్. ౧౫౫

కం॥ ఈ మూఁట నొకటి కేవల
మై ముక్తినొసంగు ననుట యాకాశ సుమం
బౌ ముక్తినందు టనఁగన్
సామాన్యమె బహుళవాసనాగ్రంథులకున్. ౧౫౬

చం॥ అనిన నిరుత్తరుండగుచు నాతఁడు శంకరు సాఁగిమ్రొక్కి యో
యనఘ, భవద్విశేష మిది యారయ కన్న మదుక్తిదోషమున్
మనమున నెంచకుండని క్షమాపణ వేడ నతండు నవ్వుచున్
జనములు మెచ్చ నా యతికి సత్కృతిసేయుచు వీఁడుకొల్పుచున్.

కం॥ అందుండి వెడలి భక్తుల
విందులుగా జ్ఞానభక్తివిధములు గడు పెం
పొందఁగ నుపన్యసించుచు
నందందును దిరిగి తిరిగి యాతఁడు మరలన్.

కం॥ ఏకశిలానగరమ్మున కా కామతకుంజరారి యరుదెంచె నటన్
వేఁకువలు కొన్ని కడచిన సాకారవసంతలక్ష్మి సాక్షాత్కృతినాన్.

మ॥ నవసంగీతకళావిశేషనిధి నానా నాట్యవిద్యారహ
స్యవిశేషజ్ఞ యనంగఁ బేర్వడిన మాచల్దేవి యన్పించుచున్
శివరూపుండగు శంకరుం గొలువవచ్చెన్ బేర్మి వారాంగనా
నవకీర్తిస్థిరవైజయంతియగు కాంతారత్న మల్లంతటన్. ౧౬౦

ఉ॥ వచ్చెనో లేదో యా యువతి వచ్చిరి పెక్కురు పెద్ద లంతలో
నచ్చుట నయ్యె నొక్కసభ యాసభ వారి యనుజ్ఞనొంది వి
ద్యుచ్చపలాక్షి నాట్యమున కుత్సుకయై నటరాజమూర్తికిన్
హెచ్చుగఁ దుల్యయై నటనఁ గనెంతయు జూపెను నాట్యశిల్పముల్,

కం॥ ఆ నాట్యవిశేషమ్ముల
మేనులు గఱుపొడువ మతులు మిక్కిలివడఁగా
జ్ఞానమతియుండగు శంకరు
మానసమునఁ గలుగ దింతమార్పు తనువునన్. ౧౬౨

కం॥ తగులువడి చూచువారల
తగులము మదిలోన నవ్వు తరగలుగాఁగా
మగువ నిడువాలుఁగన్నుల
సొగసులు కనువారి మదులు సొగియించెఁ గడున్. ౧౬౩

కం॥ ఆనందమ్మున నవ్వా
రానాట్యవిశేషములకు నభినందింపం
గా నారీమణి యంతట
గానమునన్ బ్రతిభ మెఱయఁగాఁ దలఁచిమదిన్. ౧౬౪

గీ॥ వివిధరాగమ్ములందుఁ బ్రవీణ వీణ
పాణి మీటుచు నా జాణ పాడఁదొడఁగె
మధురకవితానుభావార్ద్రమంగళములు
మాధవాస్థానకవికంఠ మధురములను. ౧౬౫

గీ॥ రసములందును శృంగార రసము వోలెఁ
గళలలోపల సంగీతకళయె ప్రాణి
కోటి కెల్లను ముద మొనఁగూర్చునన్నఁ
బలుకఁ దరమానె యాకాంత పాటమెఱుఁగు. ౧౬౬

కం॥ మదిరాక్షి చారుకావనమదనహారవిహారగాథ మధురగళము నం
పదను జగన్మోహనముగ నెదుటన చిత్రించె సభ్యులెల్లను మెచ్చన్.

కం॥ విదుషీమణి యా సభ్యుల
హృదయమ్ముల జూఱగొనుచు నిటు నృత్యరసా
స్పద గానకళల నంతట
మృదుకవితామధురరీతి మెఱయ నిటులనున్. ౧౬౭

మ॥ ఒకనాఁ డెన్న మహోజ్జ్వలాంధ్రసుకృతద్యోవాహినీపాళమై
సకలాశాంతరఘూర్ణమాన సుయశస్సౌభాగ్యపాథోధియై
వికటారాతిహృదంతరాళవిలయత్క్ష్వేళప్రకారంబు నీ
సకలశ్రీనిధి కాకతీయనగరీ సంసర్గసేచ్ఛారతిన్ ౧౬౯

మ॥ మనసై వచ్చితి జూడ నా శిథిలముల్ ప్రాణ్నైన చిత్తమ్మునన్
వినిపించెం బలు కొల్లఁ డంత నిటులో వెఱ్ఱీ వృథా నూది నీ
ముచు చారిత్రము ద్రవ్వి త్రుళ్ళెదవో నీపూర్వస్మృతిం గాంచి వె
చ్చని కన్నీళుల నంజలించెదవొ నీ శక్తిం బరీక్షించెదో. ౧౭౦

మ॥ అని విన్పించిన దెప్పరిల్లు కనుదోయా సవ్వడింబట్టి పో
యి నరుం డెవ్వని నొండొరుంగనక తాయింబోని చిత్తమ్మునన్
ధ్వనితంబైన తదుక్తిలో నరసి బాష్పంబుల్ పిసాళింపఁ బె
ల్చన నన్నుం గొనిపోయి యచ్చటి సహస్రస్తంభమధ్యంబునన్.

శా॥ చూపింపన్ శిథిలావశిష్టముల నేఁ జూడంగ నాశిల్పముల్
వాపోయె న్నను వెక్కిరించె నగియెన్ భావమ్మభావమ్ముగా
నాపైఁ జూపులు నిల్పి చేర బిలిచెన్ రాబొమ్మలా బొమ్మలన్
జూపుల్ నిల్పుచు నేను రాప్రతిమనై శుష్కాంగరాళమ్మునన్.

మ॥ కవులంచుం బలుగర్వమూను టొకచే కానీ మనస్సృష్టిలో
నెవ రోయీ సరివచ్చువా రిచటి నీ యీశిల్పకావ్యంబ యీ
కవిలోకమ్మునకెల్ల వస్తుమయభిక్షం గూర్చు నీచేతి నే
ర్పు విశేష మ్మదియెన్న నెవ్వరికగున్ బుణ్యాంధ్రశిల్పిప్రభూ.

ఉ॥ మెత్తని పానుపుల్ సొగసు మించు మిటారులు తూగుటుయ్యెలల్
చిత్త మెఱుంగు లేఖకులు చేరిన కబ్బములట్లు సత్కవుల్
సుత్తులు శాణముల్ గొనుచు సుందర చిత్రము లిట్లుగూర్చు నీ
మొత్తుకు వచ్చువారె శిల లిమ్మెయి వారలచేత దీరునే. ౧౭౪

శా॥ నీ కావించిన శిల్పకౌశలములో నిక్కం బెఱుంగంగ లే
రీ కాలమ్మునఁ దెల్లువారనిన నీ వేసంచు లోనెంతువో

యాకాలమ్మును మీమహత్త్వమును మీయాకారముల్ చూపిమా
కీకాలమ్మున మాస్వరూపముల నీ యీ చిత్రముల్ చూపెడిన్.

శా॥ ఏదో ముందుకుఁ బోవుచుంటివని యూహింతు న్నిజం బిప్డు నా
లోఁ దోఁచె న్నదిపోలె బుట్టినగిరుల్ పోనాడి వేగమ్మునన్
స్వాదుత్వమ్మును స్వచ్ఛత న్విడిచి యా పాథోధిగాంభీర్యమే
నా దన్నట్టుల ఘోషవెట్టు వెడగున్ బాటన్ బ్రవర్తించుటల్.

ఉ॥ గుండెలు లేని లోకులను గుండియ లిచ్చితి వీవు శిల్పముల్
పండిన చేతిశాణమున వారికిఁ జేతు లవెట్టు లాడెనో
గుండెలు తీసి జాతి తుదకుం గళయెల్ల బికారుచేసినన్
బండడు కోర్కి దుర్యశము పండెను వారికి శాశ్వతమ్ముగా. ౧౭౭

శా॥ పాటించున్ భవదీయశిల్పమున ధ్వస్తమ్మైన భాగమ్ము లా
లూటీకోరుల దూండగమ్ములను నీలో రాలు జీవించుటల్
పాటింపంబడుఁగాక ముష్కరులచే భవ్యాంధ్రవిజ్ఞాన మె
ప్పాటన్ బోదను సత్యశోమధురితధ్యానమ్ము దిగ్భిత్తులన్. ౧౭౮

మ॥ అనుచుం గాంచితిఁ గాకతీశ్వరు సుధర్మాస్థానిఁ గన్నిట్టిలో
నునుకల్ వెట్టుచు నాఱునూరులు సమంబుల్ దాటెనన్నిన్న వు
ట్టినయ ట్లున్న గజాళి నంచలను గంటిన్ శ్రీస్వయంభూవిభున్
గనుగోరంటినెఁ గంచుమ్రోయు వృషభేంద్రస్వామిపుణ్యాకృతిన్.

కం॥ నవలక్షధనుర్ధరు లీ గవనున నరిరాజకోటి కంటి నలుసులై
యువనిం గలిసిరె యని మది కువకువలై పోయి గువ్వకుత్తుక వెట్టన్.

శా॥ ప్రాచీనాంధ్రమహావిభూతికిని స్వర్గమ్మైన యిచ్చోట మా
మాచల్దేవి ప్రతాపరుద్రనృపతుల్ మన్నింపఁగా గాన వి
ద్యాచాతుర్యము నాట్యసంపద కవిత్వప్రౌఢి దీపించుటల్
దోఁచెన్ జిత్తమునందుఁ బ్రౌఢకవితారూఢమ్ములై యంతటన్.

సీ॥ పాల్కురిసోమన్న పరమభక్తులతోడ
విడిసెనా యీసభాపీఠమందు
దిక్కన గణపతిదేవు మెప్పించిన
దీ సభామంటప మ్మెక్కి కాదె
రాణి రుద్రమదేవి రాజ్యమ్ము లేలిన
చిహ్నమా యీసభాసీమ నేడు
అల్ల విద్యానాథు నమరసాహిత్యంబు
మార్మ్రోగె మొదల నీ మంటపమున
గీ॥ నాడు నాగయగన్న సేనాని యాంధ్ర
కృతినిగొని మారకవి సత్కరించె నిచట
ననుచు నొకకొన్నిగాధల నల్లుకొనుచు
విడువలేకయు నాకోట విడుచు నెడల. ౧౮౩

శా॥ ఘోరానిత్తురు పాడుకాపగు ముఖద్వారమ్మున న్నేటికిన్
నీరాజన్యుల యీ శ్మశానమునకున్ నీ వాంధ్రసామ్రాజ్యభూ
ధౌరేయుండు ప్రతాపరుద్రధరణీంద్రస్వామికాలమ్ములో
నే ఊరైనను మేలె యుంచు వినవయ్యేన్ నా మనోవీధులన్.

కం॥ శివభక్తులు రాజులు నా
శివభక్తులె మంత్రు లగుచుఁ జెలఁగిరి మును నీ
శివరాజధాని నేఁడును
జెవులకుఁ బండువుగ వింటి శ్రీశంకరులన్. ౧౮౪

మ॥ చెవి సోకంగనె పుణ్యనామ మటులన్ శ్రీమత్స్వయంభూవిభుం
డవు నీ శంకరుఁ గొల్చి జన్మమును ధన్య మ్మిట్లు గావించుకో
నవకాశమ్మును గోరి వచ్చితి మదీయాభీష్టసంసిద్ధి నీ
శివరూపుండు ననుగ్రహించెననుచున్ జేదోయి సంధించుచున్.

కం॥ శ్రీరమ్య మమలము గుణో
దారము మఁదిగొండ శంకరారాధ్య కృపా

సారామరతటిని వాః
పూరము దయ మాకు ముక్తిఁబొందు నొసఁగుతఱి. ౧౮౬

మ॥ తలవంక న్నెలవంక లేక కులగోత్రస్ఫూర్తి లోకమ్ములన్
విలువంక న్విలువింకనీకు రగుల న్నెమ్మేనఁ గైకోక పై
దలి వంకల్దలవంకలు న్విడిచి యుద్యచ్ఛంకరారాధ్యుఁడై
యలవంకంగల లెంకలందనుపు నీయాశాను సేవించెదన్. ౧౮౭

ఉ॥ శ్రీముదిగొండవంశ కలశీజలధీశ్వరపూర్ణచంద్ర భ
క్తామల,మానసాంబుజవిహారిమనోహరరాజహంస బో
ధామృతముక్తకిల్బిషపదానీత, యానతవైరిలోక శ్రీ
సోమకళాధరాంశజనిసుందర, శంకర లోకశంకరా. ౧౮౮

శా॥ భారద్వాజపవిత్రగోత్ర, బుధసంభావ్యాత్మచారిత్ర, వి
ద్యారత్నాకర, పుణ్యమానసవిహారాసక్త గౌరీశ్వరా
దారిద్ర్యార్తజనప్రపంచ నవమందారా యుదారాశయా
పారావారగభీర శంకర మహాభక్తిస్ఫురద్విగ్రహా. ౧౮౯

కం॥ శ్రీదళపూజాతత్పర వేదమయ దశావధాన వేదీ సుమనో
వాదోపవాదహరణా యాదఃపతితూణపదసమంచితహృదయా.

ఇంద్రవజ్రము॥ శ్రీమంత్రమూర్తి ప్రియసింధువీచీ
సోమార్భకా శ్రీ శుభసుందరాంగా
కామారిభక్తాగ్రణి శంకరారా
ధ్యా మత్కవిత్వోదయనవ్యహేళీ. ౧౯౧

మందారదామము॥ శ్రీ జేజెమాగర్భచింతామణీ గౌ
రీజానిభక్తాంఘ్రిరేఖానువర్తీ
రాజార్ధకోటీర రమ్యాంతరా వి
ద్యాజీవనా శంకరారాధ్య దేవా. ౧౯౨

మ॥ క్షితిపైఁ బుట్టినదానికిన్ ఫలముగా శ్రీశంకరారాధ్యు మేల్
కతల న్వీనుల విందుగా వినుచు భక్తశ్రేణి రంజించు స

త్కృతి సేయంగను నోరుగంటిపురిలో శ్రీశంకరుం జూడ వ
చ్చితి మిమ్ముం గనుగొంటి నాదుసుకృత శ్రీ లిట్లు పండింపఁగా.

మ॥ అని యా వారవధూటి శంకరుని పాదాబ్జమ్ములన్ వ్రాలె నా
వినయమ్మున్ నయమున్ గళావిభవమున్ విఖ్యాతమౌ భక్తియున్
గని యుప్పొంగినచిత్తమై పలికె సాత్వాచ్ఛంభుఁ డాతండు భా
మిని, నీ యీ పొసఁగించుసేవలు కడున్ మెప్పించె మాచిత్తమున్.

శా॥ నీ చిత్తమ్మున భక్తి యిప్పగిది నన్పించెం జుమీ శాక యా
ప్రాచీనాంధ్రమహానుభావులకు జూపన్వచ్చునే సాటిగా
నీ చారిత్ర విశుద్ధి చూడ సులభానిస్తుల్యచారిత్రమున్
మాచిత్తమ్మునఁ దోఁచె బుట్టువెడయైనన్ గణ్యతల్ పోవునే. ౧౫౧

శా॥ భోగస్త్రీయను మాత్రబుద్ధి పెడయై ప్రోద్రోచి సిక్కమ్మటన్
రాగాంధుల్ గవిపండితప్రభువులు ధర్మమ్ముల్ల పాయించి నా
రాగోదారచరిత్ర మేకులమునం దైనన్ ప్రశంసార్హమే
యౌఁగా కిందుఁ గులమ్ము లింగము వయోఽల్పాధిక్యము ల్లగ్గునే.

కం॥ మృదు మధురసరసకవితా విదుషివి కలగానన్నృత్యవివిధకలా కో
విద వీశ్వరభక్తిరసాస్వదహృదయవు నీవటంచు శంకరుఁ డంతన్.

కం॥ చిరకాలము వర్ధిల్లుము పరశివపాదాబ్జభజనపరమానస వై
వరవర్ణినియని సెలువ లరుదవు దీవెనలతోడ నామె కొసంగెన్.

చ॥ జనకుని బోని యా యమరశంకరుఁ డిచ్చిన యట్టి సత్కృతిన్
మనమున వీడలేక యభిమానిని దేవర దాసురాలికిన్
ధనమును సేలువల్ గొఱయె తాపకసేవ యొకండె కాక దీ
వన యిదియంచుఁ గైకొనియె వారవధూటి విచారధీరయై. ౧౫౫

ఉ॥ అమ్మయి శంకరుం గొలిచి యాయమవీడ్కొనె వారి నంత మా
సమ్ములుకొన్ని వెన్కఁబడ శారదలక్ష్మి యశేషధాత్రికిన్
శామ్ములు వెట్టి యుత్సవము శోభిలఁ జేయఁగఁ బూనెనాఁగ వ్యో
మమ్మునఁ జంద్రుఁడొప్పె, బలమర్దనుడెక్కిన వెల్లయేనుఁగై.

కం॥ గుండా నాగ మ్మను భ
క్తుం డట శంకరుని జేరి, తోరపు భక్తిన్
నిండిన వినయమ్మున నా
రెండవశంకరుని జూచి, ప్రియ మెసఁగంగా. ౨౦౧

ఉ॥ దేవరసత్కృపామహిమ దీయనివై యలరారె సంపదల్
సేవకుఁ డొక్కవిన్నపముసేయఁగలం డది చిత్తగించి మీ
రావరమీయఁగావలయు నన్న నతండొక చిన్నినవ్వునన్
సేవకసేవకుం డితఁడు చెప్పుము నీ మదినున్న కోరికన్. ౨౦౨

కం॥ అన వెలిచుచు మాతండ్రీ
వినుము గజోత్సవముసేయ వేడుకయయ్యెన్
మనమునఁ దడవులనుండియు
ననుగ్రహింపంగవలయు నది యిప్పుడునన్. ౨౦౩

ఆ॥ సెలవి వాలి, నవ్వి సేవకు వేడుక
లెల్లఁ దీర్పవలయు నీశ్వరునకు
నీ విడంబనంబు లే నొల్ల వల దిట్టి
యుత్సవంబు లనుచు నొత్తిపలుక. ౨౦౪

కం॥ గురుఁడనఁ జరుఁడన మఱి యీ
శ్వరుఁడన మీకంటెఁగలరె శంకర మాకున్
జిరకాలవాంఛిత మ్మిది
కరుణింపరె యనుచు మనసు కలుఁగఁగ బలుకన్. ౨౦౫

శా॥ అంగీకారమునూపె నాగురుడు భక్త్యావేశపూరమ్మున, స
ర్వాంగీణమ్మగ శిష్యుఁడున్ బెరిగి, మత్తానేకపీంద్రంబు ను
ప్పాంగం దెచ్చి యలంకరించి గురునింబూజించి, దీపింపఁగా
సింగారమ్ములు మంగళశ్రుతివచశ్శ్రీ లుల్లసిల్లం గడున్. ౨౦౬

శా॥ ఎక్కించెం గరిరాజుపై నెదురుగా నేతెంచెఁ గన్యాజనం
బక్కంభీంద్రుని ముందుగానడచి నా రామ్నాయశూరుల్ బుధుల్

దిక్కుల్ మ్రోసెను మంగళధ్వనులు, వార్ధిస్పర్ధిగాంభీర్యమై
యుక్కల్యాణము సాఁగఁగా నడచె నా హస్తీంద్రుఁ డుద్యద్గతిన్.

ఉ॥ మదగజమెక్కి శంకరసమానుఁ డతండు నభంబువేరి యు
న్మదగజమెక్కు చందురుఁ డనం బొలుపొందెను వానిఁగొల్చు నా
సదమలసంఘమో యనఁగఁ జాయులదీర్చెను భక్తకోటి యా
యుదయగిరీంద్రమెక్కు రవియో యనిపించె నతండు నంతలో.

మ॥ పడుచుంగుఱ్ఱలు గుంపులై జయజయధ్వానమ్ము గావించుచున్
కడుఁ జిత్రమ్ముగఁ గాల్చినారచట బాణాసంచు నా మ్రోఁతలన్
బెడఁగై "శంకర తే జయ"మ్మను నుడుల్ విస్పష్టమై మ్రోసె న
ల్గడలన్ "శంకర తే జయ" మ్మనులిపుల్ గన్పట్టె నావెల్గులన్.

శా॥ ఆలాపించిరి శంకరాభరణ కల్యాణ్యాది రాగమ్ములన్
వాలాయమ్ముగ గాయకుల్ మధురకంఠస్వాన మాలించు నా
లీలామానుషవిగ్రహంబు కనులన్ లేనవ్వు దొల్కాడ, శుం
డాలమున్నడచెన్ బ్రసన్నగతులన్ గానార్ద్రచిత్తమ్మునన్. ౨౧౦

కం॥ సామమ్ము పలుకు విప్ర
స్వాములఁ గరశీకరముల స్నానమొనర్చెన్
సామజ మలంకృతమ్ములు
పూ మాలలు వారి మూర్ధములనిడు భక్తిన్. ౨౧౧

చ॥ శివభజనమ్ము చేయుచును జేరిరి గుంపులు గుంపులై ప్రజల్
కవులును గాయకుల్ బుధులు క్రందుగఁ దోఁ జనుదెంచి రమ్మహో
త్సవమున నెందుఁజూచినను శంకరనామము మారుమ్రోసె వై
భవ మది యిట్టిదట్టి దనవచ్చునె దాని కదే సమంబగున్. ౨౧౨

మ॥ ప్రమథుండో యన వచ్చె నొక్కఁడు మహాభక్తుండు రుద్రాక్ష హా
రములన్ దన్మయమౌ కిరీటమున నిర్మాల్యంబు భూత్యంగరా
గమునన్ జొబ్బిలుమేను వక్షమున లింగమ్మున్ గరాబ్జంబులన్
సుమనోబిల్వదళంబులున్ గొనుచు వచ్చెన్ స్వామి సేవింపఁగా

శా॥ ఇంటింటన్ శుభహారతుల్ గొనుచుఁ దా మేతెంచి నారంగనల్
చంటిన్ బిడ్డలు సందడింప సుమము ల్వర్షించి రా స్వామిపై
వెంటన్వచ్చిరి వేయికన్నులు గా వీక్షించి రామూర్తి ము
క్కంటిం బోలె యజించినాడు బహుధా కల్యాణభావమ్ములన్.

చ॥ చెవిఁబడ నుత్సవధ్వనులు చెంగునఁ దోఁకల నెత్తి దూఁకుచున్
జెవులును గన్ను లింతలుగఁ జేయుచు దల్లుల చాటు చేరఁగా
నవి తమ చిన్నబిడ్డలకు హాయిగఁ బాల నొసంగుచున్ మహో
త్సవమున సాగివచ్చె నలశంకరుఁ జూచి యదెట్టి ప్రీతిరో. ౨౧౫

చ॥ ఒక జవరాలు శంకరుని యుత్సవమున్ దిలకింపవచ్చెఁ గం
చుక మొకచేత నెత్తికొని నూనశరాసుయశఃపతాకగాఁ
ప్రకటితమయ్యె నా సుదతివక్షమునంగల భర్మలింగ పే
టికఁ బ్రతిబింబితమ్మయి పటిష్ఠనిగూఢ తదీయభక్తియున్. ౨౧౬

మ॥ ఒకపుణ్యాంగన బాలచంద్రధరు తూగుయ్యాలపై స్వర్ణ సూ
త్రకబద్ధంబగు లింగపేటిక యురఃప్రాంతంబున న్వ్రేల వ
చ్చి కరాంభోజము లెత్తి పూలుకురిసెన్ జిందంగ మాధుర్యముల్
వికసన్నీరజపత్రవీక్షణరుచుల్ నివ్వాళు లందింపఁగా. ౨౧౭

ఉ॥ జేజెలు జేజెలంచు నొకచేడియ సందిటఁ జిన్నిబిడ్డనిన్
గాజులు సందడింపఁ జనుకట్టున హత్తుచుఁ గేలు మోడ్చినన్
జేజెలు జేజెలంచు దెలిచెక్కుల నవ్వులు దొల్కరింప నా
జేజెకుఁ గేలునాపి మురిసెన్ బసిబిడ్డఁడు చిన్నిచూపులన్. ౨౧౮

మ॥ చెదరం బాఱిన ముంగురుల్ గటితటిన్ జీరాడు చేలమ్మునై
హృదయమ్మెల్ల సమర్పితమ్మనియొకో యేణాక్షి యొక్కర్తు ప
య్యెద చాటింతయులేక భక్తిరసమం దేకాగ్రమై చూచెఁ ద
త్సదనద్వార మెటోయెఱుంగనిత్వరన్ సౌధాగ్రభాగస్థయై. ౨౧౯

శా॥ ఫాలమ్మందు విభూతిరేఖ పయినిన్ బాలేందురేఖాకృతిన్
బోలన్ గుంకుమబొట్టు పాపటపయిన్ బొల్పారు సిందూరమున్

బాలేందుల్ శివమూర్తి చిందులిడఁగాఁ బద్మాక్షి యేతెంచి యా
లీలామానుషవిగ్రహమ్ము కొసఁగెన్ లే బిల్వముల్ భస్మమున్.

కం॥ మన యమ్మగారు పార్వతి
కన దీ యుత్సవ మటంచుఁ గన్నుఁగొలఁకులన్
నినిచెను బాష్పమ్ముల వ
ద్దని కాయము చిత్తమెల్ల ద్రవమయిపోవన్. ౨౨౧

శా॥ కన్నుల్లాసని వృద్ధ వీధితలుపుల్ గైకొంచు నిల్చుండి యా
సన్నంబైన మహోత్సవంబు గని విస్ఫారీభవన్నేత్రయై
నన్నుం బ్రోవుము శంకరా ప్రబల మజ్ఞానంబు పోఁద్రోయింపు మా
యన్నా యటంచును గేలుమోడ్చి పలికెన్ వార్షం బనల్పంబుగా.

శా॥ ఊరేగించిరిఁ దోరుగల్లుపురిలో నున్నట్టి రాదాకులన్
వారా శంకరు నొక్కటి న్విడువకే వర్ధిల్లుభక్త్యున్నతిన్
హారమ్ముల్ నవకంకణమ్ములు సువర్ణాలంకృతుల్ పెక్కుగా
నారాధించిరి యర్పణం బిడుచు నత్యానందనిర్మగ్నులై. ౨౨౩

శా॥ గుండానాగయ దానశౌండుఁడనఁగా గుప్పించె నర్థమ్ము లొ
క్కండున్ లేడ యతృప్తుఁ డుత్సవమునన్ గాలించి వీక్షించినన్
జండాంశుం డది మిన్నుముట్టగనుచున్ వ్రాయించె సంతుష్టి నొ
క్కండున్వీడక, కర్మసాక్షియగుటన్ గల్పించి నీరెండలన్. ౨౨౪

శా॥ ఆ యా భక్తులొసంగ కానుకలఁ దా నర్పించె భక్తాళి కా
గేయస్వీయచరిత్రుఁ డప్పుడె మహాకీర్తిస్ఫురన్మూర్తియై
కాయమ్మిద్ది యశాశ్వతంబు గనె నాకల్పాంత మెవ్వాఁడు నీ
హేమాకీర్ణ ధనమ్ముపైఁ దగులు నేమీ జ్ఞానిచిత్తస్థితుల్. ౨౨౫

మ॥ విమలజ్ఞానము మూర్తిఁ దాల్చె ననఁగా విప్పారు నేత్రమ్ములన్
గమనీయమ్ము విశాల మున్నతమునై కన్పట్టు ఫాలమ్మునన్
రమణీయమ్మగు పేరుర మ్మవయినన్ రాజిల్లు నెమ్మోమునన్
దమమూపుల్ దగులంగ భక్తులయెడందల్ నిల్చె నా స్వామిపై.

శా॥ అంత న్వారలు భక్తిభావమధురమ్మై శంభుకల్యాణమై
సాంతమ్మైన మహోత్సవమ్మున ననాథాంధాదిదీనవ్రజం
బెంతేనిం బరితుష్టిఁబొంద నిడి నానిష్టాన్నదానాదులన్
వంతుల్ మీఱఁగ పౌరవైశ్యులు మహాభాగ్యార్థపిత్రాధిపుల్. ౧౨౮

కం॥ ఆ శంకరుండు భక్తుల
కాశీర్వాదంబు లిచ్చె నాయు ర్ధన వి
ద్యాశోభలుగ లగుచు వర్ధిల
నా శశి రవి యన్వయంబు లబ్బిన్నమ్మై. ౧౨౯

కం॥ మతి నాగని సంతసమున నుతియించిరి వారు శంభునూతనరూప
మ్మతనిని భక్తిస్థిరమతి లత చిగిరిచి పూచినట్టులను బలుకతులన్.

చ॥ జయజయ మంత్రమూర్తిసుతి శంకరకింకరలోకశంకరా
జయజయ భక్తమానసవశంకర శంకర సత్కృపాంబురా
జయజయ పుణ్యమానస ప్రశస్తయశస్తులితేందుమండలా
జయజయ సత్యవర్తన వశంవదభావన దానభూషణా. ౧౩౦

ఉ॥ శంకర నీకృపారసము సంగతి బంధములెల్లఁబాసె మా
కింక భవమ్మునన్ భయ మొకించుక యేనియు లేదు సుమ్మి ని
శ్శంకగ నెల్లవేళల వశంవదమై భవదంఘ్రిభక్తి మా
వంక మెలంగఁజూచిన శుభమ్ములు ముక్తులు గొల్లవెట్టమే. ౧౩౧

కం॥ లోకద్రోహుల నడఁచితి లోకుల నజ్ఞానతమములోఁ బడకుండన్
సాకితివి నీవు శంకరు నాకారము దాల్చి నరుఁడవయ్యు మహాత్మా.

మ॥ అనుచున్ బెక్కువిధమ్ములం గొలిచి రయ్యారాధ్యపాదున్ గుణా
ఢ్యుని నీశుం బలెఁ బుష్పడోలికలలో నూగించి సేవించి వా
రనతః పూర్వసుఖమ్ములం గనిరి నిత్యమ్మైన సద్భక్తి చే
తను బూజించిరి యిష్టదైవతముగా ధన్యాత్ములా శంకరున్. ౧౩౩

కం॥ శంకరునిరూపమగు శ్రీ శంకరచరితమ్ము విన్నఁ జదివినఁ గలుగున్
శంకరలోకము ధ్రువమై శంకరుని కృపాకటాక్ష సత్ఫలమగుచున్.

కం॥ శంకరపదకింకర పదకింకర నరసింగ విమలకీర్తిప్రియ శ్రీ
మంకరవర్తన లలితాలంకారాంగాయనంతలక్ష్మీరమణా.

ఇంద్ర॥ ఆకారవంశాహ్వయవార్ధిచంద్రా
పాకారిభోగోపమ నవ్యభోగా
శ్రీకారవాసా శివభక్తపోషా
సాకారమాహేశ్వర భక్తరూపా. ౨౩౬

శా॥ శ్రీగౌరీహృదయాబ్జబంభర శివశ్రీపాదసేవారతా
రాగద్వేషవిదూర శంకరచరిత్రప్రీతశుద్ధాంతరా
భోగశ్రీపతి వైశ్యవంశజలధి ప్రోద్భూతరాకావతీ
త్యాగశ్రీపరిపూర్ణ నిర్మల త్రికాలారాధ్యమాహేశ్వరా. ౨౩౭

శా॥ హారితశ్రీమునిగోత్ర మల్లయకవీంద్రాదిత్యసత్పుత్ర, సు
స్థిరవిద్వద్గురురాడమోఘకరుణా శ్రీవీరనారాధ్య, వా
క్చిరపుణ్యప్రతిపాద్యమాన మహితశ్రీశంకరారాధ్య, స
చ్చరితమ్మందు దృతీయకాండము కవిశ్లాఘ్యత్వముం గాంచుతన్.

శ్రీ శ్రీ శ్రీ

---

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి—కాపీలు 500—1-5-1949

# తప్పు ఒప్పుల పట్టిక

| పుట | బంతి | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | మహాచ్ఛ్రయా | మహాశ్చర్యా |
| | 11 | చంద్రాహ్లాద | చంద్రహ్లాద |
| 3 | 11 | మనీ ఁడే | మనీష్ఁడీ |
| 5 | 7 | బింకమ్మున్ | బంకమ్మున్ |
| 7 | 18 | వేళనీ | వేళశీ |
| 9 | 16 | నేరకన్ | నేరమిన్ |
| 14 | 11 | ధన్యగుణుఁడు సరసుఁడు | గన్నధన్య జన్ముఁడు |
| | 26 | సరసిoగ | నరసింహా |
| 18 | 17 | సూరి | హూలి |
| | 20 | డెయ్యఁడన్ | డెర్య్యఁడన్ |
| 20 | 20 | కమ్మటీఁడు | కమ్మతీఁడు |
| 21 | 8 | బిడతనమును | బిచ్చగాండ్రను |
| 23 | 6 | మర్థ | బుధ |
| 24 | 1 | త్రిగర్తు | త్రిగర్త |
| | 13 | కాపీర | కాపా |
| 26 | 5 | మఠిని | మతని |
| | 27 | మాటించు | మాకొంచు |
| 27 | 10 | యిది | యది |
| | 25 | శేచి | వేచి |
| 28 | 5 | యీయాలు | మాయిలు |
| | 17 | నట్లు | నట్ల |
| | 20 | నిర్మతి. | నిర్మితి |
| 29 | 4 | వచి | రచి |
| | 19 | వారిని | వారని |
| 30 | 11 | పాటికే | పాటికీ |
| | 19 | తుశేయమ్మెయిన్ | పరేశుంతయున్ |
| 33 | 5 | చన్న | చున్న |
| | 8 | కట్టి | నట్టి |
| | 17 | నెల్ల | నేని |
| | 21 | యింటిలో సింగువ | యింటగబ్బిలముల |
| | 22 | వాఁడు | రాపు |
| 34 | 16 | రెడ్డియున్ | రెడ్డికిన్ |
| 35 | 8 | పేయి | రేయి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 18, 19 | గానమ్ముఅలిక | గానిమ్మఅలిక |
| | 24 | యిటు | యట |
| 36 | 2 | నేరకూరకే | నేరమీరకే |
| | 16 | యచ్చటి | యప్పటి |
| 37 | 3 | జనునె | జనునే |
| | | ననన్ | నను |
| | 9 | యిల్లు | యూరు |
| | 10 | యనిఖ్యాతిన్గన్న | యగునాయిల్లాలు |
| | 13 | లనుచును | లనిమీ |
| | 20 | సాదించునే | సారించునే |
| | 24 | కాఅ | కాగ |
| | 25 | విషయ | విపమ |
| 38 | 15 | యా | దా |
| 39 | 0, 11 | విద్యావైకస్థిత | నిధానైకస్థిర |
| | 20 | ముల్కు | పల్కు |
| 40 | 12 | నల్లువి | పల్లవి |
| 42 | 8 | మాల్యహారమాలన్ | మాల్యహారమాలటన్ |
| 42 | 15 | డుబయిన్ | డునవై |
| 44 | 8 | నలవొక్కింతన్ | నలయాదొకింతన్ |
| | 23 | తమరెంతే | దమయంతీ |
| 45 | 11 | శుభగసు | శుభమదా శుధారా |
| 46 | 15 | వచ్చి | నచ్చి |
| 47 | 12 | నతఁడు | నతని |
| | 22 | చెంత | చెంద |
| | 23 | నూరి | శూలి |
| | | తాత | దాత |
| 48 | 7 | కలికి | కవికి |
| | 12 | కవీంద్రుఁడు | కవీంద్రుఁడు |
| | 13 | చెలువున్ | చెలువుల్ |
| | | యొగటి | యొకటి |
| 52 | 2 | చేర్చిన | బేర్చిన |
| | 11 | లేచి | వేచి |
| 54 | 22 | పుర్ణము | పూర్ణము |
| 55 | 10 | వీన | చిన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 56 | | సాదింప | సాధింప |
| 58 | 7 | లేచిన | వేచిన |
| 62 | 2 | పొడలే | పొడవా |
| 66 | 12 | నొదలించెన్ | నొదవించెఁ |
| 67 | 21 | పట్టున్ | పట్టుఁ |
| 71 | 26 | తుదిఁ | తుదన్ |
| 72 | 1 | మొందటం | మొదలుం |
| | 2 | బదిలమ్మ్రొయొదనుం | బడిలమ్మె, యొదలుం |
| 77 | 6 | యాని | యానొ |
| 79 | 13 | నాడ | నాత |
| 80 | 3 | యొప్పూ | యొప్పు |
| 92 | 20 | మహేశ్వరి | మహీశ్వరి |
| 96 | 1 | యీా | యా |
| 105 | 18 | లక్షింఁపగ | లక్షింపక |
| 107 | 2 | వింతలు | లింతలుం |
| 110 | 8 | ష్కులును (క్రై | ష్కులునుం గ్రై) |
| | 17 | రాటు | యటు |
| 114 | 22 | యంత | యెంత |
| 11 | 22 | లట్లు | లల్లు |
| 123 | 1 | డుండా | గుండా |
| | 20 | కలుఁగఁగ | కఱుఁగఁగ |
| | 22 | కపీంద్రంబు | కపేంద్రంబు |
| 125 | 2 | చంటిఁ | చంటన్ |
| 127 | 1 | మధురమై | మధురమ్మై |
| | 8 | రలి | రవి |
| | | అఖ్భిన్న | అచ్ఛిన్న |
| 128 | 8 | భక్త | భక్తి |
| | 12 | మాహేశ్వరా | మానేశ్వరా. |

మఱియును బట్టుపడనివాని సవరించుకొను భారము సహృదయులదని విన్నపము

మ. వీ. శర్మ.